

'భళ్ళమూడివారి చిట్టి'

## కీ.శే. తంగిరాల శకుంతలాదేవి

జననం : 30-04-1940 మరణం : 31-08-2006

# చైతన్య కవిత
# 43, 44, 45 & 46

వ్యయ వసంతం - సర్వజిత్తు శరత్తు

**April 2006 - October 2007**


సంపాదకుడు

తంగిరాల వెంకటసుబ్బారావు

సహాయకులు

దివాకర్ల రాజేశ్వరి - అంబికా అనంత్

గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డి



చైతన్య కవితా వేదిక

#1708, "సీతావధానం", 11వ క్రాస్

1వ "జి" మెయిన్, కెంగేరి ఉపనగరం

బెంగుళూరు - 560 060

*CHAITANYA KAVITA, a journal devoted to Modern Telugu Poetry and edited and published by Prof. T.V. Subba Rao (Retd.), # 1708, "Sitavadhanam", 11th Cross, 1st "G" Main, Kengeri Satellite Town, Bangalore - 560 060: From April 2006 to October 2007.*

'చైతన్యకవిత' మహారాజ పోషకులు: 'దాన చింతామణి' శ్రీ డి.కె. ఆదికేశవులుగారు,
పార్లమెంటు సభ్యులు, చిత్తూరు, ఆంధ్రప్రదేశ్.

**Pp.** : **192**

**Price** : **Rs. 100/-**

**Permanent Membership: Rs. 1000/- ($ 100/- U.S.A)**

ముఖచిత్రం : కీ.శే. పఠాభి (తిక్కవరపు పట్టాభిరామరెడ్డి : 1919-2006)

అట్టవెనుక : కీ.శే. గుంటూరు శేషేంద్రశర్మ (1927-2007)

అక్షరాలంకరణ : ఆచార్య పి.సి. నరసింహారెడ్డి, హైదరాబాద్.
'కళాప్రపూర్ణ' శ్రీ బాపు, చెన్నై.

**For Copies** : **Prof. T.V. Subba Rao (Retd.)**
# 1708, "Sitavadhanam", 11th Cross
1st 'G' Main, Kengeri Satellite Town
BANGALORE - 560 060
Phone No. 080-65322742; Cell: 98807 22742

గమనిక : శాశ్వతచందా ఎం.ఓ. రూపంలో కాని, డి.డి. రూపంలో కాని "ప్రొ॥ టి. వి. సుబ్బారావు" పేరుతో మాత్రమే పంపాలి. చెక్కులు అంగీకరించబడవు. (బెంగుళూరు నగరంలో ఉన్నవారు మాత్రం చెక్కులు ఇవ్వవచ్చును).

**DTP** : **Sri Lakshmi Graphics**
Bangalore - 79, Phone: 080-23100603

**Printed by** : **Omkar Offset Printers**
# 3/3, N.T. Pet, Bangalore - 560 002
Ph : +91 - 080 - 2670 8186, 2670 9026
e-mail : omkaroffset@gmail.com
Website : www.omkarprinters.com

# అంకితం

నా

ప్రాణంలో ప్రాణం

నా

'చిట్టి'

కీ.శే. తంగిరాల (భళ్ళముూడి) శకుంతలాదేవి

దివ్యస్మృతికి ...

అశ్రునివాళితో ...

భర్త

తంగిరాల సుబ్బారావు

# వసంత కోకిలలు - శరత్తారలు

# నా ముద్దబంతి పువ్వు

- తంగిరాల

## 1

మబ్బులేదు చినుకులేదు
ఉరుములేదు మెరుపులేదు
ఉన్నట్టుండి నడినెత్తిని పిడిగుపడింది!
మిన్నువిరిగి మీదపడింది!

ఉలుకులేదు పలుకులేదు
ఊపిరి అసలే లేదు!
కాళ్ళు చల్లన చేతులు చల్లన
(నా గుండె ఝల్లన!)
ఒళ్ళంతా కొయ్యబారిపోయింది
గుండె చప్పుడు ఎక్కడికో పారిపోయింది
ప్రాణం జారిపోయింది...!
హంస ఎగిరిపోయింది...!!

నీ మెడలో వేసిన
నా గుండె పూసిన
గులాబీల దండ -
నీ ఒంటి చుట్టూ కట్టిన
'శంకరి' పెట్టిన
వెంకటగిరి జరీచీర -
'కెంగేరి' శ్మశాన చితాగ్ని జ్వాలల్లో
భస్మీపటలం ...!
అచ్చమైన ఆవు నేతితో తడిసిన
నీ పచ్చని దబ్బపండు శరీరం ఆయుస్సు
పితృవన హోమకుండంలో హవిస్సు!
నా శరీరంలో సగం చచ్చుబడింది
ఎడమకంటి చూపులో చిచ్చుపడింది...!

## 2

నా జీవన నాటకంలో -
బాల్యం నుండి పెళ్ళివరకూ మొదటి అంకం :
అజ్ఞానం, ఆశ్చర్యం, పేదరికం, చదువు సంధ్యల కష్టాల పంకం !
పెళ్ళినుండి చిన్న ఉద్యోగం వరకూ రెండవ అంకం :
కొవ్వూరు-ఏలూరు-తణుకు -
పోస్టాపీసుల్లో గుమాస్తాగిరి
ముగ్గురు పిల్లల సంతానపు సిరి!

1961లో
కేంద్ర ప్రభుత్వోద్యోగానికి
నా రాజీనామా సాహసం!
తిరుపతిలో మళ్ళీ మాస్టర్ డిగ్రీ చదువు పరిశోధన
ఇది మూడవ అంకం:
చంటీ వెంటా సంతానంతో
కొన్నాళ్ళు పుట్టినింట్లో
మరికొన్నాళ్ళు మెట్టినింట్లో
నాకు దూరంగా నీ వనవాసం!
అష్టకష్టాలతో
ఐదుగురు పిల్లలతో
మొత్తానికి గట్టెక్కగా మన ఘనసంతోషం!

1969లో
బెంగుళూరులో పెట్టిన నా మొట్టమొదటి అడుగు
మన సుఖసంసారానికి ఎత్తిపట్టిన బంగరు గొడుగు!
నాయికా నాయకుల వనవిహారంతో
పిల్లల రంగురంగుల భవిష్యత్ స్వప్నాలతో
రెక్కలు వచ్చిన పక్షులు ఎగిరే స్వేచ్ఛావిహాయసంతో
ఈనాటి వరకూ హాయిగా గడచిన నాల్గవ అంకం!
ఇకమీదట -
నా ఏక పాత్రాభినయాన్విత పంచమాంకం ప్రారంభం

విషాదాంత రూపక పతాక సన్నివేశాల సంరంభం
రేపు ఒంటెద్దుబండి పయనం
చూపు శుక్రాచార్య నయనం!

## 3

"రేపటి నుండి You are a free bird"
– అన్నాడొక ఆధునిక ఉద్దాలక మహర్షి'!
భార్య 'చండిక'తో బాధలు పడుతున్న వింత తపస్వి!
అవును నేను పక్షినే
కాని స్వేచ్ఛా విహంగాన్ని మాత్రం కాను
కనీసం గజం ఎత్తు కూడా ఎగరలేను
కారణం?
మారణ రావణ కరవాలంతో
రెక్కలు నరకబడి నేలకూలినవాణ్ణి
రక్తసిక్తగాత్రంతో విలవిల తన్నుకుంటున్నవాణ్ణి
అలనాటి జటాయువు తమ్ముణ్ణి!
విధి నరసింగరాజు శూలం విసిరితే
పేగులు బయటపడ్డ పలనాటి బాలచంద్రుణ్ణి!

## 4

బాల్యంలో
అందాల అపరంజి బమ్మ
'పెద్ద మామయ్య' గారాల ముద్దుగుమ్మ
యౌవనంలో –
అరవిరిసిన సంక్రాంతి ముద్ద బంతి పువ్వు!
జీవితాంతము వాడని
నను వీడని
'చిట్టి' చేమంతి నవ్వు!
నా హృదయ మందిరంలో
చందన ధూప

కర్పూర దీప
ఫల పుష్ప నైవేద్య
పరిమళ భరితమైన
దేవుని గది!
మా యింట వెలసిన మహాలక్ష్మి
మమతానురాగల పాలవెల్లి
అతిథులకు అభ్యాగతులకు
ఆదరాభిమానాల కల్పవల్లి!

## 5

అఖండ గౌతమీ తీరంలో -
నా కోసం
ఒక దివ్యాప్సరసగా జన్మించావు!
మన గార్హస్థ్య జీవన పర్యంతమూ
నా ఏకా దశేంద్రియాలలో
ఒక జీవనదిగా ప్రవహించావు!

**1944**
నీకు నాలుగేళ్ళు
నాకు తొమ్మిదేళ్ళు
నా ఉపనయనాకి వచ్చిన
'చిట్టి' అతిథివి నీవు!

**1954**
నీకు పధ్నాలుగేళ్ళు
నాకు పంధొమ్మిదేళ్ళు
ఇద్దరికీ మూడుముళ్ళు
సప్తపది - నాతిచరామి - నాగవల్లి!

**1955-2005**
కొవ్వూరు - తణుకు - తిరుపతి - బెంగుళూరు

నాలుగు నదుల తరంగాల మీద
యాభైయేళ్ళు సాగిన మన సంసార నౌక!

**2006**
నీకు - **66**
నాకు - **71**
ఏప్రిల్ **12** 'రాజకుమార్' మరణం
రోగంతో ప్రారంభం నీ రణం
కాలునొప్పి వీపునొప్పి ఒళ్ళంతా నొప్పి
బాధ బాధ బాధ యమబాధ మరణబాధ
Lung Infection,Kidney Infection,Urinary Track Infection
ఒకటి తగ్గితే ఇంకొకటి - ఇంకొకటి తగ్గితే మరొకటి
పదే పదే - ఇదే ఇదే - పునరుక్తి
నశించింది నీలో బాధలు భరించే శక్తి
"గదిలో మంచమె యెల్లలోకమ్మై" గడిచాయి ఐదునెలలు
నీ బాధ చూడలేక Kidney Operation కి మా అంగీకారం
ఎక్కించారు anaesthetic medicine
Operation success but petient unconscious
**1, 2, 3, 4, 5, 6** రోజులు స్పృహ లేదు
అచేతన స్థితిలో కూడా బాధతో మూలుగు మానలేదు
Ventilator తో పునఃచైతన్యం
బాధల పునఃప్రారంభం
రకరకాల ఆసుపత్రుల చుట్టూ ప్రదక్షిణాలు
"సహన" - "జయదేవ" - "Manipal North Side"
"Manipal Main Airport Side"
మళ్ళీ మొదటికి "సహన"కి -
మళ్ళీ బాధలు మొదటికి -
లక్షల లక్షల రూపాయలు
మంచినీళ్ళప్రాయంగా ఖర్చులు ...
ఏడు లక్షలకు రెక్కలు వచ్చి ఎగిరిపోయినా
ఏమీ సాధించలేని విధివంచితులం!
నీ ప్రాణాలు కాపాడుకోలేని నిర్భాగ్యులం!!

**31-8-2006/1-9-2006** మధ్య
అర్ధరాత్రి **1.30** – తెల్లవారుజామున **3.30**
నడుమ నిద్రలో ఎప్పుడో ... ఏమో ...
ఆధివ్యాధుల విముక్తి కోసం
నితాంత ప్రశాంతి కోసం
నీ పవిత్రాత్మ
స్వర్లోక ప్రస్థానం!
ఇక
ఇడుమల పుడమిలో
ఏకాంతంలో
నా స్థానం!!

## 6

చిన్నతనంనుండీ ఇద్దరం కృష్ణభక్తులం
జన్మాష్టమి నాడు – ఆ కన్నయ్య కృపతో అప్పుడు –
మన "సీతావధాన" నూతన గృహప్రవేశం!
ఇప్పుడు – రాధాష్టమి నాడు –
నీ శాశ్వత నిర్గమనం!
దారీ తెన్నూ లేని దట్టమైన దిగులుఅడవిలో
తడబడుతూ నా అడుగులు ....

చిట్టీ!
గట్టిగా ఆలోచిస్తే –
నిజానికి నీవెక్కడికీ పోలేదు –
కొడుకులలో కూతుళ్ళలో
మనుమలలో, మనుమరాండ్రలో
నీవు నాకు బహూకరించిన
ఈ సంసార సుందర నందనవనంలో
నిత్యం నాకు కనబడుతూనే ఉన్నావు!
వారి చిరునవ్వులో – చిద్విలాసంలో
కంటి చూపులో – కంఠస్వరంలో

మేలిమి బంగరు మేనికాంతిలో
నడకలో పడకలో
తిన్నని ఆకృతిలో
అన్నపానాల స్వీకృతిలో
అహోరాత్రాలు నాకు దర్శనమిస్తూనే ఉన్నావు!
మనశ్శాంతిని ప్రసాదిస్తూనే ఉన్నావు!!

(సశేషం)

తెలుగు సాహిత్యంలో మహాకవి శేషేంద్ర ప్రవేశమొక జాజ్జ్వలమానమైన నూత్నశకాన్ని ఆవిష్కరించింది. ఆయన కావ్యద్రష్టృత్వం మానవీయ భవిష్యత్తును, గమ్యాన్ని ఎప్పుడు స్పృశిస్తుందో అప్పుడంతా ఒక ఉదాత్త గంభీర స్వరంలో దాన్ని ఆవిష్కరిస్తుంది. ఆయన వ్రాసిన 'నా దేశం - నా ప్రజలు' అన్న ఆధునిక మహేతిహాస గ్రీకు భాషానువాద పీఠికలో విశ్వవిఖ్యాత గ్రీకు మహాకవి "నిఖిఫోరస్ వృత్తాకోస్" ఇలా అన్నారు:

"Personally I would compare the pain and anguish of the poet with the one of LOUTRE-MONT (the founder of Surrealism) in his lyric "MALD - AURORE". The difference is that Seshendra's protest is not made in the void. He walks firmly on the soil. At times we observe in his poem a biblical and prophetic tone which attracts as."

ఇలాగే హిందీ, ఉర్దూ, బంగ్లా ఇంకా అనేక భారతీయ భాషల్లోకి అనువదింపబడిన శేషేంద్ర కావ్యాలను చదివిన ఆయా భాషా కవి విమర్శకులు అపార ప్రశంసా వర్షాలను కురిపించారు.

– తెలుగు విశ్వవిద్యాలయ డాక్టరేటు ప్రదాన ప్రశంసాపత్రం నుండి

## సంపాదకీయం-1:

# ఆంధ్రుల అష్టకష్టాలు

(ఇక్కడ "ఆంధ్రులు" అంటే తెలంగాణ + రాయలసీమ + కోస్తాజిల్లాలలో ఉన్న తెలుగువారందరూ అని అర్థం. కేవలం కోస్తాజిల్లాలవారని అర్థం కాదు. తెలంగాణా వాదులు గమనింప ప్రార్థన).

## I. ప్రజల దుస్థితి:

ఆంధ్రప్రదేశ్‌లోను మొత్తం భారతదేశంలోను ప్రభుత్వాలు మారి మూడు సంవత్సరాల కాలం గడిచింది. కాని ప్రజల స్థితిగతులు మాత్రం ఏమీ మారలేదు సరికదా ఇంకా దిగజారిపోతున్నాయి. కలలు కన్న 'స్వర్ణాంధ్ర' నిన్న 'ఋణాంధ్ర'గా మారిపోయింది; నేడు అది 'రుధిరాంధ్ర''గా, ''మదిరాంధ్ర''గా మారిపోతోంది. ~~ఈ~~ పాలనకు తోడు 'సునామీ' వంటి ప్రకృతి వైపరీత్యాలు కూడా సంభవించాయి. ముస్లిం ఉగ్రవాదుల బాంబుల దాడుల్లో అమాయక ప్రజలు హతమైపోతున్నారు. ఒక ప్రక్క నక్సలైట్లు - మరొకప్రక్క పోలీసులు పరస్పర హింసాక్రీడలో మరణమృదంగాలు మ్రోగిస్తున్నారు. రాయలసీమలో ముఖ్యంగా అనంతపురం జిల్లాలో ముఠాకక్షల నెత్తురుటేరులు పారటం పరిపాటి అయిపోయింది. వేసవి మండుటెండల్లో ప్రజల గొంతులు ఎండిపోయాయి. ప్రజలు వలసపోయారు. వర్షాకాలం వచ్చేసరికి కృష్ణాగోదావరులు పొంగి పొరలి వరదలు ఉద్ధృతంగా వచ్చాయి. గ్రామాలు మునిగిపోయాయి; పంటలు నాశనమయ్యాయి. వానలతో భాగ్యనగరం తడిసి ముద్దయిపోయింది. లోతట్టు ప్రాంతాలు మునిగిపోయాయి. అతివృష్టి-అనావృష్టి! రెవిన్యూకోసం ప్రభుత్వం మద్యంవ్యాపారాన్ని సరళీకృతం చేసి, ప్రతిపల్లెలోనూ బార్‌లు తెరిచే ఏర్పాట్లు చేస్తోంది. హైవేలు అభివృద్ధి చెందినా రోజూ రోడ్డు ప్రమాదాలే. మద్యపానం చేసి నిర్లక్ష్యంగా నడపడంవల్ల ఎందరో అమాయకులు ప్రాణాలు కోల్పుతున్నారు. మాటిమాటికీ పెంచుతున్న పెట్రోలు, డీసెల్ ధరలతోపాటు నిత్యావసరవస్తువుల ధరలుకూడా పెరిగిపోతున్నాయి. నిరుపేదల బ్రతుకులు, మధ్యతరగతి ప్రజల బ్రతుకులు దుర్భరంగా మారుతున్నాయి. ఆకలి, నిరుద్యోగం నానాటికీ పెరిగిపోతున్నాయి. ఆంధ్రుల (లేదా మొత్తం భారతీయుల) అష్టకష్టాలకు మూలకారణం ఏమిటి? (సవాలక్ష కారణాలతో నాకు తోచిన కొన్ని కారణాలు).

1. **జనాభా:** 1947లో భారతదేశ జనాభా 30 కోట్లు. ఇప్పుడది 100 కోట్లకు పెరిగింది. సమస్యలు కూడా మూడురెట్లు పెరిగాయి. కేవలం హిందువులు మాత్రమే కుటుంబనియంత్రణను పాటిస్తున్నారు. ముస్లిములు (క్రైస్తవులలో రోమన్ క్యాథలిక్కులు) పాటించడం లేదు. (మన దేశంలో అన్ని మతాలవారికీ కలిపి ఒకేవిధమైన కామన్ సివిల్ కోడ్ లేదు). ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే రాబోయే 200 సంవత్సరాలలో హిందువులు మైనారిటీలుగాను, ముస్లిములు మెజారిటీగాను మారిపోతారని గణాంకనిపుణులు హెచ్చరిస్తున్నారు. అయితే నష్టమేమిటి? అంటే – ముస్లిముల జనాభా అధికం కావడంవల్లనే పాకిస్థాన్ (+ బంగ్లాదేశ్) ఏర్పడింది. ఇప్పుడు పాకిస్థాన్‌లోను బంగ్లాదేశ్‌లోను (దేశవిభజన సమయంలో చంపివేయగా మిగిలిన 1% కూడా లేని) హిందువులు బ్రతుకుతున్న నీచపు బ్రతుకులే భారతదేశంలోని హిందువులందరూ బ్రతుకవలసి వస్తుంది.

2. **అవినీతి:** రాజకీయవేత్తలు, ప్రభుత్వాధికారులు, కాంట్రాక్టర్లు - లంచగొండులుగా మారి, కోట్లాదిరూపాయల ప్రజాధనాన్ని కొల్లగొడుతున్నారు. (ముఖ్యంగా ప్రాజెక్టుల నిర్మాణంలో).

3. **సంఘర్షణ:** పేదలు నిరుపేదలుగా దిగజారిపోయారు; ధనికులు మరింత ధనికులుగా పైపైకి ఎదిగిపోయారు. ఈ కారణంగా కారల్‌మార్క్స్ సిద్ధాంతం ప్రకారం నిరుపేదలకు మహాధనికులకు సంఘర్షణ స్థితి ఏర్పడింది. (ఇదే నేటి నక్సల్స్ సమస్యకు మూలకారణం).

4. **కాశ్మీర్ సమస్య:** 1947 నుండి ఈనాటి వరకూ రావణకాష్ఠంలా రగులుతున్న కాశ్మీరు సమస్యతో వేలాది సైనికులు, పోలీసులు నేలకొరిగారు. రోజుకు 50 కోట్ల రూపాయలు కాశ్మీర్‌లో ఖర్చుచేస్తోంది మన ప్రభుత్వం. 1947 నుండి ఈనాటివరకూ ఎంత ప్రజాధనం వృథా అయిందో తలచుకుంటే గుండె గుభేలుమంటుంది. "తూర్పు బెంగాల్" (నేటి బంగ్లాదేశ్) ను మనం తీసికొని, కాశ్మీర్‌ను పాకిస్థాన్‌కు ఇచ్చివేద్దాం" అని అప్పట్లో అంటే 1946లో సర్దార్ పటేల్ చెపితే, నెహ్రూగారు వినలేదట! కాశ్మీరు నుండి హిందువులు (కాశ్మీరీ పండితులు) తరిమివేయబడ్డారు. వారంతా ఢిల్లీ ఫుట్‌పాత్‌ల మీదా, కాందిశీకుల శరణాలయాల్లోను తలదాచుకుంటున్నారు. వీరిని గురించి ఒక్క రాజకీయపార్టీకూడా పట్టించుకోవడంలేదు. వీరిని పట్టించుకుంటే ముస్లిముల ఓట్లు పోతాయి కదా!

5. **రౌడీస్వామ్యం:** ప్రజాస్వామ్యం పేరుతో ధనస్వామ్యం కొనసాగుతోంది. బూటకపు ఎన్నికలతో రౌడీలు, గూండాలు, హంతకులు, లంచగొండులు, అక్రమధనవంతులు, కులగజ్జినాయకులు ప్రజాప్రతినిధులుగా ఎన్నిక అవుతున్నారు. నోట్లకట్టలతో, సారాప్యాకెట్లతో, దొంగఓట్లతో, బూత్‌క్యాప్చరింగ్‌తో, రిగ్గింగ్‌తో నెగ్గుతున్నారు. ఇలా ఎన్నిక అయిన రాజకీయ నాయకమ్మన్యులు కోటానుకోట్ల రూపాయల స్కాములతో దేశాన్ని లూటీ చేస్తున్నారు. Outer Ring Road దగ్గర ఎకరం కోటి రూపాయల విలువచేసే భూముల్ని ఆక్రమించుకుంటున్నారు.వందలాది ఎకరాల దేవాలయభూముల్ని కూడా కబ్జా చేస్తున్నారు.

6. **రిజర్వేషన్లు:** (1) భారత రాజ్యాంగ నిర్మాత అయిన డా॥ బి. ఆర్ అంబేడ్కర్ చెప్పిన ప్రకారం 1950 నుండి 1960 వరకూ కేవలం పది సంవత్సరాలు మాత్రమే ఉండవలసిన రిజర్వేషన్లు, 57 సంవత్సరాలు దాటినా ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. ఎస్.సి., ఎస్.టి., బి.సి.లను ఓటుబ్యాంకులుగా చేసికొన్న రాజకీయవేత్తలు, ఆయావర్గాల నాయకులు ఈ నాటకం ఆడుతున్నారు. దీనితో గత అర్ధశతాబ్దిగా ప్రతిభావంతులైన అగ్రకులాల యువతీయువకులకు తీరని అన్యాయం జరుగుతోంది.

7. **రిజర్వేషన్లు:** (2) రిజర్వేషన్లు మొత్తంమీద 50% మించకూడదని రాజ్యాంగమూ సుప్రీంకోర్టూ నిర్ణయించినా సరే, కుటిల రాజకీయవేత్తలు కొన్ని రాష్ట్రాలలో (తమిళనాడు, ఉత్తరప్రదేశ్, బీహార్ మొ॥చోట్ల) 60% మించిపోయిన రిజర్వేషన్లు పాటిస్తున్నారు. (ఇప్పుడు ముస్లిములకు 5% రిజర్వేషన్ పాటిస్తే, ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఈ రిజర్వేషన్లు 50% దాటుతాయి). ప్రవేటు రంగంలో కూడా ఈ రిజర్వేషన్లు పాటించాలని చూస్తోంది ప్రభుత్వం. దీనితో ప్రతిభ ఇంకా పతనానికి దారి తీస్తుందనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

8. **డొనేషన్లు:** ప్రతిభను సర్వనాశనం చేసే కులాల ఆధారితమైన రిజర్వేషన్లకు సైదోడుగా, ధనికులు లక్షలాది రూపాయల డొనేషన్లతో మెడిసిన్, ఇంజనీరింగ్, ఫార్మసీ, ఎం.బి.ఏ., ఎం.సి.ఏ. మొదలైన డిగ్రీలను కొనివేస్తున్నారు. ఈ పద్ధతివల్ల పేదలలోని ప్రతిభావంతులైన యువతీయువకులకు మిక్కిలి నష్టం జరుగుతోంది. రిజర్వేషన్‌తో లేదా డొనేషన్‌తో సీటు తీసుకోగలరు లేదా కొనుక్కోగలరు. కాని ప్రతిభను తీసుకోలేరు లేదా కొనుక్కోలేరు కదా!

అందువల్ల ఈ రెండు రకాల విద్యార్థులు కఠినమైన మెడిసిన్, ఇంజినీరింగ్ వంటి డిగ్రీలు ప్యాసుకావటానికి నానా అవస్థలూ పడుతున్నారు. కొందరు అడ్డదారులు తొక్కుతున్నారు. మరికొందరు ప్రొఫెసర్‌లను బెదిరిస్తున్నారు; వారిపై దౌర్జన్యాలకు పూనుకొంటున్నారు.

9. **వలసలు:** ప్రతిభావంతులైన డాక్టర్లు ఇంజనీర్లు అమెరికాకు ఇంగ్లండుకు వలసలు పోతున్నారు. (వీరిలో ఎక్కువమంది అగ్రవర్ణాలవారు - ముఖ్యంగా బ్రాహ్మణులు కావడం గమనార్హం).

10. **విద్యావ్యాపారం:** ప్రవేటు విద్యారంగం పెద్ద వ్యాపారంగా మారిపోయింది. పేద విద్యార్థులకు చదువుకొనే అవకాశమే లేకుండా పోయింది. (రెసిడెన్షియల్ స్కూళ్ళు, కాలేజీలు, కోచింగ్ సెంటర్లు కోట్ల రూపాయల వ్యాపారం చేస్తున్నాయి). ప్రభుత్వ పాఠశాలలు, కళాశాలలు మూతపడుతున్నాయి. ఒక ఆటపాట లేకుండా, కేవలం కోళ్ళఫారమ్స్‌లో కోళ్ళను పెంచినట్లుగా, రెసిడెన్షియల్ కాలేజిలలో విద్యార్థులను బట్టీపట్టే యంత్రాలుగా తయారు చేస్తున్నారు.

11. **పర్యావరణ ధ్వంసం:** అరణ్యాలు నరకివేయటం, పెద్దపెద్ద ప్రాజెక్టులు కట్టడం, కాలుష్యాన్ని పెంచే పరిశ్రమలను స్థాపించడం, రొయ్యల చెరువులు పెంచడం, ప్లాస్టిక్ వస్తువుల వాడకం పెరగడం, నగరాలలో పట్టణాలలో ట్రాఫిక్ పిచ్చిగా పెరిగిపోవడం - ఇత్యాదులవల్ల పర్యావరణం సర్వనాశనం అయిపోతోంది. ఫలితంగా వేసివిలో ఉష్ణోగ్రతలు పెరిగిపోవడం, వర్షాభావం, కరవులు, ఆకలిచావులు, భయంకర రోగాలు సంభవిస్తున్నాయి.

12. **రైతు సమస్యలు:** వ్యవసాయ రంగాన్ని, రైతు సమస్యల్ని ప్రభుత్వం పట్టించుకోకపోవడంతో కిట్టుబాటు ధరలు లేక, అప్పులపాలైన రైతులు గత పది సంవత్సరాలుగా ఆత్మహత్యలు చేసుకుంటూనే ఉన్నారు.

13. **చేనేతవంటి కులవృత్తుల సమస్యలు:** చేనేత వంటి కులవృత్తులను కూడా ప్రభుత్వం అశ్రద్ధచేస్తోంది. చేనేత కార్మికులెందరో ఆత్మహత్యలు చేసుకున్నారు. ప్లాస్టిక్ పరిశ్రమ మితిమీరిపోయి, కుమ్మరి వృత్తిని పాతాళానికి త్రొక్కి వేసింది.

14. **దీనస్థితిలో మాతృభాష:** మాతృభాష తెలుగు అన్నివిధాలా అనాదరణకు లోనయింది. ప్రజల ఆంగ్లభాషా వ్యామోహంతో తెలుగు నశించిపోయే స్థితికి

చేరుకుంది. ఆంగ్లమాధ్యమపాఠశాలలు అన్నిచోట్లా పుట్టగొడుగుల్లా పుట్టు కొస్తున్నాయి. ద్వితీయభాషగా కూడా తెలుగుకు అన్యాయమే జరుగుతోంది. మార్కులు ఎక్కువ వస్తాయని విద్యార్థులందరూ తెలుగును వదిలేసి సంస్కృతాన్ని ద్వితీయభాషగా స్వీకరిస్తున్నారు.

15. **సంకరభాష-జానపదభాష:** తెలుగు ఇంగ్లీషు కలిసిన ఒక విధమైన సంకరభాషను టి.వీ.లు, సినిమాలు వ్యాపింపజేస్తున్నాయి. ఉదా॥ "చాలా happy గా feel అవుతున్నాను". ఆనాడు గిడుగు రామమూర్తిగారు కలలుగన్న "శిష్టవ్యావహారికం", ఈనాడు "దుష్టవ్యావహారికం"గా మారిపోయింది. ఉచ్చారణలో దంత్య తాలవ్యచజల భేదం లేదు ("చ్యాలా బాగుంది"). మహాప్రాణాల ఉచ్చారణ లేదు ("బారతం, బాద"). పదాది 'వ' కారాన్ని జారవిడుస్తున్నారు ("ఆడు, ఈడు"). శిష్టవ్యావహారికంగా ఉండవలసిన ప్రమాణభాష ఈనాడు నిరక్షరాస్యులైన రైతులు వెనుకబడిన కులాలవారు మాటలాడే శిష్టేతరమైన జానపదభాషగా పరిణామం చెందుతోంది. "ఆడు-ఈడు-ఒత్తాడు-ఎల్తాడు-కూకో-లెగు-ఎల్లు- ఏంటి?, ఎలిపోద్ది, ఒచ్చేద్ది, అవుద్ది, ఉంటాది, ఒస్తంది, చేస్తంది" - ఇదీ ఈనాటి సినిమా హీరోల భాష, (దీనినే సి.పి.బ్రౌను దొరగారు "శూద్రకూతలు" అన్నారు). నేటి యువతీయువకులందరూ (బ్రాహ్మణులతో సహా) ఈ భాషనే అనుకరిస్తున్నారు. భూమి, బంగారం, రాజకీయాధికారం, ప్రసారమాధ్యమాలు, వ్యాపారం, పరిశ్రమలు - ఇత్యాదులు ఎవరిచేతిలో ఉంటాయో వాడే నేటి ప్రజాస్వామ్యంలో రాజాధిరాజు. ఈనాడు ఇవన్నీ శూద్రుల చేతిలో (ముఖ్యంగా కమ్మ-రెడ్డి కులాల చేతిలో) ఉన్నాయి. వారిభాషే ప్రమాణభాషగా చెలామణి అవుతోంది. పూర్వం నాటకాలలో సినిమాలలో నీచపాత్రలకు ఉపయోగించే భాష - ఈనాడు నాయికా నాయకుల భాషగా (ఉత్తమపాత్రల భాషగా) స్థిరపడింది.

16. **సినిమాలు:** ప్రజా సమస్యలను ఏ మాత్రమూ పట్టించుకోకుండా నేటి సినిమాలు అసభ్య శృంగారాన్ని, హింసను, ద్వేషాన్ని, పగను ప్రోత్సహిస్తూ ప్రమాణభాషను ఖూనీ చేస్తూ, అభూత కల్పనలతో కొనసాగుతున్నాయి. ("గోదావరి - బమ్మరిల్లు - ఆనంద్ - బమ్మలాట" వంటి మంచి సినిమాలు కూడా అప్పుడప్పుడు వస్తున్నాయి.) చెత్త సినిమాల ప్రభావంతో యువకులు పెడత్రోవ పడుతున్నారు. "ప్రేమిస్తున్నా-ప్రేమిస్తున్నా" అంటూ యువతులను వేధిస్తున్నారు. వారిమీద యాసిడ్ ఎటాక్‌లు, అత్యాచారాలు,

హత్యలు కొనసాగిస్తున్నారు. టి.వి. సీరియల్స్ కూడా సినిమాల అడుగుజాడల్లోనే నడుస్తూ, మంత్రాలు తంత్రాలు దెయ్యాలూ భూతాలూ మొదలైన అంధవిశ్వాసాలకు పట్టం కడుతున్నాయి.

17. **నక్సల్స్ సమస్య:** ఇది నానాటికీ పెరిగిపోతోంది. ఒకప్రక్క పోలీసులు, మరోప్రక్క నక్సలైట్లు హింసను ఆరని అగ్నిజ్వాలగా ప్రజ్వరిల్లజేస్తున్నారు. మధ్యలో గిరిజనులు, పల్లెప్రజలు లేగదూడల్లా నలిగిపోతున్నారు. ఈనాడు నిరుపేదల్లో 5% మాత్రమే తుపాకులు పట్టుకున్నారు. క్రమక్రమంగా వీరి సంఖ్య పెరిగి 50% చేరుకుంటే విప్లవం విజయవంతం అవుతుంది. సమసమాజం ఏర్పడుతుంది. అయితే కవులు కళాకారులు హింసను ప్రబోధించవచ్చునా? అన్నది సమస్య. అత్యవసరమైనప్పుడు హింస తప్పదు. భగవద్గీతలో భగవంతుడే హింసను ప్రోత్సహించాడు కదా!

18. **గ్లోబలైజేషన్-భారతీయ సంస్కృతికి ముప్పు:** గ్లోబలైజేషన్ వల్ల భారతీయ సంస్కృతిపై అమెరికా వ్యాపారసంస్కృతి పెద్దఎత్తున దాడిచేస్తోంది. మానవతా విలువలు నశించిపోతున్నాయి. కడుపున పుట్టిన పిల్లలు కన్న తల్లిదండ్రుల్ని పట్టించుకోవడం లేదు. ఎక్కడ చూచినా వృద్ధాశ్రమాలు పెరిగిపోతున్నాయి. (బ్రిటిషువారి పాలనలో భారతీయసంస్కృతి దెబ్బతిన్నదని గోలపెడుతూ గుండెలు బాదుకున్నారు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు. ఆయన 'వేయి పడగలు" నవలను రచించడంలో ముఖ్యోద్దేశం ఇదే. అప్పుడు విశ్వనాథవారిది 'వెనుకచూపు" అని అభ్యుదయ రచయితలందరూ ఆయన్ని ఆక్షేపించారు. ఇప్పుడు అదే అభ్యుదయ రచయితలు, విప్లవ రచయితలు గ్లోబలైజేషన్‌వల్ల భారతీయసంస్కృతి నాశనమైపోతోందని విశ్వనాథవారి ధోరణిలోనే తెగ బాధపడిపోతున్నారు. వీరి పద్ధతి నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది).

## II. శివరాత్రి జాగరణ:

ఇటువంటి సమస్యల చీకటివలయంలో చిక్కుకున్న మన తెలుగు సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని, మార్చి 2005లో ఒక దినపత్రికలో ఒక కార్టూనిస్టు ఈ క్రింది హాస్య వ్యాఖ్యలతో కూడిన చిత్రాలతో మహాశివరాత్రినాటి జాగరణను వర్ణించాడు:

1. ధరలూ, ద్రవ్యోల్బణం, మీ బ్రతుకు గురించీ ఆలోచించండి, నిద్రపడితే ఒట్టు!
2. అనంతపురంలో మీరున్నట్టు భావించండి!

3. ఏప్రిల్, మేనెలల్లో నీటి పరిస్థితిని ఊహించండి.

4. దోమల కాయిల్స్ వెలిగించకండి.

5. (టీ.వీ.లో) రాజకీయ వార్తలు వినండి.

6. నక్సల్స్ ఏరియాలో మీరున్నట్టు ఊహించుకోండి!

7. కబ్జాదారుల్నీ, ఊరవతల మీకున్న ఇంటి జాగానీ గుర్తు తెచ్చుకోండి!

8. నేడు శివరాత్రి; మహిళాదినోత్సవం కూడా. అందువల్ల శ్రీనాథుని 'సిరిగల వానికిఁ జెల్లును' ... అనే పద్యానికి ఒక పేరడీ:

క. **అరకొర వాటర్ సప్లయ్**
**సరిపోవక రాష్ట్రమెల్ల సంకటపడగన్**
**శిరమున దాచుట తగునా**
**పరమేశా! గంగ విడువు పడతులు మురియన్.**

*('ఈనాడు', 8-3-2005)*

## III. నక్సల్స్ సమస్యకు మూలకారణాలు:

రాష్ట్రప్రభుత్వాలు సరిగా పనిచేయక పోవడం వల్లనే దేశంలో నక్సల్స్ సమస్య నానాటికీ పెరిగిపోతోందని A.I.C.C. Task Force Convenor శ్రీ మర్రి శశిధరరెడ్డి అభిప్రాయపడ్డారు. ఆయన పలురాష్ట్రాలలో (ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్, బీహార్, జార్ఖండ్‌లలో) పర్యటించి ఈ సమస్యను అధ్యయనం చేసి, ఒక నివేదికను రూపొందించారు. ఆ నివేదికలో నక్సల్స్ సమస్యకు చెప్పిన మూలకారణాలు:

1. ప్రభుత్వాలు, ప్రజాప్రతినిధులు, ప్రజలఆశలకు అనుగుణంగా పనిచేయక పోవడమే ముఖ్యకారణం.

2. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ పూర్తిగా దెబ్బతినడం.

3. గ్రామీణ యువతకు జీవనోపాధి కరవు కావడం.

4. ప్రాజెక్టులు, పరిశ్రమలు, గనుల త్రవ్వకం లాంటి కారణాలవల్ల గిరిజనులు నిర్వాసితులు కావడం; ప్రభుత్వాలు వీరికి పునరావాసం కల్పించకపోవడం.

5. ఆంధ్రప్రదేశ్‌లో మొదటినుంచీ వస్తున్న భూమి సమస్యను సరియైన కోణంలో చూడకపోవడం.

ఇక్కడ నాది ఒక యక్షప్రశ్న: ఆంధ్రప్రదేశ్‌లో నక్సలైట్లున్నారు. బీహార్‌లో సరే. జార్ఖండ్‌లో నక్సలైట్లున్నారు. అయితే 30 సంవత్సరాలుగా ఏకధాటిగా సి.పి.ఎం. పశ్చిమబెంగాల్‌ను పాలిస్తోంది. మరి అక్కడ నక్సలైట్లు ఎందుకు ఉన్నారు? సి.పి.ఎం. వారు ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలి.

## IV. ప్రజా సమస్యలు:

ఆంధ్రప్రదేశ్‌లో వేసవికాలం రాబోయే ముందు ప్రజల సమస్యలు ఎలా ఉన్నాయో తెలియజేస్తూ ఒక దినపత్రిక ఇలా వ్రాసింది:

"రైతుల ఆత్మహత్యలు ఆగలేదు. తాగునీటి కష్టాలూ పెరుగుతున్నాయి. వేసవివ్యాధుల విజృంభణ మొదలయింది. కనుచూపుమేరలో కరంటుకోత రానుంది. మద్యం విధానంపై వివాదాలు చెలరేగుతున్నాయి. తీవ్రవాద సంబంధ హింస-ప్రతిహింస ప్రబలుతున్నాయి. ఆకలి చావులూ ఆగకుండా జరుగుతూనే ఉన్నాయి. విత్తనాలు - ఋణాలపై రైతులు ఆందోళన కొనసాగిస్తున్నారు. చేతి వృత్తులు చితికిపోయాయి. పేదరికం పెరిగిపోతూనే ఉంది. ప్రమాదాలు పెరిగిపోయి రహదారులు రోజూ నెత్తురోడుతున్నాయి" (ఈనాడు, 31-3-2005).

## V. ఛిన్నాభిన్నమైన 'పేదలపార్టీ' (కమ్యూనిస్టు పార్టీ):

రాజకీయపక్షాలు ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికలలో పోటీచేసి నెగ్గి, అధికారాన్ని చేజిక్కించుకొని, సమసమాజాన్ని స్థాపించాలని కొందరు శాంతి కాముకులు భావిస్తున్నారు. అయితే ఇప్పుడున్న రాజకీయ పక్షాలలో ఎక్కువభాగం (90%) ధనికుల పార్టీలు. కొన్ని ఆయాకులాల పునాదులమీద నిర్మింపబడిన పార్టీలు. ఇవికూడా అధికారంలో ఉన్నప్పుడు దేశాన్ని బాగా దోచుకుని ధనవంతమైన పార్టీలుగా మారినవే. ఇక పేదల యోగక్షేమాలకోసం పోరాడేపార్టీ ఒక్క కమ్యూనిస్టు పార్టీ మాత్రమే. కాని అది 1965 నుండి చీలికలు పేలికలుగా విడిపోయింది. మొదట సి.పి.ఐ - సి.పి.ఐ. (ఎమ్)గా విడిపోయింది. తరువాత సి.పి.ఐ.(ఎమ్.ఎల్) అనే విప్లవపార్టీ పుట్టింది. తరువాత దానిలోనుండి పి.డబ్ల్యూ.జి, జనశక్తి, ప్రజాప్రతిఘటన - మొదలైన ఎన్నో చీలికలు వచ్చాయి. P.W.G. (People's War Group) ఇటీవల బీహార్‌లోని విప్లవ పార్టీతో కలిసి "మావోయిస్టు పార్టీ"గా మారింది. ఇలాగ చెట్టుకొకరు, పుట్టకొకరుగా అయిపోయిన పేదల పార్టీలు, విప్లవ పార్టీలు

సమసమాజాన్ని ఎలా స్థాపిస్తాయో నాకు అర్థం కావడం లేదు. వీరి అనైక్యాన్ని ఆధారంగా చేసికొని ధనికుల పార్టీలు, కులగజ్జి పార్టీలు అధికారంలో కొనసాగుతూ దేశాన్ని దోచుకుతింటున్నాయి. పేదల విప్లవపార్టీలను ఇనుపపాదంతో అణచి వేస్తున్నాయి.

## VI. కవుల కర్తవ్యం:

ఈ విధంగా వివిధ సమస్యలతో అతలాకుతలమవుతున్న సమాజాన్ని చూచి కవులు రచయితలు విధిగా స్పందించాలి. అలా స్పందించి చేసిన రచనలే నిజమైన ఆధునిక సాహిత్యం అవుతాయి. వీటివల్లనే సాహిత్యంలో "చలనశీలత" కలుగుతుంది.లేకపోతే ఆధునికసాహిత్యం నిస్తేజమై, స్తబ్ధమై, జడప్రాయమవుతుంది; శిలాసదృశమవుతుంది! అలా కాకుండా ఉండాలంటే - కవులు రచయితలు వర్తమాన సమాజ స్థితిగతుల్ని వేయికళ్ళతో పరిశీలిస్తూ ఉండాలి. వాటిని తమ రచనల్లో ప్రతిఫలింపజేస్తూ ఉండాలి. తమకు తోచిన పరిష్కార మార్గాలు సూచిస్తూ ఉండాలి.

## VII. భారత స్వాతంత్ర్య దినోత్సవం:

15-8-1947నాడు మన భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. అప్పుడు నాకు 12 సంవత్సరాలు నిండాయి. రాజమండ్రిలో సెకెండ్‌ఫారం (7వ తరగతి) చదువుతున్నాను. పెద్దపండుగ (సంక్రాంతి) వస్తే మనం ఎన్ని సంబరాలు జరుపుకుంటామో అన్ని సంబరాలు జరిగాయి ఆనాడు. రాజమండ్రి మెయిన్‌రోడ్డులో గాంధీజీచిత్రపటాన్ని పెద్ద ఏనుగుమీద పెట్టి ఊరేగించారు. బ్రిటిషువారి బానిసత్వం నుండి విముక్తమైన భారతజాతి స్వేచ్ఛావాయువులు పీలుస్తూ సర్వతోముఖాభివృద్ధి చెందుతుందని అందరూ ఆశించారు. కాని ఆ ఆశ అడియాస అయింది. కొన్ని రంగాలలో కొంత అభివృద్ధి సాధించినా, పెక్కు రంగాలలో బాగా వెనుకబడే ఉంది మన దేశం.

15-8-1972నాడు భారతస్వాతంత్ర్యరజతోత్సవం (వెండి పండుగ) జరిగింది. ఏమీ మార్పులేదు. జనాభా పెరిగింది. దారిద్ర్యం పెరిగింది. నిరుద్యోగం పెరిగింది. అవినీతి పెరిగింది. ప్రజల స్థితిగతులు మాత్రం తరిగి తరిగి పాతాళానికి చేరాయి. దీనిని దృష్టిలో పెట్టుకొని శ్రీశ్రీ 'వెండి పండుగ' పేరుతో ఒక కవిత వ్రాశారు. అది ఆకాశవాణిలో ప్రసారమయింది. దానిని 15-8-1977నాడు "నిజం నిజం

నిజం'' అనే పుస్తకంలో విరసం ప్రచురించింది. దానినే ఆగస్టు 2005 'ప్రజాసాహితి' మాసపత్రికలో పునర్ముద్రించారు. శ్రీశ్రీగారి కవితను యథాతథంగా దిగువ ఇస్తున్నాం.

**''మత కలహాల మారణహోమాల మధ్య**
**1947 ఆగస్టు 14-15 అర్ధరాత్రి**
**ఆవిర్భవించిన స్వాతంత్ర్యం**
**అవినీతిని భారీపరిశ్రమ చేసింది**
**ఆకలికి సార్వభౌమాధికారం ఇచ్చింది**
**ధనస్వామ్యానికి ప్రజాస్వామ్యం అని పేరుపెట్టి**
**పేదవాళ్ళను మరింత పేదలను చేసింది.**
**ఇంకా స్వాతంత్ర్యం ఏమిటి ఒరగబెట్టింది?**
**ఆకలి చావులు, హరిజన దహనాలు**
**అప్పుడప్పుడు నరబలులు**
**వైజ్ఞానికుల ఆత్మహత్యలు**
**ఈ స్వాతంత్ర్యంలో**
**బాగుపడినవాళ్ళు పదిమంది ఉంటే**
**బాధపడుతున్నవాళ్ళు పదివేలమంది.**
**ఈ బాధల స్వభావాన్ని**
**బహిరంగ పరచడమే**
**నిజయితీగల**
**ఈనాటి కవుల**
**ఏకైక కర్తవ్యం!**

15-8-1997 నాడు మన స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలు అత్యంత వైభవంగా జరిగాయి. ఈనాటికి - అంటే 15-8-2007 నాటికి స్వాతంత్ర్యం వచ్చి 60 ఏండ్లు గడిచాయి. (నాకు ఇప్పుడు 72 ఏండ్లు నిండాయి). అయినా ప్రజల జీవన పరిస్థితులు ఏమీ మెరుగుపడలేదు. ప్రజాస్వామ్యం ముసుగులో ఉన్న ఈనాటి ధనస్వామ్యాన్ని మట్టుపెట్టడంకోసం నిరుపేదలు కొందరు తుపాకులు పట్టుకున్నారు. హింసామార్గాన్ని ఎన్నుకున్నారు. సమసమాజ నిర్మాణానికి ఆత్మబలిదానాలు చేస్తున్నారు. ఈ ఆర్థిక, సామాజిక, రాజకీయ సమస్యను ప్రభుత్వం శాంతిభద్రతల సమస్యగా పరిగణించి, తన అధికారపు ఇనుపపాదాలతో అణచివేయాలని చూస్తోంది.

స్వాతంత్ర్య రజతోత్సవం నాటికి పరిస్థితులు ఎలా ఉన్నాయో స్వర్ణోత్సవం నాటికీ, వజ్రోత్సవం నాటికీ (15-8-2007 నాటికీ) అలాగే ఉన్నాయి. జనాభా సమస్య, ఆకలి, నిరుద్యోగం, అవినీతి, మతమార్పిడులు, మత కలహాలు, పాకీస్థాన్ ద్రోహులు కాశ్మీరులో నిత్యం పన్నుతున్న కుట్రలు, బంబాయిలోను, గుజరాత్‌లోని గోధ్రాలోను, కోయంబత్తూరులోను, ఢిల్లీలోను, ఇటీవల హైదరాబాద్‌లోను ముస్లిం ఉగ్రవాదులు పేల్చిన బాంబులు, విదేశీ క్రైస్తవ మిషనరీలు ఈశాన్య రాష్ట్రాలలో జరిపిస్తున్న విద్రోహచర్యలు - అన్నీ ఎన్నో ఏండ్లుగా యథాతథంగా కొనసాగుతున్నాయి. ఈ సమస్యలన్నీ పరిష్కరించుకొని, మనదేశం అభ్యుదయపథంలో ముందడుగు వేయాలంటే ఏమి చేయాలో వర్తమాన కవులు, రచయితలు బాగా ఆలోచించాలి! ఆ ఆలోచనలకు అనుగుణంగా రచనలు చేసి, నేటి యువతీయువకులకు దిశానిర్దేశం చేయాలి!! భవతు!!

బెంగుళూరు — తంగిరాల

15-8-2007

*(ఈ సంపాదకీయాన్ని నేను 9-4-2005 పార్థివ ఉగాదినాడు వ్రాశాను. 30-3-2006 వ్యయ ఉగాదినాటికి కాని, 20-3-2007 సర్వజిత్ ఉగాదినాటికి కాని పరిస్థితులలో ఏమీ మార్పులేదు. అందువల్ల దానిని కొద్దిపాటి సవరణలతో ఇప్పుడు ముద్రిస్తున్నాను).*

"విశ్వనాథ, శ్రీశ్రీలలాగా సమకాలీన తెలుగు సాహిత్యంలో నిస్సంశయంగా శేషేంద్రశర్మ జీనియస్. మండేసూర్యుడుగా పిడికిలెత్తినప్పటి నుంచీ తెలుగులో వచనకవిత్వం శేషేన్‌మార్కు భావచిత్రాల పట్టు శాలువా కప్పుకోవటం నేర్చుకుంది. అభివ్యక్తి శిల్పంలో వేడివెన్నెలలు వెదచల్లటం ప్రారంభించింది:

'చెట్లకు వ్రేలాడిన శిరసులు పూస్తున్నాయ్ / కొమ్మల్లో పూలై
గోరీమారిన గుండెలు కదులుతున్నాయ్ / గుడిలో గంటలై
ఎందరు ఎన్ని రాత్రులు రక్తం పిండి ఇచ్చారో / ఈ దినం కోసం'

తనకు ముందున్న అకవితానైరాశ్యశిశిరం నుంచి కవితా వసంతంలోకి అభివ్యక్తి శిల్పాన్ని నడిపించి, నెత్తురుపూలు కొమ్మలకు పూయించాడు శేషేంద్రశర్మ. శేషేంద్రశర్మకు ఒక సాహిత్య యుగకర్తకుండే సహజ లక్షణాలు పుష్కలంగా ఉన్నాయి. — ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

## సంపాదకీయం-2:

# ముస్లిం ఉగ్రవాదం

## కవుల పక్షపాతదృష్టి - సర్కారు మెతకవైఖరి

పాకిస్థాన్, బంగ్లాదేశ్‌ల శిక్షణతో ప్రోత్సాహంతో, హైదరాబాద్ పాతబస్తీలోని కొందరి సహకారంతో ముస్లిం ఉగ్రవాదం పేట్రేగిపోతోంది. ఎక్కడ చూచినా బాంబుల వర్షం కురిపిస్తోంది. ఎందరో అమాయకులను పొట్టన పెట్టుకొంటోంది. బంబాయి, ఢిల్లీ, కోయంబత్తూరు, బెంగుళూరులలోను, ఇటీవల హైదరాబాద్‌లోను, అజ్మీరుదర్గా లోను, 23-11-2007 నాడు ఉత్తరప్రదేశ్‌లోను ముస్లిం ఉగ్రవాదులు బాంబులు పేల్చి హింసాప్రళయం సృష్టించారు.

1992 డిసెంబరు 6వ తేదిని హిందూ అతివాదులు అయోధ్యలో బాబ్రీ మసీదును కూల్చివేశారు. అది పాడుబడిన మసీదు. అక్కడ ప్రార్థనలేమీ జరగడం లేదు. అయినా సరే ముస్లిములు ఆ చర్యను తీవ్రంగా పరిగణించారు. అభ్యుదయ కవులు, ముస్లిం మైనారిటీ కవులు బాబ్రీ కూల్చివేతను ఖండిస్తూ కవితలు వ్రాశారు. మసీదు కూల్చివేతకు ప్రతీకారంగా 1993 మార్చిలో బంబాయిలో దావూద్ ఇబ్రహీం అనుచరులు బాంబులు పేల్చి ఎందరినో చంపివేశారు. (257 మంది చనిపోయారు; 1400మంది గాయపడ్డారు). అప్పుడు ఈ కవులెవ్వరూ స్పందించలేదు. ఒక్కరు కూడా నోరెత్తలేదు.

**కోయంబత్తూర్ బాంబుప్రేలుళ్ళు:** 1998 ఫిబ్రవరి 14వ తేదినాడు జరిగిన కోయంబత్తూరు వరుస బాంబు దాడుల్లో 58 మంది అమాయకులు చనిపోయారు. 200 మందికి పైగా గాయపడ్డారు. ఏళ్ళ తరబడి ఆ కేసు కోర్టులో పడి ఉంది. ఇటీవల తీర్పు వచ్చింది. 43 మంది పరమ దుర్మార్గులైన రాక్షసులు దోషులని తేలింది. "వీరికి ఉరిశిక్ష వేయాల్సి ఉన్నా, జీవితఖైదు వేస్తున్నాను" అంటున్నాడు సిగ్గులేకుండా మన జడ్జి. ఇలాంటి మెతకవైఖరితో హిందువులు, ముస్లిం ఉగ్రవాదుల చేతుల్లో సర్వనాశనం అయిపోవడం ఖాయం!

బాబ్రీమసీదు కూల్చిన నాటినుండి పదేళ్ళు గడిచాక, కోయంబత్తూరు బాంబు ప్రేలుళ్ళు జరిగిన నాలుగేళ్ళకు 27-2-2002 నాడు, గుజరాత్‌లోని గోధ్రాలో, సబర్మతీ ఎక్స్‌ప్రెస్‌లో రెండు బోగీలలో ఉన్న రామభక్తుల్ని ముస్లిం ఉగ్రవాదులు సజీవ దహనం చేసివేశారు. అప్పుడు ప్రతిపక్షాలు కాని, అభ్యుదయ కవులు కాని, ముస్లిం

మైనారిటీ కవులు కాని పల్లెత్తుమాట అనలేదు. ఆ తరువాత అతివాద హిందువులు చేసిన ప్రతీకారపు దాడుల్లో ఎందరో అమాయక ముస్లింలు చనిపోయారు. గోధ్రా సంఘటనకు స్పందించని అభ్యుదయవాద కవులు, ముస్లిం మైనారిటీవాద కవులు అంతా కలిసి పెద్దపెట్టున గోలచేస్తూ హిందువుల ప్రతీకారపు దాడుల్ని ఖండిస్తూ "గుజరాత్ గాయం" అనే కవితా సంకలనాన్ని వెలువరించారు. అంతేకాదు, కొందరు ముస్లింకవులు పనికట్టుకొని ఇతర హిందూ కవులను గుజరాత్ తీసికొనివెళ్ళి, ఫొటోలు తీసి వాటిని ఆ సంకలనంలో ముద్రించారు. ఇది దేశంలో ఉన్న ఇతర ప్రాంతాల ముస్లింలను రెచ్చగొట్టే చర్య కాదా?

తరువాత ముస్లిం ఉగ్రవాదులు 24-9-2002 మంగళవారం సాయంకాలం 5 గంటలకు గుజరాత్‌లోని గాంధీనగర్‌లోఉన్న స్వామిలక్ష్మీనారాయణ దేవాలయంలో ప్రవేశించి, ఎ.కె. 47 గన్స్‌తో విచక్షణారహితంగా కాల్పులు జరిపి, 31మంది నిరాయుధులైన హిందూభక్తుల్ని చంపివేశారు. అప్పుడు ఈ అభ్యుదయవాద - ముస్లింవాద కవులు నోరు మెదపలేదు.

పిమ్మట, ముస్లిం ఉగ్రవాదులు పాకిస్థాన్ ప్రోత్సాహంతో ఏకంగా పార్లమెంటు మీదనే దాడి చేశారు. వారితో పోరాడుతూ ఎందరో పోలీసులు చనిపోయారు. భగవంతుని దయవల్ల ఉగ్రవాదుల లక్ష్యం నెరవేరలేదు. అప్పుడు పార్లమెంటు సమావేశం జరుగుతోంది. ఒకవేళ ఉగ్రవాదులు పార్లమెంటు భవనాన్ని కైవసం చేసుకొని పార్లమెంటు సభ్యుల్ని బందీలుగా చేసి ఉంటే మన దేశపరిస్థితి ఎలాఉండేది? పార్లమెంటు సభ్యుల్ని చిత్రవధ చేసివుండేవారు కదా! అప్పుడు కూడా మన "మహాకవులు" మౌనాన్నే పాటించారు!

పార్లమెంటుపై జరిగిన దాడిలో ముఖ్యసూత్రధారుడు "అఫ్‌జల్ గురు" కు మరణశిక్ష విధించింది మన ప్రభుత్వం. కాని దానిని ఇంతవరకూ అమలు పరచలేదు. "అఫజల్ గురు"కు క్షమాభిక్ష ప్రసాదించాలని కొందరు రాజకీయవేత్తలు వాదించటం, వారి దేశద్రోహమనస్తత్వాన్ని చాటుతోంది. కాశ్మీర్‌లోని ముస్లిములయితే అఫ్‌జల్‌గురును "ఒక మహావీరుడు"గా భావించి ఆరాధిస్తున్నారు. దీనిని మన కవులలో ఒక్కరు కూడా ఖండించలేదు. పైగా "అసలు దేశంలో ఉరిశిక్ష అనేదే ఉండకూడదు" అని వాదించే ప్రబుద్ధులు కూడా మనదేశంలో ఉన్నారు.

మెజారిటీలు (హిందువులు) చనిపోయినప్పుడు నోరు మెదపకుండా ఉండటం, మైనారిటీలు (ముస్లింలు) చనిపోయినప్పుడు మాత్రమే గగ్గోలు చేయడం

"అభ్యుదయం"గానూ, "సెక్యులరిజం"గానూ, మైనారిటీవాదంగానూ చెలామణి అవుతోంది మనదేశంలో. ఇది మిక్కిలి దురదృష్టకరమైన విషయం! కవి అన్నవాడు పక్షపాతరహితంగా అన్యాయాన్ని ఎదిరించాలి. గొప్పకోసం, కీర్తికోసం ఒక పక్షానికి కొమ్ముకాయకూడదు.

"అల్‌ఖైదా" - "లష్కర్ ఏ తోయిబా" - "అల్‌ఉమ్మా" - "దీన్‌దార్ అంజుమన్" - "హర్కత్-ఉల్-జిహాద్-అల్-ఇస్లామీ" - "జైష్ ఏ.మొహమ్మద్" - "హుజీ" (బంగ్లాదేశ్) - ఇత్యాది ముస్లిం ఉగ్రవాద సంస్థల్లో మనదేశంలో మొత్తం 40వేల మంది ఉగ్రవాదులు పనిచేస్తున్నారని నిఘాసంస్థలు తెలియజేస్తున్నాయి. అయినా ఒక వార్తా పత్రికలో ప్రచురితమైన ఈ వ్యాఖ్యను మనమంతా గుర్తుపెట్టుకోవాలి. "All Muslims are not terrorists. But all terrorists are Muslims". ("ముస్లిము లందరూ ఉగ్రవాదులు కారు. కాని ఉగ్రవాదులందరూ ముస్లిములే!).

ఎన్.డి.ఏ. ప్రభుత్వంలో "పోటా" అనే కఠినమైన చట్టం ఉండేది కాబట్టి ముస్లిం ఉగ్రవాదులు కొంతలో కొంత అదుపులో ఉండేవారు. ఈనాటి యు.పి.ఏ ప్రభుత్వం ముస్లిముల ఓట్లకోసం "పోటా" చట్టాన్ని రద్దు చేసింది. ఫలితంగా ముస్లిం ఉగ్రవాదులు యథేచ్ఛగా నరమేధాలు కొనసాగిస్తున్నారు. పాకిస్థాన్‌లోను, బంగ్లాదేశ్‌లోను వీరు శిక్షణ పొంది వస్తున్నారు. ఈ ఉగ్రవాదులలో చాలామందికి హైదరాబాద్ (ముఖ్యంగా పాతబస్తీ) స్థావరంగా మారింది. స్థానికులైన ముస్లింలు కొందరు వీరికి సహకరిస్తున్నారు. కర్నూలులోను, గుంటూరులోను, నూజివీడులోను కూడా వీరికి సహకరించే ముస్లింలు ఉన్నారు.

దేశంలో మతకలహాలు సృష్టించి అస్థిరతను పెంచడం కోసం ఈ ఉగ్రవాదులు 18-5-2007 నాడు హైదరాబాద్‌లోని మక్కామసీదులో బాంబులు పేల్చారు. ప్రార్థనలు చేసుకుంటున్న ముస్లిములు కొందరు చనిపోయారు; మరికొందరు గాయపడ్డారు. "అందరినీ మన వాళ్ళనే చంపేశారేమిటి?" అని వ్యాఖ్యానించారట కొందరు మతోన్మాదులు. (మసీదులో బాంబులు వేస్తే ముస్లిములు కాక హిందువులు ఎలా చనిపోతారు?). అందువల్ల హిందువులను చంపడం కోసం ఉగ్రవాదులు 25-8-2007 శనివారం నాడు రాత్రి 7.30 గంటలకి హైదరాబాద్ లుంబినీ పార్కులోను, 7.45 గంటలకి గోకుల్ చాట్‌లోను భయంకరంగా బాంబులు పేల్చారు. 42మంది దారుణంగా చనిపోయారు. క్షణాల్లో మాంసం ముద్దలుగా మారిపోయారు. వందమందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. "పోటా"ను రద్దుచేసి నేటి ప్రభుత్వం ఎంత తప్పుచేసిందో ఈ సంఘటన బాగా రుజువు చేస్తోంది. నిజానికి హైదరాబాద్‌లో

ఉగ్రవాదులు 21చోట్ల బాంబులు పెట్టారు. దైవవశాత్తు రెండు చోట్ల మాత్రమే పేలాయి. 21చోట్లా బాంబులు పేలి ఉంటే హైదరాబాద్ ఏమయిపోయి ఉండేదో ఊహించండి! (ఇలా బాంబులు పేలితే చర్లపల్లి జైల్లో ఉన్న ఐ.ఎస్.ఐ. ఏజెంట్లు, ముస్లిం ఉగ్రవాదులు సంతోషంగా మిఠాయిలు పంచిపెట్టుకున్నారట!). దీనిని గురించి అభ్యుదయవాద కవులు, మైనారిటీవాద కవులు ఒక్క కవితకూడా వ్రాయలేదు. హిందూ-ముస్లింల సమైక్యతను ప్రబోధించే సూఫీతత్త్వవేత్తలకు నిలయమైన అజ్మీర్‌దర్గాలో కూడా పాకిస్తాన్ ప్రేరేపిత ఉగ్రవాదులు ఇటీవల బాంబులు పేల్చారు. మన దేశాన్ని అస్థిర పరచడమే వారి ముఖ్యోద్దేశం.

తిరుమలలోని శ్రీవేంకటేశ్వర స్వామివారి ఆలయానికి కూడా ముస్లిం ఉగ్రవాదుల భయం పొంచి ఉంది. కేంద్రంలోను, రాష్ట్రంలోను అధికారం చలాయించేవారు క్రైస్తవులు కావడంతో పవిత్రమైన తిరుమలలో క్రైస్తవ మత ప్రచారం జరుగుతూ ఉండడం కూడా మనం గమనించాం.

ముస్లిం ఉగ్రవాదులకు హైదరాబాద్ పాతబస్తీ అడ్డాగా మారడానికిగల ముఖ్య కారణాలలో మతోన్మాదం ఒక్కటే కారణం కాదనీ, సామాజిక ఆర్థిక పరిస్థితులు కూడా కారణమనీ కొందరు మేధావులు భావిస్తున్నారు. నిరుద్యోగంతోను, దారిద్ర్యంతోను బాధపడుతున్న ముస్లిం యువకుల్ని పాకిస్థాన్ ఐ.ఎస్.ఐ. ఏజెంట్లు లక్షలాది రూపాయలు ఎరగా విసిరి సులభంగా బుట్టలో వేసుకుంటున్నారు. ఈ డబ్బుకి తోడు మతం మత్తుమందు ఇంజెక్షన్లు ఎలాగూ పనిచేస్తాయి కదా!.

ఒక ప్రక్క నక్సలైట్లు; మరొక ప్రక్క ముస్లిం ఉగ్రవాదులు. నక్సలైట్లు ఒక సిద్ధాంతం కోసం, భూసమస్య కోసం, పేదవారి కోసం పోరాడుతున్నారు. ముస్లిం ఉగ్రవాదులు కేవలం మనదేశాన్ని అస్థిరం చేయడం కోసమే విధ్వంసాలు సృష్టిస్తున్నారు. ప్రభుత్వం భూమి-సమస్యను పరిష్కరిస్తే నక్సలైట్ ఉద్యమం అంతరిస్తుంది. కాశ్మీర్‌ను పాకిస్థాన్‌కు ధారాదత్తం చేసి, బాబ్రీమసీదును పునర్నిర్మిస్తే ముస్లిం ఉగ్రవాదం అణిగిపోతుందా? ఏమో చెప్పలేం! ప్రజాస్వామ్యదేశంలో మొదటిది సాధ్యం కాదు. రెండవపని అంతకష్టంకాదు. పాకిస్థాన్‌లోను బంగ్లాదేశ్‌లోను ఉన్న ముస్లిముల సంఖ్య కన్నా భారతదేశంలో ఉన్న ముస్లిముల సంఖ్య చాలా ఎక్కువ. ఇక్కడ హిందూ ముస్లిములందరూ కలిసి మెలిసి ప్రజాస్వామ్యయుతంగా స్వేచ్ఛగా బ్రతుకుతున్నారు. కాశ్మీర్‌ను పాకిస్థాన్‌కు ఎలా ఇస్తాం? కాశ్మీర్‌లో కొంత భాగాన్ని 1947లోనే పాకిస్థాన్ దురాక్రమణ చేసింది. కొంత భాగాన్ని చైనా కబళించింది. పాకిస్థాన్ + చైనా + భారత దేశాలలో ఉన్నా కాశ్మీర్‌ను కలిపి, కాశ్మీరీ పండితులను కూడా అక్కడికి పంపి, ప్రజాభిప్రాయాన్ని

సేకరించి, కాశ్మీర్ భవిష్యత్తును నిర్ణయించడం ధర్మబద్ధమైన న్యాయమైన చర్య. విభిన్నమైన రాజకీయ నేపథ్యం కలిగిన మూడు దేశాల అధీనంలో ఉన్న భూభాగాలను కలపడం, కాశ్మీర్ ప్రజల మనోగతాన్ని తెలుసుకోవడం ఎప్పటికీ జరిగే పని కాదు. ఇక ముస్లిం ఉగ్రవాదుల్ని భూస్థాపితం చేయడమే మనకు మిగిలిన ఏకైక కర్తవ్యం.

మన ప్రభుత్వం చిత్తశుద్ధితో పనిచేస్తే ముస్లిం ఉగ్రవాదాన్ని ఉక్కుపాదంతో అణచివేయగలదు. మిక్కిలి సమర్థులైన పోలీసు అధికారులు మనకు ఉన్నారు. కాని ప్రభుత్వం ఓట్ల రాజకీయాలు చేస్తూ కఠినంగా వ్యవహరించడం లేదు. పోలీసులకు స్వేచ్ఛను ఇవ్వడం లేదు. కఠినంగా వ్యవహరించే పోలీసు అధికారులకు సరియైన రక్షణ ఇవ్వడం లేదు. ఇటీవల ఒక దినపత్రికలో మన బి.ఎస్.ఎఫ్. మాజీ డైరెక్టర్ జనరల్ శ్రీ టి. అనంతాచారిగారు "ఉగ్రవాదులను ఉపేక్షిస్తున్నదెవరు?" అనే గొప్ప వ్యాసం వ్రాశారు. ఆ వ్యాస సారాంశం యిది: ".... ఉగ్రవాదుల దాడుల్లో హతమైన వారి సంఖ్యను పరిగణనలోకి తీసుకుంటే, భారతదేశం ఇరాక్ తరువాతి స్థానంలో ఉంది. 2004 నుంచి 2007 మార్చి వరకు భారత్‌లో ఉగ్రవాదుల దాడుల్లో మరణించిన వారి సంఖ్య 3674. ఉత్తర అమెరికా, మధ్య అమెరికా, దక్షిణ అమెరికా, ఐరోపా, యురేషియాల్లో మొత్తంగా అదే కాలంలో ఉగ్రవాదుల దాడుల్లో ప్రాణాలు పోగొట్టుకున్నవారి సంఖ్య 3280 మాత్రమే. నిజాలు ఇలా ఉన్నా వాటిని పరిశీలించేందుకు, ఆలోచించేందుకు మన దేశంలో రాజకీయ పక్షాలు సిద్ధాంగా లేవు. వాటికి విషయమేమిటో అర్థంకాక కాదు .... ఓటు బ్యాంకు రాజకీయాలే వాటి నిర్ణయాలను శాసిస్తున్నాయి ...." - (ఈనాడు, సెప్టెంబరు 25, 2007)

*ఈ వ్యాసానికి ఒక ముఖ్యమైన అనుబంధం:*

## తెగబడుతున్న తీవ్రవాదులు

గాలిలో కలుస్తున్న అమాయక ప్రాణులు ;

**ఎక్కడైనా భారీ విధ్వంసమే ; రక్తసిక్తమవుతున్న దేశం**

భారీవిధ్వంసమే లక్ష్యంగా దేశంలో తీవ్రవాదులు వరుసదాడులకు తెగబడుతున్నారు. ఎక్కడ తీవ్రవాదులు దాడులు చేసినా భారీసంఖ్యలో అమాయక పౌరులు మరణిస్తున్నారు. దేశంలో ఏదో ఒకమూల రక్తమోడుతూనే ఉంది. శుక్రవారం (23-11-2007నాడు) లక్నో, ఫైజాబాద్, వారణాసి కోర్టుల్లో తీవ్రవాదుల బాంబుపేలుళ్ళు మరోసారి విధ్వంసం సృష్టించాయి. ఈ నేపథ్యంలో గతంలో బాంబు పేలుళ్ళను ఓసారి పరికిద్దాం...

## దేశంలో...

**1993 మార్చి** : ముంబయిలో స్టాక్‌ఎక్స్ఛేంజీ సహా పలుప్రాంతాల్లో 13 వరుస బాంబుపేలుళ్ళు చోటుచేసుకున్నాయి. మొత్తం 257మంది మృతి చెందగా 1400మంది గాయపడ్డారు. దావూద్‌ఇబ్రహీంముఠా ఈపేలుళ్ళకు సూత్రధారులు.

**1998 ఫిబ్రవరి 14** : తమిళనాడులోని కోయంబత్తూరులో 48 నిమిషాల వ్యవధిలో 12 వరుస పేలుళ్ళు సంభవించగా 58 మంది చనిపోయారు. 200 మందికి పైగా గాయపడ్డారు.

**2003 ఆగస్టు 25** : ముంబయిలో రెండు వరుస బాంబుపేలుళ్ళు చోటుచేసుకున్నాయి. గేట్‌వే ఆఫ్ ఇండియా, జవేరీ బజార్లలో ట్యాక్సీల్లో పెట్టిన బాంబులు భోజనాలవేళ పేలాయి. 52మంది మరణించగా 100 మంది గాయపడ్డారు.

**2005 అక్టోబరు 29**: ఢిల్లీలో రద్దీగాఉండే మార్కెట్లలో వరుస బాంబు పేలుళ్ళు చోటుచేసుకుని 70 మంది మరణించారు.

**2006 ఏప్రిల్ 14** : ఢిల్లీ, శ్రీనగర్‌లలో బాంబు పేలుళ్ళు సంభవించాయి. ఢిల్లీ జామామసీదులో రెండు పేలుళ్ళలో 14 మంది మరణించారు. శ్రీనగర్ పేలుళ్ళలో ఐదుగురు చనిపోయారు.

**2006 జులై 11** : శ్రీనగర్‌లోని పర్యాటక కేంద్రాలవద్ద తీవ్రవాదులు జరిపిన వరుస గ్రెనేడ్ దాడుల్లో 11మంది మరణించారు. 37 మంది గాయపడ్డారు. మృతుల్లో ఆరుగురు బెంగాల్‌పర్యాటకులు. నలుగురు హైదరాబాద్‌కు చెందినవారు.

**2006 జులై 11** : ముంబయి సబర్బన్ రైళ్ళలో 19 నిమిషాల వ్యవధిలో ఏడు చోట్ల భారీ పేలుళ్ళు చోటుచేసుకున్నాయి. ఈ దుర్ఘటనలో మొత్తం 175 మంది మరణించారు. 439 మంది గాయపడ్డారు. తర్వాత మృతుల సంఖ్య 209కి పెరిగింది.

**2006 సెప్టెంబరు 8**: మహారాష్ట్రలోని నాసిక్‌జిల్లా మాలెగావ్ పట్టణంలో మసీదుసహా వరుసగా జరిగిన మూడు పేలుళ్ళలో 38మంది మరణించారు. 150 మంది గాయపడ్డారు.

**2007 ఫిబ్రవరి 19** : ఢిల్లీ, లాహోర్‌ల మధ్య నడిపే సంఝౌతా ఎక్స్‌ప్రెస్‌లో హర్యానాలోని పానిపట్‌కు పది కిలోమీటర్ల దూరంలో దివానా స్టేషన్ దాటాక జరిగిన రెండు బాంబు పేలుళ్ళలో 68 మంది మరణించారు.

**హైదరాబాద్‌లో ...**

**2007 మే 18** : హైదరాబాద్ పాతబస్తీలోని మక్కా మసీదులో బాంబు పేలింది. పేలుడుతో పాటు అనంతరం జరిగిన కాల్పుల్లో కలిపి మొత్తం 16 మంది మరణించారు. పోలీసులు మరో మూడు బాంబులను కనుగొని వాటిని నిర్వీర్యం చేశారు.

**2007 ఆగస్టు 25** : మక్కా మసీదులో బాంబు పేల్చిన 100 రోజులకు హైదరాబాద్‌లో వరుస బాంబు పేలుళ్ళు సంభవించాయి. ఈ పేలుళ్ళలో 42 మంది దుర్మరణం పాలయ్యారు. రాష్ట్ర పరిపాలనా కేంద్రం సచివాలయానికి సమీపంలోని లుంబినీవనంలో లేజర్ షో జరుగుతున్న సమయంలో భారీ పేలుడు సంభవించింది. అనంతరం 10 నిమిషాలకు కోఠి సెంటర్లోని గోకుల్ చాట్‌లో పేలుడు సంభవించింది.

- *(ఈనాడు, నవంబరు **24, 2007**)*

ఇప్పుడు, అంటే 23-11-2007 శుక్రవారం నాడు ఉత్తరప్రదేశ్‌లో 15 నిమిషాలలో మూడుచోట్ల బాంబులు పేలాయి. మధ్యాహ్నం 1.10గంటలకు వారణాసిలోను, 1.18గంటలకు ఫైజాబాద్‌లోను, 1.25 గంటలకు రాష్ట్ర రాజధాని లక్నోలోను జిల్లాన్యాయస్థానాలలో ముస్లిం ఉగ్రవాదులు బాంబులు పేల్చారు. ఈ ప్రేలుళ్ళలో 13మంది దుర్మరణం పాలయ్యారు. దాదాపు 60మంది గాయపడ్డారు. వీరిలో న్యాయవాదులు కూడా ఉన్నారు. ఈ దుశ్చర్య "ఇండియన్ ముజాహిద్దీన్" అనే స్వదేశీ ఉగ్రవాదసంస్థ తానుచేసినట్లుగా ప్రకటించింది. అంటే ఇప్పుడు ఉగ్రవాదులు పాకిస్థాను బంగ్లాదేశాలనుండి దిగుమతి కావడమే కాకుండా ఇక్కడ మన చుట్టుప్రక్కలే పుట్టుకువస్తూ ఉన్నారన్నమాట. అయితే పోలిసుల్ని తప్పుదారి పట్టించడం కోసం, ఈ ప్రకటన చేశారనీ, ఈ పని చేసింది జైషే మహమ్మద్ ఉగ్రవాద సంస్థ అనీ, వీరే వారం రోజుల క్రిందట రాహుల్‌గాంధీని కిడ్నాప్ చేయడానికి ప్రయత్నించారనీ పోలీసులు తెలుపుతున్నారు.

బెంగుళూరు — తంగిరాల

24-11-2007

# ప్రగాఢ సంతాపం

2005 డిసెంబరు నెలనుండి 2007 నవంబరు నెలవరకు కొందరు కవులు, కళాకారులు, పండితులు, పరిశోధకులు, సాహిత్యవేత్తలు, సంగీత విద్వాంసులు, రాజకీయవేత్తలు స్వర్గస్థులయ్యారు. వారి కుటుంబ సభ్యులకు 'చైతన్య కవిత' మరియు 'శ్రీరస' తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నాయి....

1. డా॥ బోయి భీమన్న (94), 16-12-2005, హైదరాబాద్. (మహాకవి).
2. డా॥ పి. భానుమతి (82), 24-12-2005, చెన్నై (సినీనటి, రచయిత్రి).
3. డా॥ కన్నెకంటి రాజమల్లాచారి (61), 29-12-2005, దాచేపల్లి, గుంటూరు జిల్లా (కవి, సాహిత్యవేత్త).
4. వై.వి. వెంకటేశ్వరరావు (82), 1-3-2006, బెంగుళూరు (కవి, నాటక రచయిత, సాహిత్యపోషకుడు).
5. వల్లం నరసింహారావు (74), 13-3-2006, హైదరాబాద్, (సినీనటుడు, అభ్యుదయ భావుకుడు).
6. విశ్వనాథ పావనిశాస్త్రి (57), 2-4-2006, కాకినాడ (కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి ద్వితీయ పుత్రుడు, సాహిత్యవేత్త).
7. డా॥ రాజ్‌కుమార్ (78), 12-4-2006, బెంగుళూరు (ప్రముఖ కన్నడ సినీనటుడు, కన్నడ భాషా ప్రేమికుడు).
8. ప్రమోద్ మహాజన్ (57), 3-5-2006, ముంబై, (బి.జె.పి. రెండవతరం నాయకుడు).
9. నౌషద్ అలీ (87), 5-5-2006, ముంబై, (హిందీ చిత్రాల సంగీత దర్శకుడు).
10. డా॥ కె. ఆర్.కె. మోహన్, 1-5-2006, హైదరాబాద్ (నవలా రచయిత).
11. "పఠాభి" (తిక్కవరపు పట్టాభిరామరెడ్డి) (87), 6-5-2006, బెంగుళూరు (నవ్య కవితా పితామహుడు).

12. ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు (86), 8-5-2006, సికింద్రాబాద్ (సాహిత్యవేత్త, పరిశోధకుడు).

13. డా॥ బూదరాజు రాధాకృష్ణ (74), 4-6-2006, హైదరాబాద్ (భాషా శాస్త్రవేత్త, పరిశోధకుడు).

14. గడియారం రామకృష్ణశర్మ (87), 25-7-2006, హైదరాబాద్, (స్వాతంత్ర్య సమరయోధుడు, సాహిత్యవేత్త, పరిశోధకుడు, విమర్శకుడు, పండితుడు, అనువాదకుడు).

15. మల్లవరపు జాన్ (79), 12-8-2006, చీమకుర్తి, ప్రకాశంజిల్లా (మంచి పద్యకవి).

16. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం (71), 15-8-2006, హైదరాబాద్, (సాహిత్యవేత్త, పరిశోధకుడు, విమర్శకుడు, ఉత్తమ ఆచార్యుడు).

17. ఉస్తాద్ బిస్మిల్లాఖాన్ (93), 21-8-2006, వారణాసి ("భారతరత్న", షెహనాయ్ విద్వాంసుడు).

18. హృషీకేశ్ ముఖర్జీ (84), 27-8-2006, ముంబై (ప్రసిద్ధ చలనచిత్ర దర్శకుడు, నిర్మాత).

19. డి.వి. నరసరాజు (86), 28-8-2006, హైదరాబాద్ (నాటక రచయిత, సినీరచయిత).

20. తంగిరాల (భళ్ళమూడి) శకుంతలాదేవి ('చిట్టి') (66), 31-8-2006 (రాత్రి), బెంగుళూరు(ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారి ధర్మపత్ని).

21. శ్రీ నండూరి భాస్కర్ (58), 15-12-2006, బెంగుళూరు, (మంచికవి, పద్యాలు వచనగీతాలూ రెండూ వ్రాసేవారు).

22. డా॥ చన్నాప్రగడ తిరుపతిరావు (82), 16-12-2006, బెంగుళూరు, (పండితుడు, కవి, విమర్శకుడు, పరిశోధకుడు, ఉత్తమ ఉపాధ్యాయుడు).

23. డా॥ బాడాల రామయ్య (82), 15-2-2007, మైసూరు (పద్యకవి, పరిశోధకుడు, ఉపాధ్యాయుడు).

24. డా॥ నాయని కోటీశ్వరి (67), 19-5-2007, హైదరాబాద్, (పరిశోధకురాలు, ఉత్తమ ఉపాధ్యాయిని).

25. డా॥ గుంటూరు శేషేంద్రశర్మ (79), 30-5-2007, హైదరాబాద్, (మహాకవి, నవకవితా పితామహుడు, పండితుడు, ఉత్తమ విమర్శకుడు).

26. ప్రముఖ రంగస్థలనటుడు పీసపాటి నరసింహమూర్తి (87), 28-9-2007, విశాఖపట్టణం.

27. "సహవాసి" (జంపాల ఉమామహేశ్వరరావు) (65), 29-8-2007, తెనాలి, (అభ్యుదయ రచయిత, అనువాదకుడు).

28. ఆచార్య పి. యశోదారెడ్డి, (75), 7-10-2007, హైదరాబాద్, (ప్రముఖ సాహిత్యవేత్త, వక్త, పరిశోధకురాలు, ఉత్తమ ఉపాధ్యాయురాలు).

29. ఎన్.వి. శ్రీనివాసరావు (75), 9-10-2007, బెంగుళూరు, (సాహిత్యవేత్త, నటుడు).

30. డా॥ ఉత్పల సత్యనారాయణాచార్య (82) 23-10-2007, హైదరాబాద్ (ప్రసిద్ధకవి, పండితుడు, సాహిత్యవేత్త).

31. డా॥ పులికంటి కృష్ణారెడ్డి (76), 19-11-2007, తిరుపతి, (ప్రసిద్ధ రచయిత, నటుడు, జానపద విజ్ఞానవేత్త).

32. బుడ్డా రామకృష్ణారెడ్డి (75), 19-1-2008, ఉయ్యాలవాడ, కోవెలకుంట్ల తాలూకా, కర్నూలు జిల్లా (రాయలసీమ దానకర్ణుడు బుడ్డా వేంగళరెడ్డిగారి మనుమడు).

"మనిషి బ్రతకడమే, బ్రతకడానికి ఉన్న హక్కును స్థాపించడమే మానవధర్మం. తన జీవనహక్కును అనుభవించడానికి అవసరమైతే శస్త్రధారణ చెయ్యడం మానవధర్మం. జీవన సంగ్రామం నుంచి మనిషి ఎన్నడూ పారిపోరాదు. జీవన సంగ్రామంలో మనిషి మనిషిగా నిలబడడానికి కావలసిన ఆత్మస్థైర్యమనే గాండీవాన్ని ధరించాలి. కనుక కాలతత్త్వసారంగా సంక్రమించిన విప్లవ ధర్మాన్ని స్వీకరించి శస్త్రధారణ చేయడమే ఆధునిక యుగధర్మం. ఇట్టి తత్త్వరహస్యాన్ని అన్ని యుగాల్లోనూ ద్రష్టలు గ్రహించారు. ఆ రహస్యానికి ఐతిహాసిక వాణి ప్రదానం చేశారు".

– శేషేంద్రశర్మ

# 'పఠాభి' గారితో నా పరిచయం

– ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

ఒక విమర్శకుడు అన్నట్టుగా విద్యుచ్ఛక్తి వచ్చి మన జీవితాలను మార్చివేసినట్టుగానే వీరేశలింగంగారు వచ్చి మన సాహిత్యాన్ని మార్చివేశారు. ఆంగ్ల సాహిత్య ప్రభావంతో అనేక నూతన ప్రక్రియలకు నాంది పలికారు. ఆయన ప్రధానధ్యేయమ్మైన సంఘ సంస్కరణకు సాహిత్యాన్ని ఒక సాధనంగా చేసుకున్నారు (Applied Literature). అయితే ఆయన ఛందస్సు, భాష మాత్రం ప్రాచీనమ్మైనవే. (పైగా జాతీయోద్యయానికి ఆయన బద్ధవ్యతిరేకి).

తిరుపతివేంకటకవులు ప్రాచీనాంధ్రసాహిత్యాన్ని తమ అవధానాలద్వారా జనప్రియం చేశారు. ఆంగ్ల విద్యాధికులైన ఆనాటి ఉన్నత వర్గాలలో మన సంప్రదాయ సాహిత్యంపట్ల అభిరుచిని కలిగించారు. విశ్వనాథ సత్యనారాయణగారు ఈ మార్గాన్ని కొనసాగించారు. భారతీయ సంస్కృతి వైభవాన్ని తన రచనల ద్వారా చాటి చెప్పారు. రాయప్రోలు సుబ్బారావుగారు టాగూరు ప్రభావంతో భావకవిత్వానికి తెరలేపారు. కృష్ణశాస్త్రిప్రభృతులు దానిని కొనసాగించారు. అయితే ఈ మార్గం ప్రజల వాస్తవిక దుర్భర జీవితాలకు ఏ మాత్రమూ సంబంధం లేకుండా ఊహాలలోకాల్లో విహరించడంవల్ల ఆనాటి యువకవులు కొందరు ఈ భావకవిత్వంపై తిరుగుబాటు చేశారు. నిజమ్మైన నవ్యకవిత్వానికి రాచబాటలు వేశారు. అటువంటివారిలో ముఖ్యులైన నలుగురు కవులలో 'పఠాభి'గారు ఒకరు. (శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణ బాబు, శిష్ట్లా ఉమామహేశ్వరరావు మిగిలిన ముగ్గురు). వీరికి 'అడుగుజాడ గురజాడది'! అది అభ్యుదయ పంథా!

పేదలను వారిబాధలను కవితావస్తువులుగా చేసి, వస్తువులో నవ్యత తెచ్చినవాడు శ్రీశ్రీ. కవిత్వంలో ప్రతీకలు భావచిత్రాలు (శబ్దచిత్రాలు/పదచిత్రాలు) ప్రవేశపెట్టి నిర్మాణంలో నవ్యత తెచ్చినవాడు నారాయణబాబు. వచన కవిత్వానికి అంకురార్పణ చేసినవాడు శిష్ట్లా. ఉపమానాల్లో, భావనాశక్తిలో, అభివ్యక్తిలో నవ్యత ప్రవేశపెట్టినవాడు పఠాభిగారు.

1952-53 విద్యాసంవత్సరంలో నేను పశ్చిమగోదావరిజిల్లాలోని భీమవరంలో (W.G.B. Collegeలో) ఇంటర్మీడియేట్ మొదటి సంవత్సరం చదువుతున్నాను. నాకు అప్పుడు 17 సం.లు. ప్రసిద్ధ సాహిత్యవేత్త డా॥ శ్రీ పాద గోపాలకృష్ణమూర్తిగారు

మా కళాశాలకు వచ్చారు. మా గురువుగారు దిగుమర్తి సీతారామస్వామిగారు ఆయనచేత ఒక ఉపన్యాసం చేయించారు. "తెలుగులో ఆధునిక కవిత్వం" అనే అంశంపై శ్రీపాదవారు ప్రసంగించారు. అది ఒక అద్భుతమైన ప్రసంగం! నా జీవితంలో నన్ను మిక్కిలిగా ప్రభావితంచేసి, నన్ను తెలుగు సాహిత్యంవైపు ఆకర్షించిన ప్రసంగం. (ఇంటర్‌లో నేను బైపిసి విద్యార్థిని. తరువాత బోటనీ బి.యస్సి.లో చేరి, దానిని వదలి, తెలుగు బి.ఏ.లో చేరినవాడిని). శ్రీపాదవారు తన ఉపన్యాసంలో విశ్వనాథవారినుండి శ్రీశ్రీ - 'పఠాభి' - 'కాళోజీ'ల వరకూగల ఎందరో ఆధునిక కవుల కవితలను ఉదాహరిస్తూ ఉద్వేగంగా ప్రసంగించారు. ఆయా కవుల గొప్పతనాలను లోపాలను కూడా వివరించారు. "ఏ రాజు పంచెనో ఇచట శౌర్యపుపాయసంబుల నాగులచవితినాళ్ళ" అనే విశ్వనాథవారి ఆంధ్రప్రశస్తిలోని పద్యాన్ని ఉదాహరిస్తూ, "నాగుల చవితికి పాయసం పంచిపెడతారా? చలిమిడి, చిమ్మిలి పంచిపెడతారుకాని!" అన్నారు. "విశ్వనాథకవికాడు; నవలాకారుడు మాత్రమే!" అని తీర్మానించి, 'ఏకవీర' నవలనుండి కొన్ని పేరాలు అప్పచెప్పారు. శ్రీశ్రీని గురించి చెపుతూ, "మరో ప్రపంచం! మరోప్రపంచం! పిలిచింది! పదండి ముందుకు, పదండి త్రోసుకు, పోదాం పోదాం పైపైకి!" - "ఇదేమిటి? నిద్దట్లోంచి లేచి కేకలు పెడతావేమిటి? ఇది కవిత్వం కాదు!" అన్నారు నిష్కర్షగా. 'భిక్షువర్షీయసి'ని ఉదాహరిస్తూ -

**"దారి ప్రక్క చెట్టుక్రింద**
**ఆరిన కుంపటి విధాన**
**కూర్చున్నది ముసిల్దకతె**
**మూలుగుతూ ముసురుతున్న**
**ఈఁగలతో వేగలేక!"** - "ఇలారా దారికి! ఇదీ కవిత్వమంటే" అన్నారు. "రాయి విసిరినా రాకెట్టు విసిరినా/కిట్టని వానిని కొట్టుటకే కద" - అన్న కాళోజీ కవితను ప్రశంసించారు. అప్పుడే "పఠాభి"గారి పేరూ, ఆయన "ఫిడేలు రాగాల డజన్" గొప్పతనాన్నీ శ్రీపాదవారి నోట విన్నాను. "హంసయాన - మదగజయాన"లకు బదులుగా "టకు టకు టకు టకు హైహీల్డుయాన"ను తెలుగు కవిత్వంలో ప్రవేశపెట్టిన ప్రయోగవాదిని గురించి విన్నాను. "మద్రాసు నగరమా! నీ మీద బ్లూబ్లాకు సిరాలా పడింది రాత్రి!" - "ఎవరో చైనాబజారులో తగిలించారు చంద్రుణ్ణి!" - అన్న అతినవ్యకవితాభివ్యక్తిని ఆ ఉపన్యాసకుని నోట విని ఆశ్చర్యచకితుణ్ణి అయిపోయాను! అదిగో! అలాగ నా 17వ ఏట పఠాభిగారి కవిత్వ

పరిచయం కలిగింది నాకు. (ఇది పరోక్ష పరిచయం). తరువాత 'ఫిడేలు రాగాల డజన్' చదివాను. పత్రికలలో వచ్చిన వారి 'పన్‌చాంగాన్ని', అష్టవిధ శృంగార నాయికలను ('కయిత నాదయిత') చదివాను. ఆనందించాను. వారు అప్పుడు మద్రాసులోను, నేను తణుకులోను ఉండటంవల్ల, వారిని కలుసుకొనే అవకాశం కలుగలేదు.

1961లో నేను తిరుపతిలో ఎం.ఏ. (తెలుగు) లో ప్రవేశించాను. అప్పుడు నెల్లూరు నుండి నలుగురు మిత్రులు వచ్చి నాకు సహాధ్యాయులుగా చేరారు. వారు తమ బి.ఏ. (తెలుగు)లో సాహిత్య చరిత్రలో చదివిన, పఠాభిగారి కవిత్వ విశేషాలను చెపుతూ, "వచన పద్యాల దుడ్డుకర్రలతో పద్యాల నడుములు విరగదంతాను" - "బోగంచానా! నీవు సంఘానికి వేస్టు పేపర్ బాస్కెట్‌వా?" మొదలైన అంశాలు ప్రస్తావించేవారు. పఠాభిగారు తమ నెల్లూరువాడు అని కొంచెం గర్వంగా చెప్పేవారు. నెల్లూరులో ప్రసిద్ధ సాహిత్యపోషకులు, సంపన్న కుటుంబీకులు అయిన తిక్కవరపు రామిరెడ్డిగారు పఠాభిగారి తండ్రి. ప్రసిద్ధ రాజకీయవేత్త సాహిత్యవేత్త అయిన బెజవాడ గోపాలరెడ్డిగారు పఠాభిగారికి మేనమామ మరియు బావగారు కూడా. తన 'పన్‌చాంగమ్'లో మేనమామను కూడా వేళాకోళం చేశారు పఠాభిగారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో గోపాలరెడ్డిగారు టంగుటూరి ప్రకాశంగారిని సమర్థించకుండా రాజాజీ పక్షాన్ని వహించినప్పుడు "ఈయన గోపాలరెడ్డికాదు, రాజగోపాలరెడ్డి!" అన్నారు. ప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకులు పుచ్చలపల్లి సుందరయ్యగారు కూడా పఠాభిగారి బంధువులే. అయినా పఠాభిగారు అటు కాంగ్రెసులోనూ ఇటు కమ్యూనిస్టుపార్టీలోనూ చేరకుండా సోషలిస్టుఅభిమానిగా మారారు. డా॥ రామమనోహర్ లోహియా భావజాలంవైపు ఆకర్షితులయ్యారు. అలాగే జయప్రకాష్ నారాయణ్, గోపాలగౌడ (కర్ణాటక) కూడా ఈయన అభిమాన నాయకులు. పఠాభిగారి చిన్నతనంలో మహాత్మాగాంధీగారు వారి యింటికి వచ్చారట. అప్పటినుండీ ఆయింటిలోని వారందరూ ఖద్దరు ధరిస్తూ శాకాహారులుగా మారిపోయారట. (ఈ విషయం పఠాభిగారు నాతో స్వయంగా చెప్పారు).

నేను 1969 డిసెంబరు 27వ తేదీనాడు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు ఉపన్యాసకుడుగా చేరాను. పఠాభిగారు మద్రాసునుండి బెంగుళూరు వచ్చిన సంగతి నాకు తెలియదు. 1970లో "సంస్కార" కన్నడ సినిమా విడుదలై సంచలనం సృష్టిస్తోంది. నేను ఆ సినిమా చూశాను. దర్శకుడు-నిర్మాతగా "టి. పట్టాభిరామరెడ్డి" అని ఉంది. ఈయన ఎవరో కన్నడ చిత్ర నిర్మాత అనుకున్నాను.

ఈయనే 'కవి పఠాభి' అని తెలుసుకోలేకపోయాను. తరువాత నా ప్రియమిత్రుడు డా॥ ఆర్వీయస్. సుందరం చెప్పాడు. తనకు ఆయనతో పరిచయం ఉందని కూడా చెప్పాడు. తాను వారి యింటికి వెళ్ళాననీ, యింటిలో అంతా పాశ్చాత్యసంస్కృతి అనీ, ఆయన తప్ప ఎవరూ తెలుగు మాటలాడరనీ చెప్పాడు. అప్పుడే తిరుపతి వంటి గ్రామీణ సంస్కృతి నుండి వచ్చిన నేను కొంచెం జంకాను. నేను ఇంగ్లీషు ధారాళంగా మాటలాడలేను (అప్పటికీ ఇప్పటికీ కూడా). అయినా సరే, ఒకరోజు సుందరంతో కలిసి వెళ్ళి, పఠాభిగారి పరిచయం చేసుకున్నాను. ఆయన చాలా ముభావంగా ఉండేవారు. ఎక్కువగా మాటలాడరు. మనం పదిమాటలు మాటలాడితే, ఆయన ఒక్కమాట మాటాడుతారు. అదీ ఇంగ్లీషులో. పైగా సినీమా నిర్మాణంలో ఎప్పుడూ హడావిడిగా ఉండేవారు. "ఈయన మన కవిత్వానికి సంబంధించినవాడు కాడు; సినిమావాడు" అని నిర్ణయించుకొని, తరువాత చాలాకాలం వరకూ నేను ఆయనను కలవలేదు. ఈలోగా ఎమర్జన్సీ రావడం, స్నేహలతారెడ్డిగారు చనిపోవడం జరిగిపోయాయి. ఆంగ్లంలో వెలువడిన స్నేహలతారెడ్డిగారి జైలుడైరీ చదివి చలించిపోయాను. తరువాత పఠాభిగారి దగ్గరకు వెళ్ళడం మొదలుపెట్టాను.

పఠాభిగారు "చతుర్ముఖుడు". ఆయనకు నాలుగు ముఖాలున్నాయి: కవిత్వం, చిత్ర నిర్మాణం, గణితం, సమాజసేవ. నాకు వారి మొదటి ముఖం మాత్రమే పరిచయం. మిగిలిన పార్శ్వాలు నాకు తెలియవు. ఆయన వ్యక్తిత్వం కూడా కొంత పరిచయం ఉంది. 1986 ఉగాదినాడు నేనూ సుందరం కలిసి మైసూరులో "చైతన్య కవిత" అనే కవిత్వ పత్రికను ప్రారంభించాం. దీని మొదటి సంచికను మైసూరులోని "ధ్వన్యాలోకం" అనే సాహిత్య పరిశోధన కేంద్రంలో, ప్రముఖ ఆంగ్ల సాహిత్యవేత్త ప్రొ॥ సి.డి.నరసింహయ్యగారి అధ్యక్షతన, ఆచార్య యస్వీ. జోగారావుగారు ఆవిష్కరించారు. రెండవ సంచికనుండి ప్రముఖకవుల ఛాయాచిత్రాలను ముఖచిత్రాలుగా వేయాలని నిర్ణయించాం. మొట్టమొదట పఠాభిగారి ముఖచిత్రంతో ప్రారంభించాం. తరువాత కాళోజీ, శేషేంద్ర, అజంతా, సోమసుందర్, ఆరుద్ర ఇత్యాదుల ముఖ చిత్రాలతో సంచికలు వెలువరించాం.

1987లో శేషేంద్రగారి షష్టిపూర్తి జరిగింది. అప్పుడు నేను "గుండె పూచిన గులాబీ" అనే కవితా సంపుటిని ప్రచురించాను. (సుందరం "సుందర ప్రభవ" ప్రచురించాడు). దీనికి పఠాభిగారి చేత, శేషేంద్రగారి చేత పీఠికలు వ్రాయించాను. పఠాభిగారు నా కవితలు చదివి, "బాగున్నాయి. చక్కగా చదివించాయి అయితే నేను పీఠిక ఇంగ్లీషులో వ్రాస్తాను. దానిని మీరు తెలుగులోకి అనువదించుకోండి" అన్నారు.

నేను సరే అన్నాను. అలాగే చేశాను. (అలా ఎందుకన్నారో నాకు తెలియలేదు. బహుశః కుటుంబసభ్యులతోను, బయట మిత్రులతోను - ఇంట్లో పనివాళ్లతోసహా ఆంగ్లంతప్ప వేరే భాష మాటలాడే అవకాశం పఠాభిగారికి లేకపోవడమే దీనికి కారణం కావచ్చు. పైగా ఆయన కలకత్తాలోను, అమెరికాలోను ఆంగ్లసాహిత్యాన్ని అధ్యయనం చేశారు. ఆయన స్థానికమైన కన్నడభాషమాటలాడటం కూడా నేనెప్పుడూ వినలేదు.)

11-4-1994 నాడు నేను "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" (శ్రీరస) అనే సాహిత్య సంస్థను స్థాపించాను. దీనిని పఠాభిగారే ప్రారంభించారు. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారింట్లో తెలుగు - కన్నడ కవుల కవితాగోష్ఠితో ఈ సాహిత్య సంస్థ అస్తిత్వానికి వచ్చింది. ప్రముఖ కన్నడ దళితకవి డా॥ సిద్ధలింగయ్యగారు కూడా ఈ సభకు వచ్చి తమ కవితలు చదివారు. అప్పటినుండి ఇప్పటి వరకు ఈ సాహిత్య సంస్థ ఎన్నో సభలు దిగ్విజయంగా నిర్వహించింది. చాలా సభలలో పఠాభిగారు పాల్గన్నారు. వారికి 75 సం.లు నిండినప్పుడు ప్రసిద్ధ సోషలిస్టు నాయకులు శ్రీరావెల సోమయ్యగారు హైదరాబాద్‌లో పఠాభిగారిని ఘనంగా సత్కరించి, వారి కవితా సంపుటులన్నీ రెండు గ్రంథాలుగా ప్రచురించారు. నేను కూడా బెంగుళూరు విశ్వవిద్యాలయంలో వారికి సన్మానం చేశాను. "చైతన్య కవిత-17" భావ వసంత సంచికను (Spring 1994) పఠాభిగారికి అంకితం చేశాను. వారిని గురించి ఒక అంకిత కవిత కూడా వ్రాశాను.

"చైతన్య కవిత" - 19 & 20 (సంయుక్త సంచిక), April and July 1995 పఠాభిగారి కోరికపై కవయిత్రుల ప్రత్యేక సంచికగా ముద్రించాను. దీనిమీద డా॥ జయప్రభగారి ముఖచిత్రం వేశాను. (పఠాభిగారికి జయప్రభగారి కవిత్వమంటే చాలా ఇష్టం). అట్టవెనుక స్నేహలతారెడ్డిగారి ఫోటో వేశాను. దీనిని ఆమెకే అంకితం చేశాను. ఈ సంచిక ముద్రణ వ్యయాన్ని పఠాభిగారు ఇచ్చారు.

19-2-2001 నాటికి పఠాభిగారికి 82 సంవత్సరాలు నిండాయి. అంటే సహస్రపూర్ణచంద్రదర్శనోత్సవం. ( ఆ ఉత్సవాన్ని వారి అమ్మాయి శ్రీమతి నందన, వారి అబ్బాయి శ్రీ కోణార్క చేశారు. మైసూరుకు సమీపంలో గుండ్లుపేట దగ్గర ఉన్న గోపాలస్వామికొండమీద వెలసిన శ్రీహిమవద్‌గోపాలస్వామివారి సన్నిధిలో బంధుమిత్రుల సమక్షంలో నిరాడంబరంగా జరిపారు. నేను "చైతన్య కవిత-33" వ సంచికను (వృష వసంతం - April 2001) పఠాభిగారికి అంకితం చేశాను. 'వేయి పున్నమిరేలు" పేరుతో ఒక చిన్న కవిత కూడా వ్రాశాను. అమెరికాలోని అప్పాజోస్యుల - విష్ణుభట్ల ఫౌండేషన్‌వారు 2000 సంవత్సరం జనవరినెలలో నెల్లూరులో

పఠాభిగారిని సత్కరించారు. పఠాభిగారిని అడిగి ఆ కలర్‌ఫోటో తీసికొని ఈ చైతన్య కవిత (33) లో ముద్రించాను. ఈ చైతన్యకవిత సంచికను అప్పటి కర్ణాటక రాష్ట్ర గవర్నరు శ్రీమతి వి.యస్. రమాదేవిగారిచేత రాజభవన్‌లో పఠాభిగారికి ఇప్పించాలని ప్రయత్నించాను. రమాదేవిగారు అంగీకరించారు కూడా. కాని ఆమె ఇలా అన్నారు: "అంత పెద్ద కవికి ఇలా గదిలో అంకితమిస్తే ఏమి బాగుంటుంది? ఒక సభ చేయండి. నేను వచ్చి ఇస్తాను". ప్రియమిత్రులు శ్రీ బుల్లా సుబ్బారావు (ఐ.ఏ.యస్)గారు సభను ఏర్పాడు చేయడానికి శ్రీమతి నందనగారితో మాటలాడారు కూడా. కాని మా 'శ్రీరస' సాహిత్యసభలకు (గరిష్ఠంగా) 50 మందికన్నా ఎక్కువ సభాసదులు రారు. "గవర్నరుగారిని పిలిచినసభలో అంతతక్కువమంది సభ్యులుంటే ఏం బాగుంటుంది?" అని మిత్రులు శ్రీ ఎ. రాధాకృష్ణరాజుగారు భయపెట్టారు. దానితో వెనక్కి తగ్గి, పఠాభిగారి ఇంటికి వెళ్ళి, ఆ పత్రికను ఇచ్చి నమస్కరించి వచ్చాను. కొన్ని పనులు అనుకుంటాం కాని చేయలేం.

ప్రముఖకవి గుంటూరు శేషేంద్రశర్మగారు ప్రతిసంవత్సరం వేసవిలో హైదరాబాద్ నుండి బెంగుళూరు మీదుగా ఊటీ వెళ్ళేవారు. వెళ్ళేటప్పుడూ వచ్చేటప్పుడూ బెంగుళూరులో నేను ఆయనదర్శనం చేసికొనేవాడిని. శేషేంద్రగారి కవిత్వాన్ని చదివిన పఠాభిగారు ఒకసారి ఆయనను చూడటానికి బెంగుళూరులోని West End Hotel కు వచ్చారు. ఇద్దరూ చాలాసేపు సంభాషించుకున్నారు. (ఇద్దరిదీ నెల్లూరే కావడం గమనార్హం). మరణ రహస్యాన్ని చర్చిస్తూ "సావిత్రి" అనే సినిమా తీయాలని పఠాభిగారు చెపుతూ ఉండేవారు. అరవిందయోగి 'సావిత్రి' ని గురించి శేషేంద్రగారితో చర్చించారు పఠాభిగారు. శేషేంద్రగారు రచించిన "స్వర్ణహంస"ను పఠాభిగారు చదివారు. (పఠాభిగారు గొప్ప మేధావి. ఎప్పుడూ సీరియస్ బుక్సే చదివేవారు. నేను ప్రచురించిన శ్రీకృష్ణకర్ణామృతాన్ని ఎంతో ఆసక్తితో చదివారు. సంస్కృత శ్లోకాలకు, తెలుగు పద్యాల పద్ధతిలో యతిప్రాసలు పాటించిన లీలాశుకుడు లేక బిల్వమంగళుడు తెలుగువాడే అయి ఉంటాడు అనే నా అభిప్రాయాన్ని సమర్థిస్తూ నాకు ఒక లేఖ వ్రాశారు - ఇంగ్లీషులో).

మన ఆధునిక కవులలో నూటికి తొంభైమంది "మూగవాళ్ళు"! వేదిక నెక్కిస్తే అందంగా ఒక్కమాట మాటలాడలేరు. అసలు ఉపన్యాసం అంటేనే భయపడిపోతారు. "పోనీ, మీ కవిత చదవండి" అని ప్రార్థిస్తే ఉసూరుమంటూ చదువుతారు. లేదా ఏదో గొణుక్కుంటూ చదువుతారు. అందుకే కాబోలు, అల్లసాని పెద్దన వంటి మహాకవి కూడా తనకు లేఖకులతోపాటు "పాఠకోత్తములు" కావాలన్నాడు. మన ఆధునిక

కవులలాగే ఆయన కూడా "మూగవాడు" కాబోలు. శ్రీశ్రీగారు, తిలక్‌గారు, ఇస్మాయిల్‌గారు, ఆరుద్రగారు వేదికల మీద గొణుక్కోవడం నేను స్వయంగా విన్నాను. మన పఠాభిగారుకూడా ఈ కోవకు చెందినవారే! "నన్ను మాటలాడించ కూడదు" అనే కండిషన్‌తోనే మా సభలకు వచ్చేవారు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి, సినారె, శేషేంద్ర వంటివారు కవితాసృష్టిలోను, ఉపన్యాసంలోను - రెండింటిలోను దిట్టలే. అయితే ఇటువంటి వారు పదిశాతం మాత్రమే ఉన్నారు. కథలు, నవలలు వ్రాసేవారిలో నూటికి నూరుమందీ "మూగవాళ్ళే"! శ్రీ కాళీపట్నం రామారావుగారి వంటి గొప్ప రచయిత కూడా సణుగుడూ గొణుగుడే! ఈ గద్య రచయితల ఉపన్యాసం మాట దేవుడెరుగు, కనీసం గోష్ఠిలో కూడా అందంగా రెండు మాటలు చెప్పలేరు. ఇతరుల రచనల గురించే కాదు, తమ రచనలను గురించి కూడా ఏమి చెప్పలేరు. ఉపన్యాసం సహజంగా అలవడే ఒక ప్రత్యేకమైన కళ! అందుకే అది అభ్యసిస్తే వచ్చేది కాదు!

పఠాభిగారు పద్యకవిత్వానికీ ప్రాచీనకవిత్వానికీ బద్ధశత్రువు అని అందరూ భావించే ప్రమాదం ఉంది. దీనికి గల ముఖ్య కారణం, ఆయన 'ఫిడేలు రాగాల డజన్' లో మొట్టమొదటి కవితలోనే "వచన పద్యాల దుడ్డుకర్రలతో పద్యాల నడుములు విరగదన్నుతాను" అనే పాదం. నేను ఈ విషయమే ఒకసారి అడిగితే - "I don't mean it. I like old poems" అన్నారు. నా మిత్రులు శ్రీ కె.యస్. రామచంద్రమూర్తిగారు, రాజమండ్రిలోని తెలుగు విశ్వవిద్యాలయంలో పరిశోధన చేస్తున్నప్పుడు, బెంగుళూరు వచ్చి నా సమక్షంలోనే పఠాభిగారిని ఇంటర్‌వ్యూ చేశారు. ఆ ఇంటర్‌వ్యూలో దీనిని గురించే ఇలా ప్రశ్నించారు - "పద్యాల నడుములు విరగదంతా"నన్నారు. ప్రాచీన కవిత్వమంటే (మీకు ఇష్టం లేదా)? - ఈ ప్రశ్నకు నా యెదురుగుండానే పఠాభిగారిచ్చిన సమాధానం:-

"ప్రాచీన కవిత్వమంటే నాకు చాలా ఇష్టం. ఇప్పటికీ ప్రాచీనకావ్యాలు, భారతం, మనుచరిత్ర వగైరా చదువుతూనే ఉంటాను. మా నాన్నగారు మా యింట్లో పండితుల చేత భారత భాగవతాలు, వసుచరిత్ర ఇత్యాది గ్రంథాలు చదివిస్తూ ఉంటే - తంగిరాల సుబ్బారావుగారి గొంతులాంటి ఆ గంభీర స్వరాల్ని విని ఆనందించేవాడిని. భావకవులు అదేపనిగా తేటగీతులు, ఆటవెలదులు, ద్విపదలు - మొదలైన ఛందస్సుల్లో ప్రణయ కవిత్వాన్ని పలవరించినందుకు కోపం వచ్చి అలా రాశాను" - (చూ. చైతన్యకవిత-33, విషువసంతం, April, 2001).

*(సశేషం)*

# అంటీ ముట్టని బంగారం

– డా॥ రాజేశ్వరీ దివాకర్ల

తల పండితేనేం లే!
మరో గణిత పాఠం
నేర్చుకోబోతున్న
కొత్త విద్యార్థిలా
కనిపించటం లేదా?
వయసు పైబడితేనేం లే!
కళ్ళల్లో మైక్రోస్కోపులున్న
చిన్న పిల్లాడి జిజ్ఞాస
తెలియటం లేదా?
బాగా నాజూకుగా
ఉన్నాడంటావా...
బలు సాహసి లే!
పాత ఛందస్సుల
నడ్డి విరగ్గొట్టాలని
వచనమనే దుడ్డు కఱ్ఱను
పట్టుకొచ్చాడీయన
అప్పటివరకూ పుస్తకాల్లో
వీణ వాయించుకుంటూ ఉంటే
ఈయనేమో ఫిడేల్ను తెచ్చి
డజను తెలుగు పద్యాల రాగాలు
మోగించినాడు!
కవులందరూ
ఎంతో గొప్పగా పొగడిన
చంద్రుడేమో ఈయనకి
నగర వీథుల్లో
ఇరుక్కున్నట్టు కనబడితే
చిత్ర విచిత్రమైన యోచనలతో
వింత వింతగా రాసినాడు!
అందరూ ముక్కుమీద
వేలేసుకునేటట్టు
'భోగం పిల్ల' నిజాయితీని
మొదటిసారిగా తెలిపినాడు!
స్వచ్ఛమైన సినిమా 'సంస్కార'ను తీసి
నూతన దృశ్యం చూపించినాడు
రవీంద్రుని శిష్యరికంతో
'శృంగారమాస' మొలికించినాడు
రాజకీయ నియంత్రణకు
'చండమారుత'మై
సంచలించినాడు
నవ్వుడని తెంపరికాడు
'కయిత నాదయిత'ని చెప్పిన
కావ్య కంకణధరుడు
పరిసర లలిత శాలీనుడు
'స్నేహలతా' ప్రవరుడు
శ్లేష భూషణుడు
ఆజాను బాహుడు
అందరినీ ఆకట్టుకుంటూ
'అంటీ ముట్టని బంగారం' వలె
తానున్న తావుకు
ఛాయ తెచ్చినవాడు
ఏ పట్టా వలదంటూ
తన పేరుకు
పొట్టలో చుక్క
మొలిపించుకున్నవాడు

ఈయన 'పఠాభి'!
లోతు చూపక కనిపించే
నిరాడంబరాహంభావకవి!

[చైతన్యకవిత-40, అక్టోబరు 2004 (తారణశరత్తు)]

# "SHRI PATTHABHI - THE MAN OF A BIG SAGA"

- Ambika Ananth

In his soul there is eternal music divine
He turned his poetic heart into a violin
and played 'twelve ragas' so very fine...
His pulse danced in rhythm
He himself became a poem...!!

He had empathy and sympathy
even as a child of tender age
so found a perfect match
in the peace and bliss of 'Shanti Niketan'
the abode of the poet par excellence -
Gurudev Rabindranath,
It was a soothing dream - life
for his poetic, sensitive heart,
which already is in love with the Muse...!!

Though a globe trotter
going around the world
He has his moorings only here!
He took refuge in his poetry and pictures
when life gave him unreasonable punishments!
He believes in the unseen hand of the
"Script Writer' up above
with great courage and grace, through all the
dire straits, he won over!

He remains till date as a picture of dignity
self-esteem and solemnity!
At this mellow, ripe age, he sees the
beauty beyond the mundane life ...
after seeing life in all its colour and hue
Grand Old Shri Patthabhi,
though he sees 'death' fearlessly as a creative gift
he has many years to go, to take it!
He has the poetic vision
as large as the sky
and changed the trend of writing
to something mighty and high!
He is the 'man of a big saga'
His life itself is 'a moving raga'
He is a living legend
for his fame and name there is no end...!!

*(Chaitanya Kavita-40, October, 2004)*



# పఠాభి పన్‌చాంగమ్

1. రాజాజీ సామరస్యానికి మొనగాడు
ఆద్యంతములే అందుకు సాక్షి!

2. చిన్మయానందం కొందరికి
జిన్‌మయానందం అనేకులకు!

3. సినిమా వ్యాపారం బ్రహ్మాండమైన లాటరీ
అదృష్టం వున్నవాడు 'వాసన్'
లేనివాడు ఉపవాసన్!

4. కేంద్రప్రభుత్వంలో చాలా
ఢిల్లీ డాలీయింగు!

5. హరిసేవవల్ల స్వర్గప్రాప్తి సందిగ్ధం
మనోహరి సేవవల్ల
భూలోకమే స్వర్గతుల్యం!

6. కొందరికి పక్కలో బల్లెం మగడు
పక్కలో బెల్లం విటుడు!

7. గిరులకు పూర్వం యోగులు
పోయేవారు
ఇప్పుడు భోగులు పోతున్నారు
నీల గిరులకు!

8. మధ్యాహ్నం నిద్రపోవుట మంచిది
ఒక్కదినం రెండు దినాలుగా తోస్తుంది!

9. రోజాలకన్నా అందం ఉరోజాలు!

10. గ్రామాలు గరిక ప్రదేశాలేగాని
నాగరిక ప్రదేశాలు కావు!

11. వర్తమానకాలంలో వంశప్రతిష్ఠకంత
ప్రాముఖ్యం లేదు – గుర్రాలలో తప్ప

12. చీట్లాడువారికి, క్రైస్తవులకు
ఏసుదయ వుండాలి!

13. కాంగ్రెసు వాళ్ళకు
వడకటం తగ్గి
ఏకటం హెచ్చింది!

14. ఖయ్యాం రుబాయత్‌ను
సిరాతో కాదు సారాతో వ్రాశాడు!

15. తీసినా వేసినా
బాధ కల్పించునవి
పన్నులు!

16. రామాయణంకన్నా పాప్యులర్
లోకాభిరామాయణం!

17. తలంబ్రాలు కాదు
అది తలన్‌వ్రాలు!

18. సినిమా నటీమణి ఆశ
మాత కావాలని కాదు
నిర్మాత కావాలని మాత్రమే!

19. శాసనసభ్యుల్లో చాలమంది
ఆసన సభ్యులు మాత్రమే!

20. ఏ ఆఫీసుకు పోయినా
దక్షిణ లేనిదే ఉత్తరం లేదు!

21. పద్యములను మద్యములను
సీసాలతో సేవింతురు రసజ్ఞులు!

22. వంటకానికి నాటకానికి
మంచి పాత్రలు ముఖ్యం!

23. దంతి కంటె వదంతి గొప్పది!

24. బర్త్ కంట్రోలుకు ముఖ్యం
భర్త కంట్రోలు!

25. నిందింపు నిన్ దింపు!

26. భార్యలందరికి
భర్తనాట్యం ప్రస్తుతం!

27. మనజాతిలోని సవర్ణ వివాహాలు
సువర్ణ వివాహాలు పోవాలి!

28. రెక్కాడితే కాని డొక్కాడనివాడు
రైల్వే సిగ్నలర్!

29. ట్యూబు బేబీలు వచ్చాక
మాతృత్వంలోని మహనీయత
గాజు వారింది!

30. ఈయన గోపాలరెడ్డి కాదు
'రాజగోపాలరెడ్డి'!
*(బెజవాడ గోపాలరెడ్డిగారు ప్రకాశం పంతులుగారితో చేరకుండా రాజాజీని బలపరచినప్పుడు చెప్పినది)*



# HUMAN WARE

- ''Patthabhi'

O, Madras City!
Night is aperching like the blue-black ink on you.

In the windows of the Mint street buildings
Lamps glimmer like the wish - welcoming eyes.

The traffic swells there.
"The human wares" lilting like the Japanese jades
In the half-dim half-bright houses, fancy shops,
With their bulging breasts
In their half sleeves blouses of cannon-colour
Like the wrappers of "mixture packets"
Sold in 'Kishen Singh Street',
Faces laminated with the thick layers of the talcum powder.
A pale smile glistening like a dim-sticker on their bloodless lips.

People of all sorts visit,
"The Gentlemen" too, so called
Hiding their faces underneath their hats.
Students escaping from the hostels,
Theives, drunkards, leaders, pleaders, priests, debauchers
All, to pair erostically-fare for a rupee or two.
O, human ware!
Are you a waste paper basket to the society
To be so wished by the people
To love them for a rupee or two

To desire to pretend like an innocent blonde
Falling in love only with them for the first time?
What a self deception they perpetrate on themselves!

I respect you,
See the real life really reflecting only in you.
At all other places everything is only a deception, a drama,
Everything is pretentions and untrue.
The priest,
The chastity of the wife head-bending
As if in modesty and humility,
The Yogis,
All are untrue.
But you, "The human ware", you are the cold truth
Without a blade of a mask on you,
The pure truth,
Without a shred of a cloud casting a shadow on you.

*(From "Poetry Pattabhic" by Dr. Kondal Rao Velchala)*



- **"Poetic quest is an eternal quest, a research in infinity as well as in unity"**
- **"The most dearest to me are love, poetry and maths"**
- **"Puns give me the opportunity to see simultaneously both sides of the same coin. I value this gift of seeing the sides".**
- **"Poverty is bad. I don't mean the poverty of money alone, but also poverty of love, poverty of values, poverty of ethics".**

***- Patthabhi***

# శేషేంద్ర కవితా వైభవం

- ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

## I. కవితాకాశంలో స్వాతిమెఱపులు:

1. సముద్రం ఒకడి కాళ్ళదగ్గర కూర్చుని మొరగదు
తుఫాను గొంతు 'చిత్తం' అనడం ఎరగదు
పర్వతం ఎవడికీ వంగి సలాం చేయదు
నేనింతా పిడికెడు మట్టే కావచ్చు -
కానీ కలమెత్తితే నాకు ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది!

2. నడిస్తే నా అడుగులు
మబ్బుల్లో పరిగెత్తే పిడుగులు
ఎత్తితే నా చెయ్యి
మండే అగ్నిజ్వాల
దించితే నా చెయ్యి
వెయ్యి కిరణాలు వ్రేలాడే సాయంసంధ్య!

3. నా మాటలు ఈ దేశపు మట్టిలో చల్లుతున్నాను
అన్ని దిక్కులా కత్తులు మొలవాలని -
నేను జ్వాలల్ని కొరడాలుగా ఝళిపిస్తున్న అగ్నిని!

4. నా కవిత్వం ఏ జెండానూ ఎగరేయదు
కానీ నా చేతులు నా దేశపు ఖడ్గాలు!

5. నా కవిత్వం మనిషికి కేవలం ఒక డిఫెన్స్!

6. మనమందరమూ తుఫానుల్లో నడిచిన వాళ్ళమే
ఒక చిన్న తారతో దినమవుతుందా?
మండే సూర్యుడు కావాలి!
పదండి ముందుకు! మీ జెండాపై ఎగురుతాను!

7. కాలాన్ని నా కాగితం చేసుకుంటా
దానిమీద లోకానికి ఒక స్వప్నం రాసియిస్తా
దానికింత నా ఊపిరితో సంతకం చేస్తా!

8. గగనంలో ఎగరేశాను - అక్షరాలకు అమృతం తాగించి
కాగితాలకు ఊపిరి పోశాను - మనిషిలో కలం ముంచి
నన్ను కత్తితో పొడుప్ -
రక్తం కాదు - కవిత్వం కారుతుంది!

9. నదులూ కవులూ భూగోళపు రక్తనాళాలు
నదులు ప్రవహిస్తున్నాయి కవితల్లా
పక్షుల కోసం పశువుల కోసం మనుషుల కోసం
నదులు కంటున్న కలలు పొలాల్లో ఫలిస్తాయి
కవులు కంటున్న కలలు మనుషుల్లో ఫలిస్తాయి!

పై కవితా శకలాలు చదివితే ఏ మాత్రం తెలుగు పరిచయం ఉన్న పాఠకుడైనా రసానుభూతితో తన్మయుడైపోతాడు. కవిత్వాన్ని పరబ్రహ్మ స్వరూపంగా గుర్తిస్తాడు. ఇలా శరీరంలో రక్తం కాకుండా కవిత్వం మాత్రమే ప్రవహించే తెలుగు మహాకవి ఆధునిక యుగంలో ఇంతకు ముందు లేడు; ఇకముందు రాడు - అంటే అది అతిశయోక్తి కాదు, సహజోక్తి. అందుకే పైన ఉదాహరించిన కవితా ఖండికలలో మొదటి దానిని చదివి, ''వల్లభాచార్య'' అనే విమర్శకుడుు ఇలా అన్నాడు:

> ''ఈ మాటలు అన్నవాడికి 'కవి' కాక మరోపేరు ఏముంటుంది? గుంటూరు శేషేంద్రశర్మ అనేది ఒక కవి పేరు! కవిత్వానికి నిర్వచనం చెప్పాలంటే 'శేషేంద్ర' అంటే చాలు!!''.

మరికొందరు విమర్శకులు అన్నట్టుగా కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణలాగ, మహాకవి శ్రీశ్రీలాగ సమకాలీన తెలుగు సాహిత్యంలో నిస్సందేహంగా శేషేంద్రశర్మ ఒక జీనియస్! ఆయన 15వ శతాబ్ది శ్రీనాథుడు, 17వ శతాబ్ది జగన్నాథ పండితరాయలు, 19వ శతాబ్ది మేథ్యూ ఆర్నాల్డ్, 20వ శతాబ్ది టి.ఎస్. ఇలియట్.

అసలు 'కవిత్వం' అనే మూలద్రవ్యాన్ని వదిలేసి, ప్రయోజనమూ, సామగ్రి అని పట్టుకొని వ్రేలాడే వాళ్ళని శేషేంద్ర నిర్మొహమాటంగా ఖండించారు. ''ఆకలి కవిత్వం రాయి, ఆవకాయి కవిత్వం రాయి. పద్యంలో రాయి, గద్యంలో రాయి - నీకు చేతనయిన మార్గంలో నీకు చేతనయినది ఏడుప్. మాకు తగాదా లేదు. కానీ నీవు అసలు కవిత్వం రాయాలి. ఇదీ ఈనాడు తలయెత్తే ప్రశ్న''.

## నా పరిచయం:-

కవిత్వం విషయంలో ఇంత ఖచ్చితంగా ఉండే గుంటూరు శేషేంద్రశర్మగారితో నాకు 1974లో పరిచయమయింది. (శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ అనే మిత్రుడు నన్ను బెంగుళూరులోని అశోకా హోటల్‌కి తీసికొని వెళ్ళి శేషేంద్రగారిని చూపించాడు). అది తరువాత గాఢమైన స్నేహంగా పరిణమించింది. వారితో నేను సలిపిన చర్చలలో ఎన్నో కవితా రహస్యాలు తెలుసుకున్నాను. ప్రతి సంవత్సరమూ వేసవికాలంలో హైదరాబాద్ నుండి బెంగుళూరు మీదుగా ఊటీకి వెళ్ళేవారు. వెళ్ళేటప్పుడూ వచ్చేటప్పుడూ బెంగుళూరులో ఒక రోజు, మైసూరులో ఒకరోజు మజిలీ చేసేవారు. బెంగుళూరులో నన్ను, మైసూరులో మిత్రుడు ఆర్వీయస్. సుందరాన్ని తప్పకుండా కలిసేవారు. ఎన్నోసార్లు మా యింటికి వచ్చి భోజనం చేశారు. నేను డా॥జి.యస్. శివరుద్రప్ప, డా॥ సుమతీంద్రనాడిగ్ ,గోపాలకృష్ణ అడిగ మొదలైన కన్నడ కవులను శేషేంద్రగారికి పరిచయం చేశాను. రెండు మూడుసార్లు బెంగుళూరు విశ్వవిద్యాలయానికి వచ్చి ఉపన్యసించారు కూడా. మైసూరులో సుందరం ద్వారా "పు.తి.న" (పి.టి.నరసింహాచారి) వంటి కన్నడ మహాకవులు శేషేంద్రకు పరిచయమయ్యారు.

## II. లోకుల నాలుకలే ఆకులుగా:-

ఒకసారి నూజివీడు (కృష్ణాజిల్లా)లో సాహిత్య మిత్రుడు "ఎమ్వీయల్"తో గోష్ఠి జరుపుతూ - "కె.వి. రమణారెడ్డిగారు విమర్శకులే కాదు, కవి కూడాను" అన్నాను. వెంటనే ఎమ్వీయల్ "ఆయన కవా? ఏదీ ఆయన కవిత్వంలోంచి రెండు పాదాలు ఉదాహరించండి?" అన్నారు ఎమ్వీయల్. నేను ఉదాహరించలేక పోయాను. అప్పుడు ఆయన నవ్వుతూ "కాబట్టి కె.వి.ఆర్. కవికాదు" అన్నారు. అంటే, ఏ కవి కవిత్వం సాహిత్యవేత్తల ధారణలో నిత్యం నిలబడుతుందో అతడే నిజమైన కవి. ఆధునికుడైన ఎమ్వీయల్ మాత్రమే కాదు, ప్రాచీనుడైన (రాయల కాలమువాడైన) సంకుసాల నృసింహకవి కూడా ఈ విషయాన్నే నొక్కి వక్కాణించాడు: "పాకం చెడిపోయిన కవితలు తాటాకులలోనే ఉండిపోతాయి. వేదవాక్కులవలె ప్రజల నాలుకలే ఆకులుగా ఏ కవితలైతే ఉంటాయో అవే నిజమైన కవితలు!".

**"ఆ కులనెయుండు కవితా పాకములనె మొదలు చెడినఁ, బ్రాఁబల్కులుగా**
**లోకము జిహ్వాంచలములె యాకులుగా నుండు నెవ్వి, యవివో కవితల్"**

(-కవికర్ణ రసాయనము, పీఠిక, 14వ పద్యం)

తిరుపతి వేంకట కవులు కూడా "కవిత్వాన్ని రసనాగ్రనర్తకిగా తీర్చిదిద్దాలి" అన్నారు. ఈ కొలమానంతో పరిశీలిస్తే, ప్రాచీనులలో పోతన, పెద్దన, వేమన; ఆధునికులలో శ్రీశ్రీ, తిలక్, శేషేంద్ర మాత్రమే నిజమైన కవులుగా మిగులుతారు. ప్రజల నాల్కలమీద నాట్యంచేసే కవితా పాదాలు శేషేంద్రలో ఎన్నో ఉన్నాయి. (అటువంటి వాటిలో తొమ్మిందిటిని ఉదాహరిస్తూ ఈ వ్యాసాన్ని ప్రారంభించడానికి ఇదే కారణం). ఉర్ధ్వకవిత్వప్రభావంతో కవితాసాంద్రమైన పాదాలతో, చమత్కార యుతంగా శేషేంద్ర ప్రయత్నపూర్వకంగా వీటిని వ్రాసినట్లు నాకనిపిస్తుంది. తరువాత వీటినే తన దీర్ఘ కవితలలో అక్కడక్కడ వజ్రాల్లా పొదిగారు. అందువల్ల ఈ భాగాలు పాఠకులను అయస్కాంతంలా ఆకర్షిస్తాయి. ఈ భాగాలను శేషేంద్ర "చమత్కారికలు"గా నామకరణం చేశారు. శేషేంద్ర షష్టిపూర్తికి (20-10-1987 నాటికి) "శేషేంద్ర చమత్కారికలు" అనే పేరుతోను, శేషేంద్ర సప్తతికి (20-10-1997 నాటికి) "మధువర్షం" అనే పేరుతోనూ ఈ కవితా చమత్కారికలను చిన్న చిన్న పుస్తకాలుగా నేను ప్రచురించి ఆయనకు బహూకరించాను. అటువంటి చమత్కారికలను మరికొన్నింటిని ఉదాహరిస్తాను. (ఇవన్నీ చక్కటి భావచిత్రాలు లేక పదచిత్రాలు).

## III. శేషేంద్ర చమత్కారికలు:-

1. నా కన్నుల మీద వాలిన సీతాకోకచిలుకలే కవితలు
2. కవిత్వం ఒక మెస్మరిజం, కవి కన్ను ఒక ప్రిజం
3. కవిత్వమంటే స్వప్న విద్య
4. ఓ శేషేన్! నాకు తెలుసు
   నీకు కవిత అంటే ఒక ద్రాక్ష ఒక ఉత్ప్రేక్ష కలిపి
   తాపీగా లేని గుండెల్ని కాపీ కొట్టడం అని
5. అది ఆకాశం కాదు, నక్షత్రాల ఖజానా!
6. గ్రామం దేశానికి కూలీ
7. అరే! ఆ కోడికూత విను
   అది ఉషస్సు తూర్పును బ్రద్దలు కొడుతున్న శబ్దం
8. రోజూ ఆకాశం సూర్యుడనే ఎర్రటిగుడ్డు పెడుతూనే ఉంది.

9. పుస్తకాలు పట్టుకొని పోతుంటే బాబూ!
శిలువలు మోసుకుపోతున్న బాలక్రైస్తుల్లా కనిపిస్తారు నా కళ్ళకు

10. సూర్యుడు ఉరితీసిన వీరుడిలా
ఉదయపు చెట్లలో వ్రేలాడుతున్నాడు

11. ధరిత్రిని హలం దున్నితే -
అప్పుడు అవుతుంది అది ఒక దేశం!
ధరిత్రిని కలం దున్నితే
అప్పుడు అవుతుంది అది ఒక ఇతిహాసం!
హలమూ కలమూ దున్నని ధరిత్రి
ధరిత్రికాదు, వట్టి మట్టి!!

## IV. కవి జీవితం:-

గుంటూరు శేషేంద్రశర్మగారు 1927 అక్టోబరు 20వ తేదీని, నెల్లూరు జిల్లా 'నాగరాజుపాడు' గ్రామంలో (మాతామహుల గృహంలో) జన్మించారు. వీరి తల్లిదండ్రులు: అమ్మాయమ్మ - సుబ్రహ్మణ్యశర్మ. వీరి స్వగ్రామం నెల్లూరు జిల్లాలోని 'తోటపల్లి గూడూరు'. వీరికి ఒక తమ్ముడు, ఇద్దరు చెల్లెళ్ళు. 1939-44మధ్య నెల్లూరులో వెంకటగిరి రాజా హైస్కూలులోను, కాలేజిలోను విద్యాభ్యాసం చేశారు. 1947లో గుంటూరు ఎ.సి.కాలేజీ నుండి బి.ఏ. డిగ్రీ తీసుకున్నారు. 1949లో మద్రాసు విశ్వవిద్యాలయం నుండి బి.ఎల్.డిగ్రీ తీసుకున్నారు. 1949నుండి 1955వరకు డిప్యూటి పంచాయితీ ఆఫీసర్‌గా కందుకూరు, పొదిలి, దర్శి, పిఠాపురం, సామర్లకోట, తుని మొదలైన ప్రాంతాల్లో ఉద్యోగం చేశారు. 1956 నుండి 1965 వరకు మునిసిపల్ కమిషనర్‌గా తిరుపతి, ప్రొద్దుటూరు, కడప, బబ్బిలి, గూడూరు, పెద్దాపురం, ఒంగోలు, చిత్తూరు, కాకినాడ, రాజమండ్రి, విజయవాడ, కర్నూల్‌లలో ఉద్యోగం చేశారు. 1965 నుండి 1985 వరకు హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌లో అసిస్టెంటు కమీషనర్‌గా, డిప్యూటీ కమీషనర్‌గా, సెక్రటరీగా, ఛీఫ్ వాల్యుయేషన్ ఆఫీసర్‌గా ఉద్యోగం చేశారు. 1985లో రిటైరయ్యారు.

శేషేంద్రశర్మగారి భార్యపేరు "జానకి". ఈమె "యద్దనపూడి" వారి ఆడుపడుచు. ఈ దంపతులకు ఇద్దరు కూతుళ్ళు ('వసుంధర', 'రోహిణి'); ఇద్దరు

కొడుకులు ('వనమాలి' - 'సాత్యకి'). కొడుకులిద్దరూ కూడా తండ్రిలాగే చక్కని కవితలు అల్లగలరు. 1968లో ఒక కవితాగోష్ఠిలో శేషేంద్రశర్మగారికి ఆంగ్లకవయిత్రి రాజకుమారి ఇందిరాదేవి ధనరాజ్‌గిర్‌తో పరిచయమయింది. ఆ పరిచయం క్రమక్రమంగా ప్రేమగా అభివృద్ధి చెందింది. 1971లో ఆమెను (రెండవ భార్యగా) వివాహం చేసుకున్నారు. ఈ కవి దంపతుల వివాహం కర్ణాటక రాష్ట్రంలో శిల్పకళకు పేరుగాంచిన బేలూరు దేవాలయంలో జరగడం విశేషం. ఇందిరాదేవిగారితో కలిసి శేషేంద్ర అనేకదేశాలు దర్శించి, అక్కడి కవులతో గోష్ఠులు నిర్వహించారు. కొన్ని పరిశోధనపత్రాలు చదివారు. 1963లో మారిషస్, మడగాస్కర్, కెన్యా దేశాలకు వెళ్ళారు. 1969లో పశ్చిమ జర్మనీని దర్శించారు. 1987-1989లలో గ్రీసు దేశాన్ని సందర్శించారు. 1996లో ఐదవ ప్రపంచ హిందీ మహాసభకు 'ట్రినిడాడ్' వెళ్ళారు. ఇందిరాదేవిగారు ఎంతో ధనాన్ని వెచ్చించి శేషేంద్రగారి రచనలన్నింటినీ చాలా అందంగా ముద్రించి లోకంలో వ్యాప్తి చేశారు. 30-5-2007న శేషేంద్రగారు స్వర్గస్థులయ్యారు. ఇప్పుడు ఆయన రచనలేవీ లభించడం లేదు. తిరిగి వాటిని, ముఖ్యంగా 'ఆధునిక మహాభారతాన్ని'' ముద్రించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## V. కావ్య జీవితం:-

1947లో బి.ఏ. విద్యార్థిగా ఉన్నప్పుడే పెర్షియన్ ఎపిక్ ''షహనామా'' నుండి ''షోరబ్ అండ్ రుస్తుం'' కథను గ్రహించి పద్యకావ్యంగా రచించారు. 1951లో దీనిని 'సొరాబు' కావ్యంగా ప్రచురించారు. ఇదే వీరి కవితాప్రస్థానంలోని మొదటిమెట్టు. 1961-1993 మధ్యకాలంలో ఎన్నో కావ్యాలు, కథలు, వ్యాసాలు, విమర్శలు వెలువరించారు. కావ్యాలలో వీరికి మిక్కిలి పేరు తెచ్చినవి: ఋతుఘోష(1963) - పక్షులు (1970) - శేషజ్యోత్స్న (1972) - మండే సూర్యుడు (1974) - నా దేశం నా ప్రజలు (1975) - నీరై పారిపోయింది (1976) - గొరిల్లా (1977) - సముద్రం నా పేరు (1977) - ప్రేమలేఖలు (1980). వీటిలో వచన కవితలన్నింటినీ కలిపి 1986లో ''ఆధునిక మహాభారతం'' అనే పేరుతో ఒకే గ్రంథంగా ముద్రించారు. అలాగే పద్యకావ్యాలన్నింటినీ కలిపి 1993లో ''జనవంశమ్'' పేరుతో ఒకే సంపుటిగా ప్రకటించారు. విమర్శగ్రంథాలలో ''షోడశి'' అనే రామాయణ విమర్శ (1965), ''స్వర్ణహంస'' అనే హర్షనైషధ విమర్శ (1967) శేషేంద్రగారి లోతైన పాండిత్యానికి గీటురాళ్ళు. అలాగే ''రక్తరేఖ'' (1974) - ''కాలరేఖ'' (1990) అనే సాహిత్య వ్యాస సంపుటాలు; ''కవిసేన మానిఫెస్టో'' (1977) అనే ఆధునిక అలంకార

శాస్త్ర గ్రంథం; "In Defence of People and Poetry" అనే ఆంగ్ల గ్రంథం; "ఈ నగరం జాబిల్లి" అనే గజల్స్‌ను గూర్చిన వ్యాస సంపుటి శేషేంద్రకీర్తిని దశదిశలా వ్యాపింపజేశాయి. ఇలా సాహిత్య విషయాలే కాకుండా, శేషేంద్ర వర్తమాన దేశ విదేశ రాజకీయాలపై వివిధ పత్రికలలో ఎన్నో విశ్లేషణాత్మక వ్యాసాలు కూడా వ్రాశారు. వీటిని "ఎంతకాలం ఈ ఎండమావులు?" అనే పేరుతో ఒక గ్రంథంగా కూడా వెలువరించారు. అమెరికా వాడు ఆఫ్ఘనిస్థాన్ మీద, ఇరాక్ మీద దాడి చేసినప్పుడు "మంచి పని చేశాడు" అని నేను మనసులో మురిసిపోయాను, ముస్లిం ఉగ్రవాదుల్ని అణచి వేస్తున్నందుకు. కాని శేషేంద్రగారి వ్యాసాలు చదివాక అమెరికా చేసిన పని తప్పు అని గ్రహించాను.

శేషేంద్ర కవిత్వంలోని మరో గొప్ప విశేషమేమిటంటే - అనేక అన్యభాషలలోకి అనువదింపబడి, ఆయా భాషలలో కూడా పాఠకుల ప్రశంసలను అందుకోవడం. శేషేంద్ర కావ్యాలలో ఇంచుమించు ప్రతి కావ్యమూ ద్విభాషలలో (bilingual గా) ప్రచురింపబడింది. ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ, తమిళం, కన్నడం, బెంగాలీ, నేపాలి భాషలలోకే కాకుండా, 'నా దేశం నా ప్రజలు' గ్రీకు భాషలోకి కూడా అనువదింపబడటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఇంతగా ఇతర భాషలలోకి వెళ్ళిన ఆధునికాంధ్రకవి మరొకరు లేరు.

## VI. పురస్కారాలు:-

శేషేంద్రకు ఏదో కొన్ని చిల్లర మల్లర పురస్కాలు వచ్చాయి కాని, చెప్పుకోదగ్గ 'జ్ఞానపీఠ పురస్కారం' కాని "కబీర్ సన్మానం" కాని "కాళిదాసు సన్మానం" కాని రాలేదు. శేషేంద్రకు వచ్చిన కొన్ని పురస్కారాల వివరాలు:-

1. "సుబ్రహ్మణ్య భారతి రాష్ట్రీయ సాహిత్య పురస్కారం" (గోవా-1993).
2. "రాష్ట్రేందు" (అఖిల భారతీయ రాజభాషా సమ్మేళనం - కలకత్తా, 1994)
3. "కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు" (ఇది కూడా చాలా ఏండ్లు దోబూచులాడింది. చివరకు కవిగా కాకుండా విమర్శకుడుగా 'కాలరేఖ' వ్యాస సంపుటికి వచ్చింది), 1994.
4. "కాశీనాథుని నాగేశ్వరరావు పురస్కారం" (మద్రాసు తెలుగు అకాడమీ, 1995).
5. "కోటారెడ్డి ఫౌండేషన్ అవార్డు" (గూడూరు, 1995).
6. "ఉండేల విజ్ఞానపీఠం అవార్డు" (హైదరాబాద్, 1995)

7. "గురుజాడ అవార్డు" (విశాఖపట్టణం, 1996).
8. భీమవరం రామరాజభూషణ పరిషత్తు సన్మానం, 15-3-1997.
9. "పెద్దిభట్ల అవార్డు" (రసధుని, పాలకొల్లు, 16-3-1997).
10. "నవ కవితా పితామహ" బిరుద ప్రదానం (కాకినాడ, 18-3-1997).
11. ఉత్తమ విమర్శకుడుగా డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం అవార్డు (హైదరాబాద్, 1998).
12. కేంద్రసాహిత్య అకాడెమీ ఫెలోషిప్ (న్యూఢిల్లీ, 1999).
13. నన్నయ భట్టారక పీఠంవారి "డా॥ జి.ఎస్.వి. ప్రసాద్ ఉగాది పురస్కారం" (తణుకు, 2000).

## VII. కవితాశాఖలు:-

శేషేంద్ర కవిత్వంలో (పద్యకవిత్వము + వచనకవిత్వమూ కలిపిన దానిలో) నాకు ఆరు ప్రధానశాఖలు కనబడతాయి:

1. **ప్రకృతి సౌందర్యం:** 'ఋతుఘోష' - పక్షులు'.
2. **ప్రేమౌన్నత్యం:** 'శేషజ్యోత్స్న' - 'నేను: నా నెమలి'.
3. **పేదల భాధలు - ప్రజాస్వామ్యపు డొల్లతనం - కార్మిక కర్షక పక్షపాతం - రైతుల తిరుగుబాటు** - 'నాదేశం నాప్రజలు'.
4. **విప్లవం (నక్సలైట్స్ ఉద్యమ సమర్థన):** 'మండే సూర్యుడు' - 'గొరిల్లా'.
5. **సుప్తచైతన్యస్మృతి - అనుభూతి (ప్రతీకలు-భావచిత్రాలు):** 'నీరై పారిపోయింది' - 'సముద్రం నా పేరు'.
6. **కవిత్వతత్త్వం:** అన్ని కావ్యాలలోను అక్కడక్కడ కనబడుతుంది.

పై శాఖలకు కొన్ని ఉదాహరణాలు పరిశీలిద్దాం:

### 1. ప్రకృతి సౌందర్యం:

**1.1** పూల కాలనీలో
తంబురా మీటుతూ

తిరుగుతోంది సన్యాసి తేనెటీగ
ఒక్క బిందువు మకరంద భిక్షకోసం

1.2 వర్షం వెళ్ళిపోయింది
మబ్బుల రథాలెక్కి -
జలదానం చేసిన మేఘాలకి
జోహార్లు చెప్పాయి చరాచరాలు
భూమిలో ఉన్న చిన్నారిగింజ
మెడ బయటపెట్టి
మొదట వచ్చిన రెండాకుల్ని
చేతులుగా జోడించింది కృతజ్ఞతతో...

1.3 పొద్దున్నే స్నానమాడి ఒక తామరపువ్వు
సరస్సును రాత్రి స్మృతులతో పరిమళభరితం చేసింది
దానికి మూర్ఛపోయి చంద్రుడు
అందులో పడి కరిగిపోయాడు!

1.4 ప్రభాత పుష్పాలు -
రంగుల్లో స్నానం చేస్తున్న నిశ్శబ్ద దేవతలు!
శరదృతువు -
వెండికాంతుల జలప్రళయం!
నక్షత్రాలకు పునర్జన్మ!
మేఘాలకు జ్యోత్స్నాస్నానం!!

1.5 చెట్టు బుగ్గలుపూరించి
రెండు శాఖలతో ఒక పువ్వు పుచ్చుకొని
షహనాయీ ఊదుతోంది
ఒక్క రాగం విసిరేసి బుల్‌బుల్
తోట తోటనంతా తన చిన్నిరెక్కల మీద
ఎగరేసుకు పోయింది!

1.6 వసంత ఋతువులో పక్షుల కిలకిలారావాల వర్ణన ఎంత అందంగా సాగిందో చూడండి:

పచ్చని నునురెక్క పైట దాల్చిన చిల్క
గొంతెత్తి పిల్లన గ్రోవి నూదె

సంపెంగ ముక్కును సవరించి పిచ్చుక
జలతరంగిణి మీటె శ్రావ్యముగను
శబల చూడము తలన్ చలియింప వడ్రంగి
ఖేలగా తియ్యని యీలవేసె
గుమ్మడి పూవన్నె కుక్షి కదల్చుచు
భరతపక్షి సితారు పలుకరించె

గరుడ పక్షియు నీలాల గగన సీమ
దిరిగి సన్నాయి వాయించి తేనె గురిసె
కుసుమ పీఠిక దుమ్మెద కూరుచుండి
తంబురన్మీటి శ్రుతిగూర్చె ధరణికెల్ల!

1.7 హేమంత ఋతువులో బాలసూర్యుని వర్ణన ఎంత అద్భుతంగా ఉందో తిలకించండి:

నెల వెలవెలబారె నీలంపు మిన్నుల
చుక్కసంద్రంబింకె చుక్కలేక
పాలేయపుం జిల్గు పరికిణీ ధరియించి
చెంగావి లేయెండ చిందులాడె
అరవిరబారిన అంబుజమ్మకు బుట్టె
మునురేయి జిక్కిన మొకరితేటి
ముద్దుగా మృదువుగా మొలక తెమ్మెర, కురుల్
కదలించి ప్రియురాలి కల ముగించె

చిగురు బాలలు హిమపాళి సిగలదాల్చి
చిలిపి నవ్వుల సింగార మొలకబోసె
జగతి మొగసాల నీ కొల్వుసాగనిమ్ము
పసిడికాంతుల బరణి ఓ బాలతరణి!

1.8 ప్రకృతిని వర్ణిస్తూ వర్ణిస్తూ శేషేంద్ర ఒక్కొక్కసారి వేదాంతిగా మారిపోతారు. ప్రకృతి సమస్తమూ నీలవర్ణంతో శోభిల్లుతోంది. ఆ నీలవర్ణం తన్ను గొంతెత్తి పిలుస్తోంది. అప్పుడు కవి తన శరీరంలో నుండి ఆత్మ బయటకు వచ్చేసినట్లుగా భావిస్తూ తన్మయుడై పోతున్నాడు. తన ఆత్మయొక్క నీలవర్ణమే ప్రకృతిగా మారినట్లుగా భావిస్తున్నాడు. జీవాత్మమే పరమాత్మ; పరమాత్మయే ప్రకృతి శోభ కదా!

"నీలి జలంబు, నీలిధరణీ వలయంబు, వినీల శైలముల్
నీలి తరుప్రపంచములు, నీలియనంతయు - యెందు జూచినన్
నీలిమ; నీలిమాకలిత నిర్ఝర కంఠము పిల్చినట్లు నా
నీలిమ దేహపంజర వినిర్గతమై పరుగెత్తెనెంతయున్"

1.9 ఒక పక్షి కూతను వర్ణిస్తున్నప్పుడు కూడా ఇటువంటి వేదాంతధోరణి, అత్యున్నతమైన భావుకత శేషేంద్రలో మనకు దర్శనమిస్తాయి:

"పచ్చటి ఆకుల్లో బసచేసిన ఆ పక్షి
పాడుతూనే ఉంది -
బాధలగాయాలు కెలుకుతూ!
రంగురంగుల రెక్కలు ఖైదు చేసిన దాని ఆత్మ -
రంగురంగుల రాగాలగుండా
జారిపోతూ ఉంది - స్వరాలలుకుతూ...."

2. ప్రేమౌన్నత్యం:

2.1 నా ఆత్మకు శరీరమనే గృహముండేది ఒకప్పుడు
అది దహనమై పోయింది యిప్పుడు -
నీ ప్రేమాగ్ని అంటుకొని,
ఋతువులెన్నో ఉండేవి మునుపు నాకు
ఇప్పుడు నీ బాహువుల్లో ఏవీ లేవు -
ఒక్క వసంతం తప్ప!

2.2 నీవు స్త్రీవికావు అందాల తుఫానువి
చీరా తారా కలిపి నేసిన రూపానివి
నన్ను కవి అనకు, నేను కలల వర్తకుణ్ణి

నా బజారుల్లో నీ కళ్ళు
రెండు విలువైన భూగోళాలు!

2.3 ఏవో రాగాల తేనెటీగలు
పెదవుల మీద మెదలుతుండగా
ఒక సౌందర్యమూర్తి
అద్దంలో మునిగి స్నానం చేస్తోంది
నా ఊహ ఆ సహృదయంలోకి దిగి
కవిత్వం మీటుతోంది!

2.4 ఆకాశం నక్షత్రాల శరణాలయం
నీ దేహం నా చూపుల కార్యాలయం

2.5 సింహాచలమ్ములో చిక్కని తోటలో వలచు అనాసవే వన్నెలాడి!
సామర్లకోటలో జాలువా తోటలో చెఱకు ముక్కవె నీవు చిగురుబోడి!
అల రాజమండ్రిలో అపరంజిరుచులీను మనసతొనవే నీవు పద్మగంధి!
నెల్లూరి చేలలో పిల్లగాలులు కూగు వరి వెన్నువే నీవు వగలమారి!

మురిసి మురిపించి మరపించు మురువు జూపు
భువన మోహినివే నీవు పువ్వుబోడి!
పల్లెపల్లెల ప్రేమ తపస్వి జనుల
కొంగు బంగారువే నీవు కోమలాంగి!!

2.6 కలికీ! నీ విలకేగుదెంచిన శరత్కాదంబినీ మాలికా
విలసన్మంజుల చంద్రరేఖవొ, నిశార్ద్రూత శీతప్రభా
సలిలస్నాత చకోరసుందరివొ, వర్షాకాశకేశావలీ
గళితప్రోజ్జ్వలదింద్రచాపమవొ, ఆకర్ణింతు వర్ణింపవే!

2.7 మల్లెలు పూచె, బాలసుకుమార సమీరము వీచె, నిండు జా
బిల్లి దిశాంతరాళముల వెన్నెల కాచె, మనోవనస్థలీ
పల్లవ శయ్యలం బ్రణయ భావ శకుంతము నిద్రలేచె, నో
హల్లకపాణి! రావె, భరమాయె వియోగ రసార్ద్ర వేదనల్.

(సశేషం)

# SESHENDRA

- AMBIKA ANANTH

His pen was dipped in manna and magic
To drip words to erase
agony, affliction and pain
of the world
He distributed the wealth of his poetry
to turn the fallow lands of human hearts
into green lands of fecundity

Seshendra, a blessing to the world
A new era poet
bequeathed himself to the
hearts of people
He was a pathfinder
with loftiness of vision
reaching to the skies,
Wording a Manifesto
full of wake-up calls

Every written word of his
A mirror of his poetic genius
Every poem of his
eternal zone of brilliance

Who says he is gone
when he has left behind
so much light and life
as his legacy ...

For the wellness of our souls
We all need God
We all need poets like him too
Who are born very rarely
so creative and scholarly
who played a poetic-symphony
eulogizing the Muse ...

Let us celebrate his collected works
the seeds of poetic wisdom
To sprout in our minds
To fill in our breath

He was always an awakened soul
Will he ever sleep in mortal death?



# పాట కన్నుమూసింది

– డా॥ కావూరి పాపయ్యశాస్త్రి

పాట నిదురలోనే కన్ను మూసింది!
తోట విషాదంతో చిన్నబోయింది!
గూటిలోని ఒంటరి పక్షి
గుబులు నిండిన గుండెతో విలపిస్తున్నది!
అర్ధరాత్రి మండే సూర్యుడిని మింగేసింది
వసంతం వనాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయింది!
ఎగిరిపోయిన స్వర్ణహంస కోసం
దిగంతాలు దిగులుగా చూస్తున్నాయి!
అలల కలలు విరిగిపడ్డాయి
సముద్రం మౌనముద్రను దాల్చింది!
చషకంలోని కవిత్వం
కన్నీరుగా మారిపోయింది!
మయూరం రెక్కలు ముడుచుకు పడుకుంది!
వెక్కి వెక్కి ఏడ్చే వెన్నెలను
వెదురులోని శూన్యం ఓదారుస్తున్నది!
అక్షరాల ద్రాక్షతోటను
అంధకారం చుట్టేసింది!
పూర్ణిమ చంద్రుడిని కోల్పోయి
పాగిలి పాగిలి ఏడుస్తున్నది

ప్రవాహం పడవను తోసుకుపోయింది!
రేవు బావురుమంటున్నది!
కాలం చెక్కిలి మీద కన్నీటి చారిక
చీకటిలా పేరుకుపోయింది!
స్వర్గం వైపు హుందాగా నడిచి వెళ్ళే వీరుని కోసం
కవిత్వం కంటతడి పెట్టుకుంటున్నది!

*(శేషేంద్రకు నివాళి)*

## వెన్నెల జెండా

– తంగిరాల

ఒక మనోజ్ఞ ఉషస్సు
ఒక మధ్యాహ్న మహస్సు
బంగరు రంగుల సాయంసంధ్యా తపస్సు
కలల చందమామ పడి కరగిపోయిన
నిర్మల హంసోదకాల మానస సరస్సు!

తరణి కిరణాలతో పులకించే తామరపూల మడుగు
రక్తవర్ణకాంతులు విరజిమ్మే 'వనజ్వాల' నిప్పుల గొడుగు!
కొమ్మల చేతులతో పూలబూరాలనూదే పచ్చని చెట్లు
తోట తోటనంతా తమ చిరురెక్కలపై మోసుకుపోయే
బుల్‌బుల్ పిట్టల జిలిబిలి పాటల వెన్నెల మెట్లు!
గుండెల నిండా అల్లుకున్న ద్రాక్షతోటల
రసవత్తర స్వాగతాల మెత్తని మత్తు
నీ మహత్వ కవిత్వ మంత్రశక్తితో
తుఫానుల క్రూరశక్తి చిత్తు
తాటితోపుల్లో తలదాచుకొనే ఎత్తు!

నీలి సరోవరాలలో తేలియాడే ''స్వర్ణహంస''లు
చీకటి రాత్రుల్ని వెలిగించే ''షోడశ'' కళలు
చల్లని శరజ్జ్యోత్స్న నీవే
భగ్గున మండే సూర్యప్రభా నీవే
పద్యమనే పది అంతస్తుల
అందమైన అద్దాలమేడ మీంచి
అమాంతంగా దూకేసే
దేవదాసు, మజ్నూ, రోమియో, ఎడ్వర్డ్
దేశదేశాల ప్రేమపూజారులందరూ నీవే!
''రక్తరేఖ''లు దాటి,
''కాలరేఖ''లు మీటి,
మౌనధ్యానంలో గడ్డకట్టిన నీవు
క్షణంలో ''నీరైపారిపోతావు'',
మరుక్షణంలో ''గొరిల్లా''గా మారిపోతావు
ఆక్రోశంతో అకవిత్వంపై ధ్వజమెత్తి
''నాదేశం-నాప్రజలు'' అంటూ
వేదంలా ఘోషిస్తావు!
సుకవిత్వపు వెన్నెల ''రాస్తా''పై
''కవిసేన'' దండయాత్ర కొనసాగిస్తావు!!
ప్రజల అశాంతి సముద్రం
నీ కాళ్ళదగ్గర కూర్చుని
కుక్కపిల్లలా మొరుగుతుంది
బాధల భయంకర తుఫాను
నీ ప్రక్కన జంట కట్టుకొని
మెత్తని గొంతుతో
''చిత్తం! చిత్తం'' అంటుంది
ఎత్తైన హిమాలయ పర్వతం
నువ్వెదురు పడితే
వంగి సలాం కొడుతుంది!
ఎందుకో తెలుసా గురూ?
ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య ఝరులన్నీ స్వాహాచేసిన

ఒక సువిశాల మానవతా మహాసాగరం
నీ పేరు కాబట్టి!
ఒక పువ్వును చూస్తూ నీవు
శతాబ్దాలు గడపగలవు కాబట్టి!
నీ "ఆకాశపు ఆలోచనల్లో
చంద్రుడొక కన్నీటి చుక్క" కాబట్టి!
నీ అమృత కవితలు పానంచేస్తూ జనత
"మమఖేలతి మదచేతసి"గా
మారిపోతారు కాబట్టి!!

ప్రతివాడూ ఒక పిడికెడు మట్టే కావచ్చు,
చరిత్ర వాడిపేరు చెప్పకపోవచ్చు
కవులంతా స్మరింపదగినవారు కారు,
సకల సత్కారాలకూ తగరు
తెలుగు నేలమీద కలమెత్తిన నీవు మాత్రం -
వినీల గగనసీమల
స్వేచ్ఛావాయువుల్లో తేలియాడే
అధర్మంపై బుసలు కొట్టే
అసత్యాన్ని మట్టుపెట్టే
వసుధైక కుటుంబ పతాకతో
ధగధగలాడే
బంగరు నగరు!
అవును
ఇది
డెబ్బది శరత్తుల
పున్నమి చంద్రుని
వెన్నెలజెండా
పొగరు!!

*(20-10-1997నాటి శేషేంద్ర సప్తతికి గుర్తుగా ....*
*చైతన్యకవిత-26, అక్టోబరు 1997-మార్చ్ 1998)*



# CHAMATKARIKAS

**- Seshendra Sharma**

The tree blows its cheeks
and holding a flower
between two branches
plays shehnai

a bulbul
throws a melody
and carries away
the entire garden
on its tiny wings. 1

The season
of spring
is the school
of cuckoos
the academy
of birds

it is the season
when each bird
turns into
a thousand songs 2

Rivers and poets
are the arteries
of our planet

rivers flow
like poems
for animals
for birds
and for men

The dreams
that rivers dream
bear fruit
in the fields
the dreams
that poets dream
bear fruit
in the people. 3

The speech of the bird
in the sky
has no grammer

a cloud
is a boat
that carries
the cargo
of dreams
and you
who gave birth
to a song
meandering
like a stream
is a prisoner
of oppression. 4

The ocean does not sit
at anybody's feet
and bark
voice of the storm
does not know how
to say yes
the mountain
does not bow
before anybody
and salute

I may be after all
a fistful of earth

but when I lift
my pen
I have the arrogance
of the flag
of a nation. 5

I am one
who runs in quest
of storms
wounds
and
drunkards
but
at the sight
of the peaks
of people
I melt into
a poem
and flow
onto the paper
turn into
a tearful line
and vanish into the
multitudes. 6

Once upon a time
Ganges was a goddess
then became
the road of boats
finally
an irrigation canal
flowing into our fields
see how
even Gods
change their forms
in the hands of time. 7

Man is a tree
whose roots have
changed into legs.
If I had
remained a tree
atleast spring
would have
visited me
every year
but
having become a man
I have lost
all the springs 8

We may all be drowned
today
in this
river
but
remember
the day
is not far
when the river
itself
will be drowned
in the sea. 9

That innocent child
who came
holding heavens
in his fist
is sleeping
like a tear -
o rese-bush!
do not sing
if you have
any shame
vomit
all those
bulbuls
from your
throat. 10

My child! I know
an ocean is roaring
in your tear
that is why
I appeal to the trees
do not grow leaves
but grow rifles
on your branches. 11

My child!
when you go
to the college
the fields
of our country
look at you and weep
you go into the walls
of the college
from there
into the walls
of the government
and then
into those walls
from where nobody
ever returned.

I ask you
when did you live? 12

All the rivers
in the country
are flowing
into the fields
of the rich
all people
en masse
are
in a deep
sleep
devoid
of the din
and buzzle
of dreams
poets
are writing songs
and harrassing
the metaphors
and similes
streets
are screaming
and raising their
hands to the sky
in helplessness. 13

Do you know
that the sky of the
farmers
rains only rains
does not rain springs
oh brothers! behold
political rain is falling
do not deceive yourself
and sow seeds
thinking it is time. 14

In the evening
a little song
a bit of darkness
some wine
some expectation
and a couple of stars
then will be revealed
that the waterfall
is not the downfall
of water
and that the tear
is not the symbol
of sorrow. 15

When life was turning
with moon as axis
flowers
were discussing
when did the spring
come?

When life was truning
with the tear
as axis
children
where whispering
when did this birth
come? 16

Spending all his life
in only living
he is tired
and from the present
into the pages
of history
he retires. 17

My thought
like brilliant sun
fell
on the word
and its long shadow
fell
upon the century
sun was playing
with the early morning
flowers
and time
was frightened
at the sight
of a martyr. 18

Some
twentieth century devotee
rang the temple bell
from a distance
it was heard
the old temple coughing
its stones fell away
here and there
like teeth
man
is still
in quest
of the super human
to save him. 19

The word on which
I am sculpturing
my art
is a fortress
I am raising
to defend myself
against death
book
is a dam
I am building
to stop
the brutality
of man. 20

*-Translated from Telugu by the poet*

*(Poetry Reading ananged by Sahitya Akademi, Southern Regional Poets Meet, 25th March, 1988 at Yavanika, State Youth Centre, Bangalore)*



# ప్రతీక
# (SYMBOL)
## నిర్వచనం - వివరణ

- లంకా వెంకటేశ్వర్లు

తాత్వికంగా చూస్తే సృష్టిలోని ప్రతివస్తువూ ప్రతీకాత్మకమే. కవి ఒక వస్తువును అనుభూతి చెందటం ద్వారా ఆ అనుభూతిని ఉన్నదున్నట్లుగా చెప్పటానికి ప్రతీక కంటే అనువైన సాధనం లేదు. ప్రతివస్తువూ, వ్యక్తిలోని అనేకమైన అనుభూతుల్ని అంతరంగంలో అత్యంత సంకీర్ణంగా రగిలిస్తుంది. కవి ప్రయోగించిన ప్రతీక, ఆ అనుభూతుల్ని వెలువరించేదిగా వుండాలి. అందుకే వస్తువుని చెప్పకుండా, అనుభూతి కేంద్రమైన మరో వస్తువుని చెప్పటం ద్వారా అసలు వస్తువుని స్ఫురింపచేయటానికి ప్రతీక వినియోగమవుతుంది. వివరణలతో పనిలేకుండా అనుభూతిని అనుభూతిగా వ్యక్తీకరించటానికి ప్రతీక ఉపయోగిస్తుంది. ప్రతీకవాదం ఆధునిక కవిత్వంలో అత్యంత ప్రాధాన్యం పొందింది. ప్రతీక, అలంకార శాస్త్రంలో చెప్పబడిన ఏ అలంకారానికీ సరిపోయేది కాదు. అలంకారాల్లోని ఉపమ, రూపకం, ఉత్ప్రేక్ష - వీటితో ప్రతీకకుగల భేద సాదృశ్యాల్ని గమనించవలసి వున్నది. ఉపమేయము ఉపమానము అనే రెండు భాగాలు ఉపమాలంకారంలో వుంటాయి. ముఖం చంద్రబింబంలా ఉన్నది అన్నపుడు ముఖం ఉపమేయం, చంద్రుడు ఉపమానం. ప్రతీకలో ఉపమేయం చెప్పబడదు. ఉపమానం మాత్రమే చెప్పబడుతుంది. దాని ద్వారా మరో వస్తువుని, దాని లక్షణాలతో వున్నదాన్ని, స్ఫురింపచేయటం కనిపిస్తుంది. రూపకంలో ముఖచంద్రుడు అంటే ముఖమనే చంద్రుడు. దీనిలో ముఖానికీ చంద్రుడికీ అభిన్నత చెప్పినప్పటికీ ఉపమేయం కూడా చెప్పబడింది. అదే, ఉత్ప్రేక్షలో ఒక వస్తువుకి ఊహలద్వారా పోలిక చెప్పబడుతుంది. ఇక్కడ కూడా ఉపమేయం వుంటుంది. ఊహ ద్వారా ఉపమానం కనిపిస్తుంది. ప్రతీకలో అనుభూతి ప్రధానం. ఊహలు కాదు. ఉపమాన ఉపమేయాల్లో ఉపమేయం చెప్పి ఉపమానం చెప్పకుండా వదిలివేసే పద్ధతి, రూపకాతిశయోక్తి అలంకారంలో చెప్పబడింది. కానీ ప్రతీకలలో ఒక వస్తువును చెప్పి మరొక వస్తువును అనుభూతికి తేవటం వుంటుంది గానీ పై అలంకారంలో లాగా వుండదు. ప్రతీకలో చెప్పిన పోలిక, చెప్పబడని వస్తువు తాలూకు అనుభూతిని వ్యక్తం చేసేదిగా వుంటుంది. ఇక్కడే మన అలంకారశాస్త్రాల్లోని 'ధ్వని' ప్రస్తావన వస్తుంది. ''ఫ్రెంచి ప్రతీకవాదుల సిద్ధాంతాలలో ప్రతీక స్వభావాన్ని చెప్పే పద్ధతుల మీద భారతీయ

ధ్వని సిద్ధాంతచ్ఛాయలను గమనించటం సులభం" (ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, *20వ శతాబ్ది విశ్వసాహిత్య విమర్శ, పుట: 63)*. ఈ మాటలవల్ల మన ప్రాచీనాలంకార శాస్త్రాలపై మనకున్న గౌరవం మరింతగా ఇనుమడిస్తుంది. కానీ వీటి మధ్య ఖచ్చితమైన విభజనరేఖ గీస్తూ శేషేంద్రశర్మగారు "అలంకారికులు సాహిత్య పరాకాష్ఠగా చెప్పే 'ధ్వని' కంటే సింబలిజమ్ చాలా గొప్పది. సింబలిజమ్ ఒక విరాట్ స్వరూపం అయితే, ధ్వని దాని పాదం వరకే వస్తుంది. ధ్వని కేవలం ఒక శబ్దశక్తి వ్యవహారం" (గుంటూరు శేషేంద్రశర్మ, రక్తరేఖ, పుట : 48). ధ్వని దాని పాదం వరకే వస్తుంది అనే మాటలు ప్రతీకపై గౌరవాన్ని సూచిస్తాయి. శేషేంద్రశర్మ ఇంకా యిలా అంటారు – "సింబలిజమ్‌లో సింబల్స్ మన ఇష్టం వచ్చినట్టు పెట్టుకొనేవి కావు. ఏవో ఒట్టి గుర్తులు కావు. అవి సింబలిస్ట్ అనే ఒక ద్రష్ట చూచిన దృశ్యాలు. ఆ ద్రష్టకు సిద్ధించిన దార్శనిక అనుభూతులు" (గుంటూరు శేషేంద్రశర్మ, రక్తరేఖ, పుట: 49). అందుకే అనుభూతి ప్రధానమైన ప్రతీకలు కవిత్వానికి ముఖ్యం. సంగీతంలో వుండే లక్షణాన్ని కవిత్వంలోకి తీసుకురావాలంటే ప్రతీకలే సాధనమని ప్రతీకవాదులు బోదిలేర్ (Baudilaire), మలార్మె (Mallarme), రింబో (Rimbrand), వార్లే (Varlaine)ల భావన. "ఈ కవులు సంగీత శాస్త్రములో రాగములకున్న ప్రాధాన్యము కవిత్వములో శబ్దములకున్నదని, రాగము భావమును వ్యంగ్యముగా సూచించినట్లే కవిత్వములోని ప్రతిశబ్దము సూచ్యార్థ ప్రధానముగా నుండవలెనని భావించిరి. భావ ప్రకటనము చేయుట కవిత్వ ధర్మము కాదని, భావసూచనయే దాని లక్ష్యము కావలెనని మలార్మె ప్రకటించెను. విషయ వివరణము కాక వాతావరణ కల్పనము ప్రధానమనెను" (డా॥ సి. నారాయణరెడ్డి, ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు, పుట: 494). సంగీతంలో ఏ ఆలోచన వివరింపక పోయినా, వినగానే అనుభూతి లోనికి మనస్సు ప్రవేశిస్తుంది. అలాగే ప్రతీకల మీదుగా కవిత నడచినపుడు కేవలము అనుభూతిధార మీదుగానే పాఠకుని మనస్సు ప్రవహింపగలదని వారి అభిప్రాయం.

స్వప్నంతో పోల్చటానికి కారణం ప్రతీకవాదులు లౌకిక భావాల నుంచి పూర్తి స్వేచ్ఛను కోరుతున్నారు. స్వప్నాల్లో కనిపించే దృశ్యాలు పైకి మాములు దృశ్యాలైనా, దాని వెనుక అణచబడిన ఒక భావ ప్రపంచం వుంటుంది. ప్రతీక చేసే పనికూడా అదే. ప్రతీకగా నిలచిన పదాల లోపలి అనుభూతి ఆ పదంయొక్క అర్థంలో వుండదు. "అనిర్వచనీయమైన భావ వ్యక్తీకరణమే కవిత్వమైతే, పదాలు వాటి సామాన్యార్థాల (actual meaning) నుంచి విముక్తం కావాలి (మాకినీడి సూర్యభాస్కర్, 'శ్రీశ్రీ ప్రతీకతా శిల్పం' - వ్యాసం - తెలుగు మాసపత్రిక - జూలై - 1992). అందువల్ల

పదానికున్న వస్తు సంకేతశక్తి కంటే రెండు వస్తువుల మధ్యనున్న అంతరనుభూతి శక్తికే ప్రాధన్యముంటుంది. ప్రతీకవాద ప్రారంభాన్ని గమనిస్తే, ఒక ముఖ్యాంశం వ్యక్తమవుతుంది. మనిషిలోని మౌలిక చైతన్యం సమగ్రతనందుకోవటానికి లోతైన, అంతర్గతమైన అనుభూతుల సహాయంతో ప్రయాణించాలన్నది ప్రధానలక్ష్యం. అందుకే సంగీతంతోను, స్వప్నంతోను గల సంబంధాల్ని విశ్లేషించారు. ప్రతీకవాదంలో మార్మికాంశ బాగా వున్నదని విమర్శకులు చెప్పింది కూడా ఈ కారణం చేతనే. ప్రతీకల వినియోగం ఎక్కువగా మూడుమార్గాల్లో జరుగుతుంది. మొదటిది కవితలో అక్కడక్కడా ప్రతీకల్ని వాడుతూ సాగిపోయేది. శ్రీశ్రీ మొదలు ఎందరో తమ కవితల్లో ప్రతీకలు వాడారు. రెండవది ఒక ప్రతీకను కవితనిండా అన్వయిస్తూ సాగేది. శ్రీరంగం నారాయణబాబు 'గడ్డిపరక' మొదలైనవి. మూడవది అతి విస్తృతమైన భావనేపథ్యం ధ్వనింపచేస్తూ, దీర్ఘకావ్యం నిండా, ప్రధాన నేపథ్యానికి అభిముఖంగా ప్రతీకలతో నింపి, తన లక్ష్యాన్ని సాధించేది. అరవిందుని సావిత్రి, టాగూర్ 'గీతాంజలి' ఇలియట్ 'వేస్ట్ లాండ్', ఆరుద్ర 'త్వమేవాహం', శేషేంద్రశర్మ 'నీరై పారిపోయింది' మొదలైనవి.

నిత్యనూతన ప్రయోగశీలి శ్రీశ్రీ. సంప్రదాయ, పాశ్చాత్య కవితారీతులు ఆకళించుకున్న ప్రతిభాశాలి. ఏమీ తెలీని ఒక కొత్త పాఠకుడు మహాప్రస్థానం చదివితే, అందులో 'ఏదో' ఉన్నట్టు శ్రీశ్రీకి లోనవుతాడు. శ్రీశ్రీ ప్రతీకల్లోనే ఆ 'ఏదో' వున్నట్టు మార్మికమైన ధ్వని శక్తి వున్నది.

**''మరి నిన్ను స్మరిస్తే**
**నాగుపించే దృశ్యాలా?**
**వినిపించే భాష్యాలా?**
**అగ్ని సరస్సున వికసించిన వజ్రం!**
**ఎగిరే లోహశ్యేనం**
**ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం''** (శ్రీశ్రీ, మహాప్రస్థానం, 'కవితా! ఓ కవితా!', పుట: 66)

'కవితా! ఓ కవితా!' మహాకవి కళాత్మక అభివ్యక్తిరీతికి పతాక. రసం, ధ్వని, ప్రతీక కలిసిపోయి, వాటి వాటి రసాయనిక ప్రత్యేకతలు కోల్పోయి, నిర్వచనాలను మరచి, మైమరచి, అనుభూతి - ఆర్ద్రతల వెల్లువగా రూపుకట్టడం కనిపిస్తుంది. వాక్యం రసాత్మకంగాను, పదం ప్రతీకగాను అనుభవించి పలవరించేవారి మనసుల్లో ప్రకంపనలు పుట్టించే కవిత. అగ్నిసరస్సున వికసించిన వజ్రం - సరస్సు

అణచివేయబడిన శ్రామికునికి ప్రతీక. శ్రామికుని స్వేదజలం సమాజానికి ప్రాణాధారం. అణచివేత వల్ల ప్రతిఘటించే క్రమంలో వేడికి అగ్ని సరస్సు అవుతుంది. అలా సాధించుకున్న సమసమాజం అగ్ని సరస్సున వికసించిన వజ్రం అవుతుంది. ఎగిరే లోహశ్యేనం - లోహం వ్యవస్థకు ప్రతీక. బంగారం, వెండివంటివి ధనికవర్గ చిహ్నాలు. ఇనుము శ్రామిక వర్గానికి గుర్తు. ధనికవర్గాల్ని మోసే శ్రామికులు చైతన్యవంతులై, ఆ యా వర్గాల్ని ప్రతిఘటించి, సోషలిస్టు ఆకాశంలో స్వేచ్ఛగా తిరుగుతున్నారన్నది ప్రతీకాత్మక ధ్వని. ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగ నాదం అంటే సామ్రాజ్యవాదుల చిహ్నమైన ఫిరంగికి జ్వరం పట్టించేంతగా విప్లవగీత నినాదరావాలున్నాయన్నది మహాకవి ప్రతీకతత్వం.

ఇంకా "రాబందు సామ్రాజ్యవాదికీ, ఖడ్గమృగం సైనికుడికీ, హరీంద్రుడు విప్లవ నాయకునికీ సంకేతాలు. ఆదిసూకర వేదవేద్యుడు శ్రామిక నాయకునికీ, హోమజ్వాల, స్వర్గం, త్రేతాగ్ని వంటివి సామ్రాజ్యవాదవ్యవస్థకీ, హిమాచలం ధనస్వామ్యానికీ, వింధ్యాచలం ఫాసిజానికీ, సింహాచలం శ్రామిక నియంతృత్వానికీ ప్రతీకలు" (మాకినీడి సూర్యభాస్కర్-శ్రీశ్రీ ప్రతీకతా శిల్పం-వ్యాసం-తెలుగు మాసపత్రిక-జూలై 1992).

"అభ్యుదయ కవిత్వ యుగంలో వైయక్తిక ప్రతీకలను చాలా తక్కువగా వాడి, పురాణ ప్రతీకలను ప్రయోజనాత్మకంగా ప్రయోగించి, కొత్త భావాలకు కొత్త ప్రతీకలను సృష్టించుకొన్నా వాటిని జాతి జీవితంలోనించి తీసుకొని ప్రజాహృదయాలకు దగ్గరగా కవిత్వాన్ని తీసుకొనిపోయిన కీర్తి ప్రప్రథమంగా శ్రీశ్రీకి దక్కుతుం"దంటారు జి.వి. సుబ్రహ్మణ్యం.

కాగా మహాప్రస్థానం అనంతరదశలో పురాణ పదబంధాలు లేకుండా సరళంగా నేరుగా రాసినవైనం 'నగరంలో వృషభం'లో కనిపిస్తుంది. 'వృషభం' భూస్వామిక సంప్రదాయవాదికి ప్రతీక అయింది.

**"నగరం నడివీధిలో**
**వృషభం తీరుబాటుగా**
**గతజన్మ సంస్కృతులు కాబోలు**
**కనులరమోడ్చి నెమరేస్తూ**
**కదలకుండా మెదలకుండా**
**నగరం హృదయంలో వృషభం**
**దారికి హక్కుదారు తానే అయినట్టు**

పరిత్యజించి కాలానికి బాధ్యత
పరిహసించి నాగరకత పరుగు
నిలబడింది నేనే రాజునని'' (శ్రీశ్రీ, 'నగరంలో వృషభం', ఖడ్గ సృష్టి).

'గతజన్మ సంస్కృతులు, దారికి హక్కుదారుతానే అయినట్టు, నాగరికతను పరిహసించటం' ఇవన్నీ గతిశీలత నంగీకరించలేని కర్మవాదుల్ని, తిరోగమనవాదుల్ని సూచిస్తోంది. 'యంత్రవిరోధి, అహింసావాది, శాకాహారి, మద్యనిషేధ ప్రజ్ఞాశాలి' - ఇవి గాంధేయవాదపు ముసుగు తొడుక్కున్న నాటి నాయకులకు సంకేతాలు. 'మోటారుకారూ, సైక్లిస్ట్'లను సంబోధించటంతో సమాజ గమనానికి నాగరికతకి యంత్రాల అవసరాన్ని సూచిస్తున్నాడు. చివరిగా ''ఎద్దుకి లేకపోతే బుద్ధి మనిషికైనా ఉండొద్దా'' అంటూ మనిషిని మేల్కొలుపుతున్నాడు.

శ్రీరంగం నారాయణబాబు ప్రతీకను సమర్థవంతంగా ప్రయోగించిన కవి. సామాజిక భావాలను, ప్రతీకను అన్వయించటంలో 'గడ్డిపరక' అనే ప్రతీకాత్మక కవిత ఎన్నదగినది. ఈ కవిత మొత్తం మీద ఎక్కడా తన భావాన్ని చెప్పదు. కానీ కవితలో ప్రతీకను అవగాహన చేసుకొనే అంశాలు స్ఫురిస్తూ వుంటాయి. ఇందులో గడ్డిపరక ప్రధానమైన ప్రతీక.

''నడవండి నడవండి నామీంచి నడవండి
గడ్డిపరకను గడ్డిపరకను
పూజా సమయాల పూవును
దూర్వాంకురాన్ని
అవసరం తీరాక అవతల కనపడితే
చుల్కనగ చూచేటి
గడ్డిపరకను గడ్డిపరకను'' (శ్రీరంగం నారాయణబాబు, 'గడ్డిపరక', రుధిరజ్యోతి).

గడ్డి పేదవర్గానికి చెందిన ఒక వ్యక్తికి ప్రతీక. శ్రమచేసి శ్రమ ఫలితాన్ని పొందలేక సమాజం చేత చులకనగా చూడబడే వ్యక్తి. కవి చెప్పకపోయినా ''అవసరం తీరాక అవతల కనబడితే చుల్కనగచూచేటి'' అన్న వాక్యం ద్వారా గడ్డిపరక దేనికి ప్రతీక అవుతుందో చాలా సులభంగానే అర్థమవుతుంది. అలాగే కవిత ముగింపులో ''నన్ను నేను తెలుసుకున్నాను. ఆగండి ఆగండి'' అన్న ఈ వాక్యంలో ఇతరుల చేత పీడింపబడిన వ్యక్తి ప్రతిఘటన భావన సులభంగానే తెలుస్తుంది. కవితలోని ప్రతి

అంశము ప్రధాన ప్రతీకకు అన్వయిస్తుంది. సందర్భ నేపథ్య అవగాహన ఇలాంటి కవితలకు అవసరం.

తెలుగు కవిత్వంలో ప్రతీక వాదాన్ని నిండుగా అనుసరించిన కవి ఆరుద్ర. తెలంగాణా విప్లవ నేపథ్యంగా రాయబడిన "త్వమేవాహం" ప్రతీకాత్మక దీర్ఘకావ్యం. "తెలంగాణా విప్లవమే ఈ కావ్యమునకు ప్రధాన వస్తువు కాదు. అది ఈ రచన కూపిరులూదిన ఒక ఘటన మాత్రమే. త్వమేవాహంలో కాలము ప్రధాన వస్తువు. మృత్యువు చిరంజీవి మానవునితో 'నీవేనే'నని యనును. కాలమునకు మృత్యువునకు గల అభేదము ఈ విధముగా సూచింపబడినది" (డా. సి. నారాయణరెడ్డి, ఆధునికాంధ్ర కవిత్వము – సంప్రదాయములు – ప్రయోగములు, పుట 598). ఇందులో కాలానికి గడియారం ప్రతీక కాగా, ఇసుక గడియారం ఛాందసభావాలకు, గంటలు పెట్టుబడిదారులకు, నిముషాలు మధ్యతరగతికి, సెకన్లు శ్రామికులకి, స్టాప్‌వాచ్ విప్లవాన్ని కొలిచే సాధనానికీ, అలారం హెచ్చరికకీ ప్రతీకలు చేసుకున్నాడు కవి. ఇది ప్రతీకాత్మక కావ్యమైనందున వస్తువును వారి వారి అవగాహనను బట్టి విమర్శకులు అన్వయించుకోవటంతో ఆరుద్ర స్వయంగా వివరించవలసి వచ్చింది.

ప్రతీకను గురించిన ఆలోచనలు ఆనాడు విస్తృతంగా లేవు కాబట్టి పూర్తి ప్రతీకాత్మకమైన 'త్వమేవాహం'ని కొరకరాని కొయ్యగా భావించారు. మొదట ఆరుద్ర తన కావ్యానికి 'తెలంగాణా' అనే పేరు పెట్టాడు. ఆ పేరు ఉండి వుంటే పాఠకుడికి ఒక 'తాళం చెవి' దొరికివుండేది.

"త్వమేవాహం"లో కవికి విస్తృతభావ నేపథ్యం వున్నప్పటికీ, సంకేతాలు అన్నీ ఏకలక్ష్యకంగా సాగినట్లు కనిపించదు. నదులన్నీ సముద్రంలో కలుస్తున్నట్లు ఏకసూత్రత కనిపించదు. "ఒకవైపు తెలంగాణా నేపథ్యం కనిపిస్తూనే మరోవైపు కాలాన్ని సంకేతపరచినపుడు ఒక భావాన్ని సంకేతించి చెప్పదలచినపుడు, ఆ భావానికి సంకేత సారాంశం అనుగుణంగా ఉండాలి. భావంలో ఎంత గాఢత వుంటుందో సంకేతంలోనూ అలాంటి లక్షణం వుండాలి. లేనపుడు సంకేతం భావాన్ని దెబ్బతీస్తుంది. 'త్వమేవాహం'లో సంఘానికి గడియారం సంకేతమైంది. సంఘచలనాన్ని తాత్విక స్థాయిలో వ్యక్తీకరిస్తూ కాలానికి కొలమానమైన సాధారణ సాధనాన్ని సంకేతంగా స్వీకరించటంలో గాఢత దెబ్బతింది" (పాపినేని శివశంకర్, సాహిత్యం – మౌలిక భావనలు, పుట 93).

(సశేషం)

# THE PRIMACY OF READER-RESPONSE
## IN MODERN AND POST-MODERN CONTEXTS IN TELUGU

- V. Mandeswara Rao

*(Continued from the Last Issue)*

Marxism suffered a set back in the post-modern period. For a Marxist the community and the state are more important than the individual. But now the individual asks why he should sacrifice himself for an abstract idea of community. He feels his well-being is necessary for himself as also for the progress of the society. This brings to an end dictatorships of all kinds. Applying this to literature, we find that the poet is no longer interested in the mass experience of a group, instead he would comedown to the feelings and experiences of individuals.

In the Post-Freudian stage there is an openness in dealing with matters of sex. "At the Lady Chatterley trial, John Robinson, the suffragan Bishop of Woolwich had declared that Lawrence had portrayed 'the sex relation' as 'in a real sense an act of holy communion' and had exhibited a 'quite astonishing sensitivity to the beauty and value of all organic relation ship"[4]. Professor George Corstairs announced that popular morality was a wasteland littered with the debris of broken convictions' because of the emergent concept of sexual relations 'as a source of pleasure'.[5]

While science has unravelled the secrets and the dynamics of nature, its ally technology has produced engines and weapons of destruction and has been consistently destroying ecological balance. Turning its telescope to the skies, science has not discovered the existence of god. But has it discovered 'mind', though it has located the human brain and chartered the entire nervous system? Till yesterday if man is allured by science and rationalism, today there is another man rising from inside in revolt against this materialism. Philip Larkin feels that man "sees himself alienated from both an uncomfortable

past and a cheerless, Godless present"[6]. So man turns his eyes inside and is striving to find answers to questions science has not been able to come up with. The poet in the post-modern period ruminates, raises doubts and asks questions very like a philosopher in search of truth.

In the post-modern context, the reader is not interested in mere slogans. Modernism insists on being secular, post-modernism tilts towards being philosophical without becoming fundamentalist. Modernism rejected religion, and called it the opium on which nations were fed. Post-modernism does not reject religion out-right. It even invites a metaphysical approach; it does not accept the view the truth in monolithic. It has many facets, many names and approaches and it is for you to discover what you need.

Marxism finds inequalities and exploitation in society are explicable in terms of economics. It does not take into account factors like religion, caste, region and gender which are responsible for creating hierarchies in society. Feminists and dalits, crusading against unjust inequalities had to create their own literature and also discover their own readers.

Feminists find that inequalities of sex are not rooted in biological differences, but are only a social construct. The male critical establishment has never entertained the possibility that "women might read and interpret literature in some way their own"[7]. In Telugu, Feminist writing is centred round women's experiences, their cares and anxieties. They also discovered that while pretending to be adoring feminine beauty and charm, the male writings have been for centuries denigrating women presenting them in all shameless nudity. Even abusive terms in society are all focused on women. The strong reaction from the Feminists has had a salutary effect on the writings of all kinds of writers. Women writers like Kondepudi Nirmala, Jaya Prabha and Patibandla Rajani discovered appropriate diction, syntax and stratagies for their poems.

Dalit poetry, like Feminist poetry, is addressed to the common reader, not necessarily a dalit. The first dalit poet in Telugu, Jashuva, opted for traditional metres and poetic diction. But the present writers insist that to understand and appreciate the agony of the dalits, they should forget the kind of spoken language used in journals and other texts by accredited writers from the upper classes, and listen to dalit dialect and syntax. They insist that from their writings a new kind of Dalit Poetics is emerging.

Though the reader in the foregoing account is shown to be active all through the 20th century, we are yet to discover what this reader is like. I may be permitted to postulate two kinds of readers, the ***dumb*** and the ***articulate***. Both the readers are Bhavukas, endowed with the taste to be able to sense poetic flavour. The response of the dumb reader is not available, but the articulate reader is often heard, read and even commented upon. He may be influenced by traditional poetics and other tools of literary investigation. But his active participation in reading goes beyond this influence. Wolfgang Iser says that the author respects the readers and there are always gaps in the text for the reader to ruminate. "The participation of the reader could not be stimulated if every thing were laid out in front of him. This means that the formulated text must shade off, through allusions and suggestions, into a text that is unformulated though nonetheless intended. Only in this way can the readers' imagination be given the scope it needs; the written text furnishes it with indications which enable it to conjure up with what the text does not reveal"[8].

The reader then becomes a ***Sahridaya*** endowed with ***Bhavayatri*** and his imagination will be as alive as that of the poet as he gets along with the work. Thus in actual practice he discovers meanings beyond the scope of the earlier influences he was exposed to. It is here that he is different from the New Critic: "for the New Critic the text is central to his investiagions. It is an autonomous object that can and should be analyzed without regard to its context". But "reader - critics combine an interest in reading with a wide

variety of other critical and political concerns"[9]. What the reader discovers depends on his social, religious, caste and gender contexts. This is as much as to say that there are likely to be as many interpreters as there are readers. Reading thus becomes a subjective activity. At the same time it may be mentioned that interpretation is governed by "the standards of the interpretive community to which every reader necessarily belongs"[10]. Thus the reader is in a way delivered from subjectivity as he does not stand alone in his interpretation.

Among critics who center on acual reading, there are likely to be different approaches, theoretical as well as methodical (e.g. Marxist and Feminist). The same text may mean different things to different readers. But diversity of interpretation does not make a poem or a work imbecile or defunct. (Cleanth Brooks says that) Lyon points out diversity of opinion on the concluding lines "Beauty is truth, truth is beauty that is all / Ye know an earth, and all Ye need to know" of the Ode on a Grecian Urn. For Robert Bridges the final lines redeemed a poor poem, for T.S. Eliot they spoil a good one, and for Sir Arthur Quiller - Couch they are ignorant and uneducated. But the diversity has not stifled the poem. As I.A. Richards remarks "A book is a machine to think with" and (Wolfgang) Iser points out that "Fielding's novels have aroused so many different reactions and have yet survived (which) is proof enough of the diversity of human nature and of Fielding's genius in conveying it"[11].

Readers, of course, make an effort to decode the poem, and they construct meaning in the context of the times in which they live (modern or post-modern) and also in the context of their nativity (which includes religion, place, caste, gender etc.). For the New Critic the text provided the locus of meaning. But when readers stepped in, they started constructing the meaning of the texts. And then a third view emerged. For these critics the primary locus of meaning is neither in the text nor in the individual reader's response. Such critics are "concerned with

intertextuality," with the ways in which a literary text takes on meaning through its intricate relationship with other texts, both literary and non-literary"[12].

The reader-critic in Telugu these days has moved away from the text and is approaching it from non-literary strategies such as Marxism, Feminism, Ambedkarism etc. The reader isexpected to be a careful student of these and other literary and non-literary conventions and modes before approaching a text. This is "a socially defined practice". But in so doing they have moved, to use Jonathan Culler's phrase, "beyond interpretation"[13]. A consequence of this is that in addition to instability of interpretation, there is a simultaneous shift in literary evaluation. Literary criticism and theory too undergo changes and new poetics suchas Feminist and Dalit poetics emerge.

The primacy of the reader oriented criticism and evaluation exert pressure on the academic canon. The existing canon represents a particular choice arising out of social contexts of a different time. "Many audience critics have been increasingly aware of relationsip between canonical choices and ideology. As a consequence the very belief that there is 'enduring value' in texts - that there ought to be a text at all that cannot be questioned"[14].

Telugu readers' concerns are voiced from time to time; first by Dr. C.R. Reddy who raised a banner of revolt against Prabandhic style and structuring Kavyas without imaginative appeal.

In the third decade of the 20th century, Bhava Kavita was criticized by scholars like Kasibhatla Subbaiah Sastri, but the reader's anguish was voiced by Akkiraju Uma Kantham whose logic was invincible and irrefutable.

In the seventh decade, it was Kavisena Manifesto which once again served as the mouth piece for the dumb readers who felt they suffered the arrogant commitment to content at the cost of form and human sensibility.

Whenever literature is at cross roads or decadent, alarm bells ring at the right moment, if the reader is alert and sharp. Therein lies the primacy of the reader-response in the modern and post-modern contexts.

## REFERENCES:


1. **Literary Criticism - A Short History:** William K. Wimsatt, J.R. and Cleanth Brooks, p. 531.
2. **Contemporary Literary Theory:** Editors: C. Douglass Atkins and Laura Morrow: p.189.
3. **Ibid,** p. 82
4. **The Short Oxford History of English Literature:** Andrew Sandars: p. 611.
5. **Ibid,** p. 611
6. **Ibid,** p. 602
7. **Toward a Women's Poetics:** Josophine Donovan.
8. **The Role of the Reader in Fielding's Jospeh Andrews and Tom Jones:** Wolfgang Iser.
9. **Contemporary Literary Theory:** p. 82.
10. **The Primacy of the Reader:** Cleanth Brooks.
11. **The Role of the Reader:** Wolfgant Iser.
12. **Contemporary Literary Theory:** p. 87.
13. **Ibid.** p. 90.
14. **Ibid.** p. 92.


**వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ**
**రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి దేహం**
**ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివాంభః**
**లోకస్తథాపి అహితమాచరతీతి చిత్రమ్!**

తా॥ వార్ధక్యం మీద పడతానని బెదిరిస్తూ పెద్దపులిలా కూర్చుంది. రోగాలు శత్రువుల్లా శరీరాన్ని కొడుతున్నాయి. చిల్లుకుండలో నీళ్ళలాగ ఆయుర్దాయం తరిగిపోతోంది. ఇన్ని జరుగుతున్నా లోకులు ఇతరులకు అపకారం చేయాలని చూస్తూ ఉండటం చిత్రంగా ఉంది!

- శ్రీ టి.వి.కె. సోమయాజులు

అతిథి సంపాదకీయం:

# ఆధునిక కవిత్వంలో ఉత్ప్రేక్ష, ఉల్లేఖాలంకారాలు

- డా॥ మన్నవ భాస్కరనాయుడు

ఆధునిక కవులు చాలవరకు వాస్తవికతాదృక్పథం ఉన్నవారే. ఊహకు పట్టాభిషేకమే ఉత్ప్రేక్షాలంకారం.

ప్రాచీనమైనా, ఆధునికమైనా కవిత్వం ఒక సృజనాత్మక కళ. కళకు ఎంతోకొంత ఊహ, కల్పన ఆకృతినిచ్చే సాధనాలు. "The Poet's eye in a fine frenzy rolling doth glance... from Heaven to Earth from Earth to Heaven" అంటాడు షేక్స్పియర్. అవును. కవిభావుకుడు. అతని భావనాదృష్టి నేలనుండి నింగివరకు చీకటికోణాలనుకూడ చీల్చి చూడగలుగుతుంది. సాంప్రదాయిక కావ్యలక్షణాలను ఎంత కాదనుకొన్నా, ఆధునిక కవులు తమ భావాలను ఉత్ప్రేక్షించి వ్యక్తీకరించటం ఎంతో కొంత కనిపించక మానదు.

కవి చెప్పదలచిన విషయాన్ని దానితో సాదృశ్యం ఉన్న మరొక విషయంగా భావించి సంభావించటమే ఉత్ప్రేక్ష. కవుల ఊహలు ఎంత ఎత్తుకు చేరగలవో, ఎన్ని దూరాలకు పారగలవో ఉత్ప్రేక్షలు వ్యక్తం చేస్తాయి.

ఆధునిక కవులు వాస్తవిక వాదులే. తెలుగులో ఆధునిక కవిత్వానికి భావకవులే కవాటాలు తెరిచారు. భావకవుల విశిష్టత కాల్పనికత. మన భావకవులు 'గగనపథ విహార విహంగమపతులు'గా (దేవులపల్లి) ప్రసిద్ధి చెందారు. భావకవిత్వానికి ఒక రూపు, చూపు సంతరించిన తొలికవి రాయప్రోలు; ఆయన 'తృణకంకణం' తొలి క్రొత్తరైలు.

'తృణకంకణం' అనే కావ్యనామమే భావనాత్మకమైన పదచిత్రం. ఈ కావ్యంలో తొలి పద్యం సహజ రమణీయంగా ఉంది. రెండవ పద్యమే మనోహరమైన ఉత్ప్రేక్ష.

**"పసి నిమ్మపండ్ల చాయలు**<br>**కొసరెడి యా కుసుమగంధి కోమలపుటడల్**<br>**కసిగందిన కపటాకన**<br>**పసివాడె నిదాఘతాప పరిపీడనలన్".**

తరుణ వయస్కులైన కావ్యనాయికల శరీర సౌందర్యాన్ని ఉత్ప్రేక్షించి వర్ణించటంలో ప్రబంధకవులు ఉద్దండులు.

''కచకుచాభివర్ణనలతో అలంకృతము కాకపోతే కాంతాసౌందర్యము రూపు కట్టదా?'' అని ప్రశ్నించి, ఆధునిక ధోరణితో కావ్యరచనకు కంకణం ధరించి, 'తృణ కంకణం'తో 'నవకవితావతరణం' చేసిన రాయప్రోలు సుబ్బారావు తన నవ్యకావ్యంలో రెండవపద్యంలోనే కాంతాసౌందర్యచిత్రణతకు పూనుకోవటం చిత్రంగా కనిపించవచ్చు.

కానీ, ఆధునిక కవిగా రాయప్రోలు వారిది భౌతిక సౌందర్య దృష్టికాదు. భౌతిక సౌందర్యాన్ని వాడిపోయేటట్లు చేస్తున్న సమాజాన్ని కదిలించాలనుకుంటున్న నైతిక బాధ్యతా దృష్టి రాయప్రోలును ప్రక్కదారి పట్టించలేదు.

తృణకంకణం కావ్యంలో నాయికా నాయకులు యువతీ యువకులు. వారికి ప్రత్యేకమైన పేర్లు లేవు. ఎందుకు?... ఆధునిక సామాజిక సమస్యలలో ఒక దానిని కవిత్వీకరించుకోవాలనుకొన్న కవికి ఊరూరా ఇటువంటి నాయికా నాయకులే కనిపించారు. అందుకే కాబోలు, తన కావ్యనాయికలకు పేర్లు పెట్టకుండా సమస్యను సాధారణీకరించారు.

ఈ యువతి 'కన్నె గేదగి చెండునాన్ కళుకులలయు' చున్నది. పరువంలో ఉన్న గేదగిపూవేమో అన్నట్లుగా మెరిసిపోతూఉంది. కవి ఆమెను పాఠకులకు చూపటానికి ఊహనే, ఉత్ప్రేక్షనే ఆశ్రయించారు. ప్రాచీన కవులు కన్యల అంగాంగ సౌందర్యాన్ని విడదీసిచూసినవారే. యువతీసమగ్రసౌందర్యాన్ని అరుదుగానే వివరించారు. బహుశా అందమైన యువతిని గేదగిపువ్వుతో పోల్చిచూచినవారు కూడా అరుదే కావచ్చు. సాదృశ్య స్వీకరణంలో ఆధునికత ప్రదర్శించిన రాయప్రోలు ఊహలో ఒక సామాజిక వాస్తవాన్ని ధ్వనింపజేశారు.

పచ్చమొగిలిపూవే గేదగి. అందంగా, ఆకర్షణీయంగా, పరిమళభరితంగా, సుకుమారంగా ఉంటుంది. అయినా, గేదగిపూవు శివపూజకు అర్హం కాలేదు. గేదగి పూవేమో అన్నంతగా అందగిస్తున్న ఈ సుకుమారి ప్రేమవివాహానికి అర్హంకాదని సామాజికన్యాయం శాసిస్తున్నదనీ; శివపూజకు నోచుకొనని గేదగిపూవులా ఈ యువతి కూడా ప్రేమపూజకు అనర్హమవుతున్నదనీ కవి ఊహద్వారా వాస్తవసమాజ జీవనవిషాదాన్ని ధ్వనిస్తున్నారు.

ఒకనాటి స్నేహితుడు, ప్రియుడు అయిన యువకుని చాలనాళ్ళ తర్వాత కలుసుకోవాలన్న గాఢమైన అభిలాషతో, పొలాలలో, చెట్టు చేమలలో, మండుటెండలో నడచి వస్తున్న "చొక్కిన యింపు" మన కన్నులముందు నిలబెట్టటానికే ఈ ఊహ ఉపకరిస్తున్నది.

భావకవుల నాయికలు దేహసౌందర్యం ప్రదర్శించరు. మోహదృష్టి ఉన్నచోట దేహసౌందర్యం కనిపిస్తుంది. భావకవులది నాయికలపట్ల స్నేహదృష్టి. భావకవుల నాయికలు.. కలువ కన్నులు, చంపక నాసికలు, కుందరదనాలు, బింబాధరాలు. కంబు కంఠాలు, కుంభకుచాలు, సింహమధ్యాలు, పులిననితంబాలు, రంభోరువులు కలిగి ఉండరు. వారు 'నవనీతహృదయలు', 'అంతరంగ శాంతిదేవతలు', 'ఆశాపథాంతరాళపారిజాతాలు', 'ప్రేమజీవనవిభాతకైశికీగీతాలు', 'తపః కల్పవల్లిక'లు, 'అమృతశాంతులు', 'దివ్యకాంతులు' (వేదుల); 'ప్రాణమునకు ప్రాణమౌ ప్రాణకాంతలు', 'శోక గీతికలు' (దేవులపల్లి); 'అనురూప గుణప్రతిమలు', 'ప్రసన్నశీలలు', 'నవనీత శిరీష ప్రణయ మృదుల హృదయలు' (రాయప్రోలు).

కావ్యనాయికలో అవ్యక్త మధుర హృదయ సౌందర్య దర్శనం రాయప్రోలుతోనే ఆరంభమైంది. భావకవుల నాయికా దేహసౌందర్యం... 'ఉషఃకాల కౌముది సొగసు'గా, 'తొలిప్రొద్దు నునుమంచు తీవసొన'గా (దేవులపల్లి), 'సుధాస్వాదుమూర్తి'గా (నాయని) మాత్రమే కనిపిస్తుంది. ఈ భావనలు, ఊహలు స్నేహసౌందర్య ముకురాలు. ఇది భావకవుల అమలిన ప్రణయ దృష్టి. ఈ దృష్టికి పుష్టిబీజాలు వేసింది రాయప్రోలు సుబ్బారావుగారు.

అటువంటి రాయప్రోలువారి తృణకంకణ కావ్యనాయిక "కోమలపు టడలు" "పసినిమ్మపండ్ల చాయలు కొసరెడి" అందంగానే మనకు కనిపిస్తుంది. ఈ అందం పాఠకులను సమ్మోహింపజేయదు; వసివాడని వాత్సల్యం ఆవహింపజేస్తుంది. ఇంత ముగ్ధమధురమైన, సుకుమార కోమలమైన నాయిక ఒళ్ళు 'కసుగందిన కవటాకేమో' అన్నట్లుగా ఎండకు వసివాడిపోయిన రూపం మనముందు నిలుస్తుంది. ఇంత గాఢమైన ఊహను, భావనను రంగరించుకొన్న ఈ ఉత్ప్రేక్ష కేవల చమత్కారపరం కాలేదు. కావ్యంలో చివరివరకు తీగసాగిన స్నేహభావనా సౌందర్య సాక్షాత్కారపరం.

ఇటువంటి స్నేహప్రణయభావనామయమైన భావకవుల ఊహలు విశిష్టమైన ఉత్ప్రేక్షలుగా అభివ్యక్తమైనాయి.

''చంద్రసూర్యులు తారకాసముదయమ్ము
పుడమియును నాకమును తక్కు భువనములును
ప్రేమ సూత్రమ్మునం గ్రుచ్చి విశ్వకర్త
గళమునం దాల్చు ముత్యాలు''... గా (నాయని సుబ్బారావు - సౌభద్రుని ప్రణయయాత్ర - 'వత్సల వలపు') సంభావింపబడ్డాయి. విశ్వవ్యాప్తంగా సమస్త ప్రకృతి ప్రేమమయంగా విశ్వసించిన భావకవుల కవిహృదయం ఇటువంటి ఉత్ప్రేక్షలవల్ల వెల్లడి అవుతుంది.

ఎంకి 'పండు యెన్నెల్లోన నీలి సీరాగట్టి నీటుగొస్తావుంటె'... ''వొనలచ్చిమి'' అనిపిస్తుంది నండూరి సుబ్బారావుగారికి. తెలుగునేలలో వెలుగుపూలు పూయిస్తున్న గ్రామీణప్రకృతిశోభను ప్రదర్శిస్తాయి ఈ ఉత్ప్రేక్షలు. భావకవుల ఉత్ప్రేక్షలకు కాల్పనికత పునాది.

ఇరవయ్యవశతాబ్ది పూర్వార్ధంలోనే తెలుగులో ప్రగతివాదసిద్ధాంతాలతో అభ్యుదయకవిత్వం పురుడుపోసికొన్నదని మనకు తెలుసు. అయితే, అభ్యుదయ కవుల స్వప్నాలకు, ఊహలకు వాస్తవికత పునాది.

కలలుకనటం మానవలక్షణం. కలలుకననివారు మానవులు కాలేరని మేధావులు అంగీకరించిన అంశమే. "Yes, dreams! Young man dreams! If a man has no dreams to cherish, he turns into an animal" అని సుప్రసిద్ధ విప్లవకారుడు, క్రెమ్లిన్‌స్వాప్నికుడు లెనిన్‌కూడా దృఢంగా విశ్వసించాడు.

''స్వప్నాలు పగిలించిన'' అభ్యుదయ కవిత్వంలో ''ఊహాంచల సాహసికాంసం కప్పిన'' ''నిట్టూర్పులు వినిపించే'' శ్రీశ్రీ ఉత్ప్రేక్షలు కూడా ఉన్నాయి.

ప్రథమ ప్రపంచయుద్ధ పూర్వరంగంలో ఆధునిక సమాజం ఆర్థిక సంక్షోభంతో అతలాకుతలమైపోయింది. అనేకవిధాలుగా సంశ్లిష్టమైపోయిన జీవితంలో ప్రశాంతమైన ఏకాంతం కరవైపోయింది. సుఖనిద్రకు, సుందరస్వప్నాలకు కవుల కన్నులు కాయలు కాచాయి. అభ్యుదయ కవులలో శ్రీరంగం నారాయణబాబు ఆరని 'రుధిరజ్యోతు'లు రగిలించారు. ఆయన నిట్టూర్పులో ఒక ఉత్ప్రేక్షను చూద్దాం! ఊరవతలకి వెళ్ళి కాసేపు కలలుకందామనుకున్నా వీడని భయంచాయలను చూద్దాం!

''కలల పొదరిళ్ళలో
సౌఖ్యంపు నిదురలో

**ఊహాగానం శాయగ**
**ఊరవతలకి..."** వెళ్ళి ... వెనుదిరిగి చూస్తే...
**"వెంటాడే మృత్యువుగా**
**వెరపుగొలుపు"** తూ ఉంది తన నీడ... ('ఊరవతల')

వెంటాడే మృత్యువుగా ఉత్ప్రేక్షింపబడిన ఆ ఛాయ వాస్తవ సమాజ జీవిత ఛాయ; కఠోర భయంకర జీవన విషాద స్రవంతిలో ఒక పాయ!

ఆధునికవిజ్ఞానశాస్త్రవికసనంతో పారిశ్రామికయుగం, పారిశ్రామికయుగంలో పెట్టుబడిదారీవ్యవస్థ రూపుదిద్దుకున్నాయి. పెట్టుబడిదారీవ్యవస్థలో కార్మికుల శ్రమఫలితం దోపిడికి గురిఅయ్యే ప్రమాదం తలయెత్తింది. శ్రమఫలాన్ని అనుభవించలేని 'కార్మికసోదరుల' 'కణకణమండేకళ్ళ'కు సాక్ష్యంగా...

**"భుగ భుగమనే పొగగొట్టాల"తో ....**
**"ఆకాశమె చిల్లులు పడ**
**అతి తారస్థాయినా మిల్లరచింది"** ('ఊరవతల')... అని నారాయణబాబు కర్మాగారాల ధ్వనులను ఉత్ప్రేక్షిస్తారు. ఈ ఉత్ప్రేక్ష కవి ఊహల వ్యూహాల డోలగా విహరించదు. విప్లవ భావనా 'చాంపేయ మాల'గా (శ్రీశ్రీ) జీవిత వాస్తవికతను కవిత్వంగా అలంకరిస్తుంది.

తొలితరం అభ్యుదయకవులలో పురిపండా అప్పలస్వామి చైతన్యభావాల "పులిపంజా" విప్పారు.

**"హలం లాగి పొలం లాగి ఇళ్ళూ వాకిళ్ళు లాగి**
**వూళ్ళు వెళ్ళగొట్టిన ..."** బలవంతుల ప్రభుత్వాలకు కాలం

**"అయిపోయింది, ఇక సాగదు,**
**అదిగో ఆశ్వాసాంతం"**... అంటూ భవిష్యత్తును చూపిస్తారు. భవిష్యత్తులో సాక్షాత్కరిస్తూ ఉన్న "సమానత్వం" అనే వాస్తవం...

**"నిప్పుకొండ నిలిచినట్లు**
**నిజం లేచి నిలబడింది"**... అని ఉత్ప్రేక్షిస్తారు.

భవిష్యత్సమాజ జీవితంలో తలయెత్తనున్న నిజం సమానత్వం అనీ, ఆ సమసమాజవ్యవస్థ వర్తమానంలోని స్వార్థపథప్రవర్తకులకు "నిప్పుకొండ" అనిపించేటట్లుగా రగులుతూందనీ కవి వ్యక్తం చేస్తున్నారు.

ఆధునికకవులు ఉత్ప్రేక్షను ఇటు వర్తమానఅవస్థను, అటు భవిష్యత్ సమానత్వ వ్యవస్థను చిత్రించగల ఉపకరణంగా ఉపయోగించుకున్నారు.

## ఆధునిక కవిత్వంలో ఉల్లేఖాలంకారం:

ఒకే విషయాన్ని ఒకరు అనేకరకాలుగా భావించినట్లు కానీ, అనేకులు అనేక విధాలుగా భావించినట్లు కానీ వ్యక్తీకరించే పద్ధతిని ఉల్లేఖాలంకారం అన్నారు. ఈ అలంకారాభివ్యక్తిలో కూడా కవుల ఊహా ప్రౌఢిమ కనిపిస్తుంది. ముఖ్యంగా మన ప్రబంధకవుల ఉల్లేఖనాలలో ఉబికివచ్చిన ఊహలు కొన్ని ఉర్వికి అందవు. మనుచరిత్రలో అల్లసాని పెద్దన గృహమేధిని ఉల్లేఖించిన విధానం (మను-1-66) వాస్తవ జీవితానికి దగ్గరగా అనిపిస్తాయి. నందితిమ్మన పారిజాతాపహరణంలో (2-37) తారలను ఉల్లేఖించిన తీరు కవి భావనాస్థాయి నక్షత్రమండలాన్ని తాకుతుందని నిరూపిస్తుంది. సాధారణంగా ప్రబంధకవుల భావనాస్థాయి అదే!

"Great poetry draws its strength from the life of man kind" (Jung-యుూంగ్) అన్న తాత్వికుల విశ్వాసాన్ని మన్నించే ఆధునిక కవులు నేలవిడిచి, ఊహలలో విహరించరు. అయితే, ఆధునిక కవిత్వంలో ఉల్లేఖాలంకార అభివ్యక్తి రీతులు కాస్త ఎక్కువగానే ఉన్నాయి. అందుకు కారణం వీరి అనుభూతి గాఢత్వమూ, ఆవేశ తీవ్రత కావచ్చు. ఎందుకంటే భావకవుల అనుభూతి గాఢత్వం కానీ, అభ్యుదయ విప్లవ కవుల చైతన్యతత్వం కానీ ఒక్క మాటలో, ఒక్క తీరులో వ్యక్తీకరించటం కష్టమే. భావగాఢత్వ వ్యక్తీకరణలో భాగంగా ఆధునికుల ఉల్లేఖలు ఉప్పెనలై ఉరవడిస్తాయి; ఉడుకు నెత్తురులై ఉరకలేస్తాయి.

‘‘ఏను స్వేచ్ఛా కుమారుడ, నేను గగన
పథ విహార విహంగమపతిని నేను
మోహన వినీల జలధరమూర్తి నేను
ప్రళయ ఝంఝా ప్రభంజనస్వామి నేను ...’’ (‘నేను’) అనీ;

‘‘.... ఎవ్వరని యెంతురో నన్ను, యేనసంత
శోక భీకర తిమిరలోకైక పతిని,
కంటక కిరీటధారిని ....’’ (‘నన్నుగని’) అనీ ... తన కవితా మూర్తి మత్వాన్ని

ఉలేఖ్లిఖిస్తేనేగాని కృష్ణశాస్త్రి అనుభూతిఆవేశం చల్లారదు. ఈ ఉల్లేఖలద్వారా సమకాలీన సామాజిక శోకాన్నీ, స్వేచ్ఛారాహిత్యాన్నీ, తన స్వేచ్ఛాభిరతినీ వాస్తవికతకు దగ్గర చేశారు దేవులపల్లి.

భావకవిత్వానికి ప్రాణప్రదమైన అమలిన ప్రణయ భావావేశంతో కృష్ణశాస్త్రి తన ఊహాసుందరిని ఉల్లేఖలతోనే మనముందు నిలుపుతారు. ఆమె "నితాంత వియోగిని", "నిశీథిని", "కఠోరప్రణయశాలిని" ("ప్రేయసీ! ప్రేయసీ!") అని ఉల్లేఖిస్తారు. ఇటువంటి ఉల్లేఖాలంకారాభివ్యక్తిలో కవి ఊహాశాలిత్వం కంటె అవ్యక్త మధుర ప్రణయ విషాద సుఖశీలత్వమే పాఠకులను ఆకట్టుకుంటుంది.

ఇంచుమించు భావకవులందరు తమ స్వప్నరాణులను వివిధ రకాలుగా ఉల్లేఖలతోనే సంబోధిస్తారు, సంభావిస్తారు!

వేదుల సత్యనారాయణ 'దీపావళి' కవితా సంపుటిలో "అస్తగిరి వాసినీ! జీవితావసాన శైశిర తమోభిసారికా!", "ధిక్కృత ప్రేమ చరమాతిథీ! మహాబ్ధి పారదూర ప్రవాసినీ! ప్రాణశాంతి గాయనీ!" (ఆహ్వానము) అని తన ప్రేయసిని విభిన్న రూపాలతో సంబోధిస్తారు. "నిత్య హింసారిరంసా వినిద్రరుద్ర భవనవాటికాద్వార కవాటములను దెరచుకొని" రమ్మని ఆహ్వానిస్తారు. ఇన్ని ఉల్లేఖనల సంబోధనలలో పవిత్రప్రేమ ఎదురుకొంటున్న సామాజికహింస ఎంత బలీయమైనదో స్ఫురింపజేస్తారు.

అంతేకాదు, వేదుల తన ప్రేయసీమణిని ...

**"మరణదేవతవో, సుధామధురవిధుర**
**జీవశాంతివో, ప్రేమైక జీవకళవొ,**
**విలయ సౌందర్య ధాత్రివో, విశ్వగాన**
**మోహినివొ, యిహదుఃఖ తమో నియతివొ..."** ('ఆహ్వానము')

అంటూ సందేహం మేళవించిన స్నేహమాధుర్యంతో ఊహల ఉల్లేఖల పూల మాలలతో ఆహ్వానిస్తారు.

ఒక్క క్షణమే కావచ్చు... "ప్రేమ ప్రసన్నమైన యద్వంద్వకాంతి సీమాంతరమున శాశ్వతసుషుప్తి" లభిస్తే, అందలి ప్రశాంతిని అనుభూతి చెందగల భావుకతలో ఉల్లిఖితమైన భావకవుల ప్రణయదేవత "ప్రేమజీవన విభాత కైశికీగీతి" ఆలపిస్తుంది. "జగదీశు మకుటాగ్ర సీమనుండి యుర్విపై జారిన సుధామయూఖరేఖ"గా (ఆరాధన) ఆశ్వాసిస్తుంది.

భావకవిత్వమూ, అభ్యుదయ భావకవిత్వమూ అని విడదీయలేనంత గాఢంగా అనుభూతి సాంద్రతతో కవిత్వం చెప్పిన బాలగంగాధర తిలక్ 'కవితాసతి నుదుటి మీద

రసగంగాధర తిలకం' అని శ్రీశ్రీ చేత ప్రశంసింపబడినాడు. తిలక్ 'అమృతం కురిసిన రాత్రి' అనే కవితాసంపుటిలో తనకవిత్వం ఎటువంటిదో ఉల్లేఖద్వారా వెల్లడించారు.

**"నా కవిత్వం కాదొక తత్వం" - అంటూనే,**

**"నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు,**
**నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు,**
**నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు"** - ('నా కవిత్వం')

అని ఉల్లేఖించి తన కవితాతత్వాన్నీ, కవిగా తన మనస్తత్వాన్నీ స్పష్టం చేస్తున్నారు. పై పంక్తులలో రూపకాలు, పునరుక్తులు సాధిస్తున్న కవిత్వప్రయోజనంతోపాటు ఉల్లేఖలు తనకవిత్వంలోని కారుణ్యాన్నీ, చైతన్యాన్నీ, సౌందర్యాన్నీ చాటి చెబుతాయి.

శ్రీశ్రీలోని ఉల్లేఖలు ఆయన జీవితమైన అలజడికీ, ఊపిరైన ఆందోళనకు, వేదాంతమైన తిరుగుబాటుకు సరిహద్దు రేఖలు.

ప్రసిద్ధాంగ్లకవి స్విన్‌బర్న్ రచించిన కొన్ని కవితలు శ్రీశ్రీ అనువదించారు. స్విన్‌బర్న్‌పట్ల తనకున్న అభిమానంతో స్వయంగా ఒక కవిత రచించారు. ఆ కవిత స్విన్‌బర్న్‌కే అంకితమన్న భావం స్ఫురింపజేస్తూ, ఆ కవితకు 'స్విన్ బర్న్ కవికి' అనే శీర్షిక ఉంచారు. ఈ కవితలో శ్రీశ్రీ ఉల్లేఖలు స్విన్‌బర్న్ కవితా శక్తినీ, దానిమీద శ్రీశ్రీకి ఉన్న అపరిమితమైన అభిమాన తీవ్రతను కలిపి వ్యక్తం చేస్తాయి.

శ్రీశ్రీ రచించిన 'దేశచరిత్రలు' అనేకవిత చరిత్రకు ఒక క్రొత్తఅర్థం ప్రతిపాదిస్తుంది. ఈ కవితలో 'నరజాతిచరిత్ర'ను శ్రీశ్రీ ఉల్లేఖించిన విధానం ఆవేశ భరితమేకాక ఆలోచనాత్మకంకూడా. యుగయుగాల తరతరాల మానవజాతి చరిత్రలోని మాలిన్యం, స్వార్థకాఠిన్యం ఎంత బీభత్సకరమైనదో మన ఊహకు అంది వస్తుంది. నిజానికి చరిత్రకు సత్యమే పునాది. అయితే, మనదేశ చరిత్రను పాశ్చాత్యులు వారి ప్రయోజనాలకు అనుకూలంగా రచించారు.

ఇప్పటికీ మన కవులు పలువురు ఆదర్శవాదంతో గతచరిత్ర వైభవాలను గంభీర కవిత్వంతో అభిషేకిస్తున్నారు; కావ్యగానాలు చేస్తున్నారు. శ్రీశ్రీ చరిత్రను భౌతికవాద దృక్పథంతో, గతితార్కిక దృష్టితో వాస్తవం పునాదిగా అవలోకించారు. దేశచరిత్రలు అనే కవితలో ఆయన చరిత్రను ఉల్లేఖించిన తీరు వాస్తవికత ఊరేగిన తీరు.

**"నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం**
**నరజాతి చరిత్ర సమస్తం దరిద్రులను కాల్చుకు తినడం ..."** వంటి ఉల్లేఖలు చరిత్రగర్భంలో దాగిన దోపిడీతత్వాన్ని త్రవ్వితీస్తాయి.

దిగంబరకవి భైరవయ్య 'అగ్నిప్రవేశం' అనే ఖండికలో (మొదటి సంపుటి)

**''అబద్ధాల కత్తి అంచులమీద నిజంలా**
**మిన్నంటుతున్న జ్వాలల కొసలపై పొగలా'**..తాను నిలుచుకొని ఉన్నానంటాడు;

**''రుద్రఫాలంమీది నేత్రంలా**
**చిక్కటి ఇరుల ఉడుపుల వెనుకదాగిన**
**తొగరు అందాల తేజంలా''** - తాను ప్రపంచాన్ని చూస్తున్నానంటాడు.

ఉపమను గర్భీకరించుకొన్న ఈ ఉల్లేఖలు ఆధునిక జీవితంలోని చీకటి కోణాలు చూపిస్తున్నాయి. మనం గర్వంగా చాటుకొనే సత్యాల తెరల మరగున ఎన్ని అబద్ధాలు వికృతనాట్యం చేస్తున్నాయో, అందమైన జీవితంపేరుతో ఆధునికసమాజం ఎంత అబద్ధజీవితం గడుపుతూ ఉన్నదో ఈ ఉల్లేఖలు నగ్నంగా ప్రదర్శిస్తాయి.

దిగంబరకవులలో 'మహాస్వప్న' ఒకరు. ఆయన 'గ్లానిర్భవతి భారత' (మొదటి సంపుటి) అనే కవితలో 'రాత్రి ఉదయిస్తున్న రవి'గా తన ప్రాదుర్భావాన్ని అనేక రకాలుగా ఉల్లేఖిస్తారు. దిగంబరకవుల ఉల్లేఖలు అస్తవ్యస్తమైన ఆధునిక సామాజిక వ్యవస్థను దర్శింపజేస్తాయి.

ప్రగతిచైతన్యాన్ని విప్లవచైతన్యంగా రగిలించే ప్రయత్నం చేసింది విప్లవ కవిత్వం. విప్లవకవి చూపిన చైతన్యస్ఫూర్తితో మన్నుదిన్నపాములె పడిఉన్న రైతుబిడ్డ...

**''గాలిలోని వాలులా, ఏటిలోని నీటిలా**
**నీటిలోని చేపలా, ప్రజలమధ్యన ఒకనిగా...''** (శివసాగర్-ఉద్యమం నెలబాలుడు - 'తూర్పు పవనం వీచెనోయ్' కవిత) లేచినట్లు ఉల్లేఖిస్తారు శివసాగర్. ఇన్నాళ్ళుగా, ఇన్నేళ్ళుగా దోపిడీవ్యవస్థలో కదలిక తెలియక, కర్మసిద్ధాంతాన్ని నమ్ముకొని, పడిఉండిన రైతుబిడ్డలో కూడా చైతన్యం, ఏటికి ఎదురీదినట్లు దోపిడీదారులను ఎదిరించగల చైతన్యవంతులైనట్లు ఇన్ని ఉపమానాలు జోడించి ఉల్లేఖను సార్థకం చేస్తాడు శివసాగర్. శ్రీకాకుళం రైతాంగపోరాటం అప్పటికే ఒక చారిత్రక వాస్తవం! చలనరహితమైన బడుగు జీవితాలలో కదలిక తీసికొనిరావాలని ఆశించే విప్లవకవి ఆశయాన్ని చాటే ఈ ఉల్లేఖలు పదునైన మాటల బాకులు.

ఆధునిక కవిత్వంలో ఉత్ప్రేక్ష, ఉల్లేఖ వంటి అలంకారాలు సమకాలీన జీవితంలో అవసరమైన ఆశయ ఆవేశ గాఢత్వాన్ని వ్యక్తం జేసే ఉపకరణాలుగా ఉపకరించాయి.

# డా॥ మల్లేల గురవయ్య్య కవితలు

## 1. వ్యయా! హార్దిక స్వాగతమిదె!

1. వ్యయవర్షంబిది యేమియేమి వ్యయమో! ఆదాయమే లేదొ! దు
ర్వ్యయమే లక్ష్యముగా గమించి తుది నిస్స్వాంతమ్ము కాగా, నదే
లయమౌ; క్షేమమెక్కడిదిఁకన్, లాలించి పాలించు న
వ్యయుఁడౌ ఆ పరమాత్మకేది విధి? సత్యంబెట్లు వర్తించునో! ॥

2. వ్యయసార్థక్యముఁ గూర్చ సర్వము క్షయంబైనంత, నాపై మఱే
మియు నావంతయు నుండునే! నిజము సుమ్మీ! వంతయే స్వాంతమం
దయుతమ్మై కడుపేర్చు, నిట్టియెడలన్ హర్షమ్మికేరీతి! నం
తయు వెచ్చమ్మగు, సర్వజిత్తుకు నటన్ వర్తిల్లనేమున్నదో! ॥

3. అబ్దుల్ సాగఁగనిట్లె ఆఱుపదులందొనొక్క వర్షమ్ము నూ
త్నాబ్దంబట్టులు చక్రరీతిగను పర్యాయక్రమంబౌను; ష
ష్ట్యబ్దుల్ నేటికి నెన్నియో గడచె; కాలానంత విశ్రాంతు ని
శ్శబ్దంబే తెలుపున్ సుఖస్థితిని (సుషుప్తిగతి) నిశ్వాసల్ వ్యయత్రాసలౌ ॥

4. షష్ట్యబ్దంబులు రెంటికిన్ మునుపు షష్ఠమ్మై నమాసమ్మునన్
దౌష్ట్యమ్మౌ మఱిదిష్టమో బహుళమున్ సౌమ్య ద్వితీయాతిథిన్
వ్యష్ట్యౌ భీ(కృ)ష్టత రామకృష్ణగురు డవ్యక్త స్థితింబూని పై
శిష్ట్యమ్మేదొ మహాసమాధిఁగనె; పై చిత్రమ్ము చాటెన్ వ్యయన్ ॥

5. మత సంఘర్షణలుఁ దురాక్రమణలున్ మత్తెక్కు దౌష్ట్యక్రియల్
ప్రతికూలమ్మగు దుష్కృతుల్ సతత దుర్మార్గమ్ములున్ వైర సం
హితమే ధ్యేయముగా వృథా కలితముల్, హింసా రిరంసా విచే
ష్టితముల్ పూర్తిగ నాశనమ్మగు స్థితిఁ జేకూర్చుమింకన్ వ్యయా!॥

6. క్రౌర్య మడంబి శౌర్యమవికారతమై అనివార్యధుర్యమై
స్థైర్యము ధైర్యమున్ విడక శాంతి సుఖమ్ములు గూర్చ, నప్పుడే

వీర్యము సర్వజిత్తునకు వీలుగ పర్తిలినట్లు; లేనిచో,
గార్యము లేని యీ వ్యయ బ్రకాశితముల్, కడతేఱు టెట్లికన్ ॥

7. తానె రాజు మేఘసేనార్ఘములపతి అమరగురుడు; శుక్రుండయ్యె మంత్రి
సస్యనాథుడు శశి-శనిధాన్యనాథుడు, వ్యయకు గ్రహబలమ్ము ప్రగతిపథమె॥

8. వ్యయ వర్షమ్మధికమ్మె వ్యయనామము సార్థకముగ ఫలితము కలుగున్
వ్యయమగు వైద్యమ్మునకున్ వ్యయమగు శృంగారములకు నటువేడ్కలకున్॥

9. తెలుగు సంవత్సరాదిన్ మదిం దలంచి
ఎన్నడింతకు మున్నోనరింపని గతి
విశ్వవిద్యాలయాధ్యక్ష వృత్తికి నొక
వెలుగు జయరామిరెడ్డి నింపెన్ వ్యయాబ్ధి ॥

10. గురునాధిపత్యమనగా గురువారము వ్యయవరించె గురుతరలీలన్
సరి నిది నాదాయ వ్యయ పరిగణనకు తగిన తిథి చివర మార్చి విధిన్ ॥

11. వ్యయా! నీదు లక్ష్యంబహో! అద్భుతంబౌ
భయం బేల మాకున్ స్వధర్మంబ నీకున్
వ్యయంబన్న నాశం బగున్‌గాన చెడ్డన్
క్షయం బీవు సేయన్ సదా నీకు జోతల్ ॥

12. మంచి చెడ్డలేవియొ నిజం బెంచనెపుడు
వ్యయమె ధ్యేయంబుగా సమువర్తిననెదొ
అంతకున్ మించు ధర్మ మెందైనఁగలదె
అయినచో వ్యయా! హార్దిక స్వాగతమిదె॥

## 2. సర్వజిత్తు ఉగాది

1. దృక్సిద్ధాంతమొ! యేబదేండ్లయిన దీదృగ్భేదముల్ ప్రాప్తిలెౕ
ప్రాక్సిద్ధాంతమనౕ సనాతనము సూర్యశ్రేష్ఠ సిద్దాంతమే

లుక్సిద్ధాంతముగా గణింపఁబడె; నెట్లో దృక్కు దిక్కయ్యె ప
మ్యక్సద్ధర్మములెల్ల వీగి వికృతుల్ వ్యాపించె నవ్యమ్ములై ॥

2. అరుదెంచెన్ బలుసందియమ్ములకు నిక్కె నిక్కమేదో పర
స్పరవాదమ్ముల సర్వజిత్తు పొడమెన్ శాస్త్రమ్మునుంబట్టి అం
దఱు నంగారకుడే ప్రభుండనిరి; యేతత్కాలనమ్మందు న
ల్లరులున్ జౌర్యము, దోపిడుల్, పగలు, తీవ్రాగ్ని ప్రమాదమ్ములౌ॥

3. వ్యయ సూర్యగ్రహణమ్మిటుల్ చివర సంప్రాప్తిల్లె నెట్లౌశుభో
దయ మీయేడన? సర్వజిత్తదియనర్థమ్ముల్ జయించున్; వ్యథల్
భయమున్ గల్గవటంచు నమ్మవలెనా? ప్రాగ్జన్మసంస్కారమె
ట్లయటుల్ సాగును వారి కర్మఫలమంచూహించుటే ధర్మమా!॥

4. సర్వజిత్తు సకల జయసిద్ధి కన్వర్థ కాని నేతి బీరకాయయైన
ఇరువదొక్క సంఖ్య పరశురామప్రీతి రీతి భూతి(బూది) జేయ ప్రేలుకాదె॥

5. ఈ వెయిటౌదు వింకపయి నేనని వచ్చెడి వత్సరాఖ్యం
బై విలసిల్లునందువొ భళాభళి సర్వము సర్వధారిలో
ఆవిలమైన అప్పువడి అట్టడుగౌ నొక లోతు గుంటలో
లేవడి మ్రొక్కుచో వలదులే వెతయెట్టి విరోధి కేనియున్॥

6. అరిషడ్వర్గపు టాధిపత్యమె బలంబైయుండ నందున్ శుభం
కరులో ముగ్గురె; ఆఱు మూడగుటె; లోకం బెల్లశోకంబె; యె
క్కరణిన్ మంచికి నన్నిటన్ జయము! అంగారమ్ము మూడింతలై
విరివిన్ భగ్గునమండ బుగ్గి మిగులన్; విద్రోహమేలన్ భువిన్ ॥

7. సరవిన్ మిక్కిలి సర్వ జిత్తులనె లక్ష్యంబంచు నీ రాజకీ
య రహస్యంబుల నప్పుటప్పుటికి మంత్రాలోచనల్ చేసి స
త్వర సంక్షేమమటంచు క్షామమునకున్ స్థానమ్ము కల్పించి దు
ర్భర దారిద్ర్య విధిన్ బ్రజాళిఁగడతేర్పన్ సర్వజిత్ సార్థమో!॥

8. భూమికి పుట్టినవాడే భూమికి ప్రభువయ్యె నేడు బుగ్గియొనర్పం
గా మేలేగతినగు రాధామాధవుడే సమస్త ధాత్రి మ(త) నుపుతన్ ॥

బంగారు పాళీ (Gold Nib) :

# శ్రీమద్రామాయణ కల్పవృక్షము

## బాలకాండము - ధనుర్భంగ ఘట్టము

- డా॥ సంగనభట్ల నరసయ్య

శా. నిష్ఠా వర్ష దమోఘ మేఘపటలీ నిర్గచ్ఛ దుద్యోతిత
స్పేష్ఠేరమ్మద మాలికా యుగపదుజ్జృంభన్మహాఘోర బం
హిష్ఠ స్ఫూర్జథు షండ మండిత రవాహీన క్రియాప్రౌఢి ద్రా
ఘిష్ఠంబై యొకరావమంతటఁ నెసంగెన్ ఛిన్నచాపంబునన్. 301

అర్థం: నిష్ఠా=నిరంతరంగా, వర్షత్=వర్షించుచున్న, అమోఘ=మొక్కవోని (వ్యర్థము కాని=జలహీనముల కాని=జలసమృద్ధిగల) మేఘ= మేఘముల (మబ్బుల), పటలీ=సమూహము నుండి, నిర్గచ్ఛత్= బయల్వెడలుచున్న, ఉద్యోతిత=ప్రకాశమానములైన, స్పేష్ఠ=అధికములైన, ఇరమ్మద= మెరుపులయొక్క ('మేఘ జ్యోతి రిరమ్మద' అని అమరం), మాలికా= వరుసలతో, యుగపత్=ఏకకాలమందు, ఉత్+జృంభత్=గొప్పగాచెలరేగు చున్న, మహాఘోర=మిక్కిలి భయంకరమైనవాని,బంహిష్ఠ=బాహుళ్యతచే, స్ఫూర్జ =వజ్రముయొక్క (ఇంద్రుని ఆయుధము యొక్క), థు=ధ్వని (పిడుగుల చప్పుడు), షండ=సమూహముచే, మండిత= ప్రకాశించు, రవ=శబ్దముకంటె, అహీనక్రియా=తక్కువకాని విధమైన, ప్రౌఢి= గొప్పదనముగల్గి(అతిశయమై),ద్రాఘిష్ఠంబై=మిక్కిలిదీర్ఘమైన,ఒక రావము=ఒక ఉత్కృష్టమైన ధ్వని, ఛిన్న=విరిగిన చాపంబునన్=ధనుస్సు నుండి, అంతటన్=అప్పుడు (విల్లు విరుగగానే) లేదా సర్వత్ర, ఎసంగెన్= ఒప్పెను.

తాత్పర్యం: నిరంతరంగా వర్షిస్తున్న కారుమేఘాల మాటునుండి మెరిసే మెరుపుల మాలలతో పాటే కల్గే ఉరుముల ధ్వనులకు తోడుగా భయంకరంగా, అంతులేకుండా పడే పిడుగుల చప్పుళ్ళ కంటే కూడా ఏ మాత్రం తగ్గని విధంగా విరిగిన ధనుస్సునుండి ధ్వని వెడలింది. ఉరుములు, పిడుగుల కంటె అధికమైన ధ్వని పుట్టిందని తాత్పర్యం.

అలం: అతిశయోక్తి. ఉపమానలకంటే ఉపమేయాధిక్యత ఉంది. ష్ఠకార ప్రాస, మహాప్రాణాక్షర ప్రయోగం, సుదీర్ఘ సమాస ఘటన, ఛిన్న ధనుర్ధ్వని వ్యంజకత్వానికి ఉద్దేశ్యం.

విశేషం: ఈ పద్యం తిరిగి (396 వసంఖ్యతో), ఇష్టంచేత విశ్వనాథ మళ్ళీ రాసుకున్నాడు. "కాంచెన్ వైష్ణవు డర్ధయోజనజటా... వంటి (ఆముక్త మాల్యద) పద్యములకు దీటైనదీ పద్యము. అన్వయం సులభీకృతం కాలేదని పాషాణపాక ప్రభువని విశ్వనాథుని సమకాలికులన్న మాటలు జ్ఞప్తికి వస్తాయి. కాని ఇట్టి ఓజోగుణ ప్రధాన రచనలు కావ్యము లందు ఔచిత్యవంతంగా ఉన్నప్పుడు సహజమే. "పనివడి నారికేళ ఫలపాకము నం జవియైన."(శృంగారనైషధం)అని శ్రీనాథుడూరికే సమర్థించడు గదా!

శా. హేరంబోన్నత శూర్పకర్ణ వివర ప్రీకారియై, షణ్ముఖ
స్ఫార ద్వాదశ నేత్రగోళ వివృతి ప్రాకారమై, శైల క
న్యారాజ న్నవ ఫాలమండల విభుగ్నక్రీడమై, యాశ్చల
ద్గీరుగ్ర ప్రమథంబుగా ధనువు ప్రోగెన్ శైవలోకంబులన్. 302

అర్థం: శైవలోకంబులన్=శివసంబంధ ప్రాంతములందు (=కైలాసగిరులందు), హేరంబ=గణపతియొక్క, ఉన్నత=పెద్దవైన, శూర్ప=చాటలవంటి, కర్ణ వివర=చెవి రంధ్రములకు, ప్రీకారియై=పగులగొట్టు=చిల్లులు పెట్టునదై, షణ్ముఖ=ఆరు ముఖములవాడైన కుమారస్వామియొక్క, స్ఫార= ప్రకాశమానమైన, ద్వాదశ నేత్ర గోళ=పన్నెండు కనుగ్రుడ్ల, వివృతి =విప్పార్చుటకు, ప్రాకారమై=అడ్డుగోడఐనదై, (కన్నులు గోడలు పెట్టినట్లు మూతలు పడ్డాయని భావం). (లేదా, ప్ర+ఆకారమై= విశిష్టాకృ తి కలదై గ్రుడ్లు విశేషంగా బయటకి ఆశ్చర్యం వల్ల వచ్చినవిగా కలదై), శైల కన్యా=పర్వతపుత్రి పార్వతీదేవియొక్క, రాజత్=ప్రకాశించు, నవ ఫాలమండల=నూతనమైన నుదుటి భాగము, విభుగ్న=పగిలిన, క్రీడమై= ఆట కలదై-నుదురు చిట్లించినదని భావం. (ఫాలభాగ క్రీడలు=నుదురు చిట్లింపులు), ఆస్=క్రోధపూత్కారంతో, చలత్=చలించు, గీః=శబ్దం చేత, ఉగ్ర ప్రమథంబుగా=కోపించిన ప్రమథ గణములు గలదిగా, ధనువు= శివధనువు, ప్రోగెన్=విరుగుటచే చప్పుడు ఆయెను.

తాత్పర్యం: శ్రీరాముడు ధనుస్సును విరుచుటచే పుట్టిన ధ్వని కైలాసలోకాన్ని అతలాకుతలం చేసింది. గణపతి చెవులు చిల్లులు పడ్డాయి. కుమారస్వామి కనుగుడ్లు పెద్దవైనాయి. పార్వతీదేవి నుదురు చిట్లించింది. ప్రమథగణాలు కోపించాయి.

అలం: ఒకే ధ్వని వివిధ వ్యక్తులకు వివిధంగా తోచింది కనుక ఉల్లేఖాలంకారము.

విశేషం: గణపతి చెవులు చేటలంత పెద్దవి. ఈ ధ్వనిని అవే భరించలేక పొయ్యాయి. ఆరుముఖాలవాని పన్నెండు కనుగ్రుడ్లు విస్ఫారమైనాయి. పర్వతం కూతురి ఫాలభాగం పగిలింది. లేదా చిట్లింది. లేదా శక్తిస్వరూపిణి, త్రినేత్రోజ్జ్వల, ఫాలభాగమందు కన్ను గలది, ఇతరుల వలె నుదురు చిట్లించలేనిది, ఈ ధ్వనితో చిట్లించింది. ప్రమథగణాలు చప్పుడు భరించలేక కోపించినారు. వారికీ చాపధ్వని కంటగింపైంది. లేదా శివుని విల్లు విరిచినందుకు శివుని అనుచరులకు అవమాన సంజనిత క్రోధం (ఆస్ = ఎవడురా విరిచింది అనే అర్థంలో ఫూత్కారంతో) పుట్టింది.

మిగతా పద్యాలలో (అనగా తక్కిన లోకాలలో) మనోజ్ఞమైన ఈ ధ్వని కైలాసంలోమాత్రం సంక్షుభితంకావడాన్కి, ఉగ్రంకావడాన్కి, క్రోధోద్వేవలం కావడాన్కి అది శివునిచాపం కావడమే.

శా. **నృత్యన్మంజుల తార హార కబరీ నిష్యంది ముక్తామణి**
**ప్రత్యగ్ర ప్రసవాక్షి సంకలన దీవ్య త్కంధరా భేద సా**
**హిత్య ప్రౌఢ నవాప్సరో నటన సాహిత్య ప్రశస్తాచ్ఛదృ**
**గ్గీత్యాకార మనోజ్ఞమై ధనువు మ్రోగెన్ స్వర్గలోకంబులన్** **303**

అర్థం: స్వర్గలోకంబులన్=దేవతల లోకములందు, నృత్యన్=నాట్యము చేయుచున్న, ముంజుల=మనోహరములైన, తారహార=సురటి ముత్యముల సరములు (అలంకరించిన), కబరీ=సిగలనుండి, నిష్యంది= జారుతున్న, ముక్తామణి=ముత్యములు, మణులు, ప్రత్యగ్ర= నూతనములైన, ప్రసవ+అక్షి=పువ్వులు, నేత్రాల, సంకలన=కలయికలో, దీవ్యత్=ప్రకాశించు, తంధర+అభేద=గొంతుల ఐకమత్యంతో, సాహిత్య ప్రౌఢ=వాగ్గేయాల సాహిత్యంలో (అర్థవిమర్శలో) శ్రేష్ఠులైన, నవ+ అప్సరః =తొమ్మండుగురు లేదా కొత్త (తరం). అప్సరసల, నటన= నాట్యమునకు, సాహిత్య=అనుకూలమైన (సుహిత భావము సాహిత్యము), ప్రశస్త=శ్రేష్ఠమైన, అచ్ఛత్=నిర్మలమైన, దృక్+గీతి+ఆకార =చూపులకు, గీతములకు, శరీర ఆకృతులకు, మనోజ్ఞమై=సుందరమై, ధనువు=విల్లు (విరిగి), మ్రోగెన్=ధ్వనించింది.

**తాత్పర్యం:** స్వర్గలోకంలో అప్సరసలు నాట్యం చేస్తున్నారు. వారి సిగలనుండి అలంకృతములైన పువ్వులు, ముత్యాలహారములలోని ముత్యములు, మణులు జారుచుండగా వాటితోపాటు కనుకొలుకులనుండి చూపులు జాలువారుచుండగా, గీతార్థములు బాగా తెలిసినవారై భావస్ఫోరకముగా అన్ని గొంతులు కలిపి పాడుతున్న ఆ అప్సరసల నాట్యమునకు అనుకూలమై, వారి చూపులు, గీతములు, శరీరాకృతులకు అందమునిచ్చే విధంగా ధ్వనిస్తూ విల్లు విరిగిన చప్పుడు వినిపించింది.

**విశేషం:** ఇంతకుముందు భీకరంగా వినిపించినట్లు వర్ణించబడిన 'వింటి విరిగిన ధ్వని' ఇక్కడ మనోహరంగా కనబడుతోంది. కారణం ధనుర్భంగం దేవతలకు ఆనందదాయకం. సీతాస్వయంవరణం, రావణవధకు కారణం అవుతుంది. (ఇంతకుముందు శివధనుర్భంగం శివశక్తి భంగ కారణంగా కైలాసానికి క్రోధదాయకం).

దేవతలు భోగప్రియులు. నృత్యం భోగలాలస పూర్ణం. ధనుర్భంగ ధ్వని సౌఖ్య చిహ్నమైన నాట్యానికి సహాయకారకంగా వర్ణించబడింది. ప్రసవాక్షులు పూలవంటి నేత్రాలు గలవారని చెప్పవచ్చు. ప్రత్యగ్ర ప్రసవాక్షులు అనగా నూతనులైన సౌందర్యవతులు (నాట్యకత్తెలు) (రంభాది సుప్రసిద్ధులుగాక కొత్తతరంవారు). ప్రత్యగ్ర ప్రసవ = కొత్తగా (అప్పుడే విరిసిన) పూలు, ప్రత్యగ్ర అక్షులు = కంటికొనల (జాలువారు) చూపులు అని రెండు అర్థములు కూడా చెప్పుకొనవచ్చును. నాట్యభ్రమణ వేగంలో ముత్యాలు, పువ్వులు వాటితోబాటే నాట్యకత్తెల చూపులు నిష్యందిస్తున్నాయి. నాట్యకత్తెలు బహుళ సంఖ్యలో ఉన్నా గొంతులు కలిసే పాడటం వల్ల ధ్వని సాంద్రమైంది. దానికి ధనువు ధ్వని 'మనోజ్ఞం'గా తోడైంది. సాహిత్యానికి సౌహిత్యమైన (అనుకూలమైన) నాట్యం వారిది. కారణం వారు తాము గానం చేస్తున్న గీతార్థమునకు చక్కగా తెలిసినవారు. నవ శబ్దానికి నూత్నములైన అప్సరసలన్నదే అర్థం. ఐనా బహుళసంఖ్యలో నాట్యకత్తెలున్నారని 'కంధరాభేద' అన్న సమాసముతో సూచించుటి వలన తొమ్మిది అన్న సంఖ్యార్థమును చెప్పుకొనవచ్చును.

**శా.** **దర్ప స్వీకృత హాస విశ్లథన, రుంధద్దుష్ట వాగ్ధోరణీ**
**సర్ప ద్వీర చమూపథ శ్లథనమై స్రంసత్కటీ శాటికా**

కూర్పాస ప్రకటోగ్ర సాధ్వస వధూ గుర్విణ్యభద్రాధ్వమై
దర్పాడంబరమై ధనుస్సు మొఱసెన్ దైతేయ లోకంబులన్. 304

**అర్థం:** దైతేయ=దితి తనయుల (రాక్షసుల), లోకంబులన్=రాజ్యములలో, దర్ప స్వీకృత=మదముచేత స్వీకరించబడిన, హాస=నవ్వును (అహంకార పూరిత పరిహాసాట్టహాసమును) విశ్లథన=చిన్నబుచ్చుచున్న(శిథిలీకృత మొనర్చుచున్నదై), దుష్ట=దుర్మార్గ లక్షణమైన, వాక్+ధోరణీ=మాటలాడే విధానాన్ని (ప్రేలాపనలను), రుంధత్ =రోదింపచేయుచున్నదై, (ఏడ్పించుచున్నదై) సర్పత్=నడచుచున్న (కవాతు చేయుచున్న), వీర=వీరులైన, చమూ=సైన్యముయొక్క, పథ= మార్గమును, శ్లథనమై=ఆపివేయుచున్నదై, కటీ శాటికా=నడుముకు కట్టిన వస్త్రములను, కూర్పాస=రవికలను (పై వస్త్రములను), స్రంసత్= జారివేయుచున్నదై, ప్రకట+ఉగ్ర=మిక్కిలి తీక్ష్ణమై, సాధ్వస= భయకారణమై, వధూ=రాక్షస స్త్రీల, గుర్విణీ+అభద్ర=గర్భవతుల గర్భమునకు, అభద్ర=రక్షణలేని (అమంగళ), అధ్వమై=మార్గమై (గర్భస్రావాదికముచే వంశక్షయ కరమైన అభద్రత్వమునకు కారణమై), దర్ప+ఆడంబరమై=దర్పముచేత గొప్పనైనదై, అతిశయించినదై, ధనుస్సు=శివధనువు, మొఱసెన్=శబ్దించినది.

**తాత్పర్యం:** శివధనుస్సు విరిగిన చప్పుడు రాక్షస లోకములలో ప్రతిధ్వనించినది. ఆ చప్పుడకు రాక్షసుల వికటాట్టహాసములు తగ్గిపోయినవి. ప్రేలాపనలు ఏడ్పులుగా మారినవి. కవాతు చేయుచున్న సైన్యము బిక్కచచ్చి ఆగిపోయినది. భయముతో బట్టలు ఊడిపోవుచున్నవి. భయపడిన రాక్షసస్త్రీల గర్భములు విచ్ఛిన్నమగుచున్నవి.

**విశేషం:** రాక్షసుల ప్రపంచమునకు శ్రీరామ ధనుర్భంగ విజయము అశుభకారణము. రామునకిది వైరిప్రపంచము. పైగా రాక్షసుల వరప్రదాత శివుని విల్లు విరుగుట మరింత అమంగళము. దానికి అనుగుణముగా పై వర్ణన.

**అలం:** దేహళీ దీపన్యాయమున (గడప మీది దీపం రెండు గదులకు వెలుగిచ్చినట్లు), ఒకే కారణభూత విషయము బహుళ ప్రయోజనములు నెరవేర్చినట్లు, ధనువుధ్వని అనేకరాక్షసలోక కల్లోలములకు కారణమైనట్లు వర్ణించుటచే దీపకాలంకారము.

శా. స్ఫీతాష్టాపద విద్యుదుజ్జ్వల, పయః పీయూష ధారా ధునీ
నీతాస్వాద్యతర ప్రగల్భ వచన, స్నిగ్ధాననాంభోజ సం
ధా తీర్థంకర, మాగధోల్బణము, నానా మేదినీ రాట్సభా
గీతి స్వాదు మనోజ్ఞమై ధనువు మ్రోగెన్ రాజలోకంబులన్. 305

అర్థం: స్ఫీత=అచ్చమైన, అష్టాపద=బంగారు, విద్యుత్=మెరుపుతో ఉజ్జ్వల= ప్రకాశించునదై, పయః=పాలు, పీయూష=అమృతముల, ధారాధునీ = ప్రవాహనదులను, నీత=తీసికొనిరాబడిన, స్వాద్యతర=మిక్కిలి రుచికరమైన, ప్రగల్భ వచన= ప్రౌఢవాక్కులు కలదై, స్నిగ్ధ = మనోహరమైన (నునుపైన), ఆనన+అంభోజ = కమలములవంటి ముఖములు సంధా=సంధించుటలో, తీర్థంకర=పవిత్రము చేయుచున్నదై, మాగధ = వందిమాగధుల, ఉల్బణము=అతిశయత్వముకలదై, నానా= అనేకములగు, మేదినీరాట్ = భూపతుల (రాజుల), సభాగీతి = సభలలో పాడే గీతములలో, స్వాదు మనోజ్ఞమై=మనోహరమైన రుచి కలదై, రాజలోకంబులన్=రాజుల సమూహములలో, ధనువు=శివచాపము, మ్రోగెన్=ధ్వనించింది.

తాత్పర్యం: వందిమాగధుల గాత్రరూపమున, వారి పాటలలో యశోగానమై పలురాజసభల రాజసమూహములలో శివధనువు మ్రోగింది. శివధనుర్భంగగాథ వారికి తెలిసింది. చొక్కపు బంగారంలా మెరుస్తూ, పాలు, అమృతము ప్రవాహ నదులవలె తియ్యదనమిస్తూ, ప్రౌఢమైన వాక్కులు కలదై, వారి మనోహర ముఖకములములతో ముక్త కంఠముతో పాడుటకు వారి గాత్రములను పవిత్రీకృతము చేయుచు, మనోహరమైన గాత్రరుచిగల్గిన వందిమాగధుల పాటలలో రాజసభలందు రాముని ధనుర్భంగ యశస్సు నినదించినది.

విశేషం: వందిమాగధుల శబ్దములు, పాటలు మంగళకరమైనవి. అమంగళములు పలుకరు. వారికి ఈ ధనుర్భంగ శబ్దము పాటకు, మాటకు శుద్ధత్వాన్ని ఆపాదిస్తున్నది అని అర్థం. లేదా వారి గీతములలో శివధనుర్భంగ ఘట్టము మధురమైన సాహిత్యమై నిలిచినదని చెప్పవచ్చును.

ఉ. మేలుగ గౌతమాశ్రమము మీదుగ నల్ల విశాల మీదుగన్
లోలత మౌనిలోక నృప లోకములం జనె వార్త రాముడు

ద్వేలభుజాభిరాము డరవిందలోచను డన్నవార్త యా
భీల సురారిమండల విభీషణమూర్తి యటన్న వార్తయున్. 306

అర్థం: రాముడు=శ్రీరామచంద్రుడు, ఉద్వేల=ఘనమైన, భుజ=పరాక్రమముచే, అభిరాముడు=అందగించుచున్నవాడు, అరవింద=కమలమువంటి, విలోచనుడు=విశిష్టమైన కన్నులు కలవాడు, అన్న వార్త=అనే విషయం, ఆభీల=భయంకరమైన, సుర+అరిమండల=దేవతల శత్రువులైన రాక్షసులలోకానికి, విభీషణమూర్తి=విశిష్టంగా భీకరమైనవాడు, అట+అన్నవార్తయున్=అవుతున్నాడట అనేవార్తకూడా, మేలుగ=చక్కగా, గౌతమ+ఆశ్రమము మీదుగ=గౌతముని ఆశ్రమము చేరి, అక్కడినుండి, అల్ల విశాల మీదుగన్=మెల్లగా విశాలాశ్రమముల మీదుగ, లోలత=మెల్ల మెల్లగా కదలాడుచు, మౌనిలోక=మునుల సమూహములలో వ్యాప్తమై, నృపలోకములన్=రాజసమూహములలో, వార్త=విషయము, చనన్=ప్రాకెను, వ్యాప్తమయ్యెను.

తాత్పర్యం: రాముడు అందమైనవాడు, పరాక్రమవంతుడు, రాక్షస భయంకరమూర్తి అన్న విషయము గౌతమాశ్రమమునకు, ఆపై మిగిలిన ఆశ్రమములలో, మునులలో, రాజలోకములలో ప్రాకింది.

విశేషం: మిథిలకు స్వయంవరమునకు వచ్చుటకు ముందు రాముడు గౌతమాశ్రమము దర్శించుటచే, ఆశ్రమము సన్నిహితమని శాపవిముక్తయైన అహల్యకు ధనుర్భంగవార్త శుభకరంగా తొలుత తెలిసిందని, ఆపై అంతటా తెలిసిందని సారాంశం. ధనుర్భంగంవల్ల మహా పరాక్రమవంతుడని, ఇంతకుముందే తాటకాదుల వధవల్ల సురారిమండల భీషణుడని మరిన్ని కథాంశములు (ఒక విచిత్రమునకు మరిన్ని విచిత్రములు కల్పి) జోడించి ప్రజలు, మునులు, రాజులు చెప్పుకున్నారన్నమాట.

గీ. ఎంతవరకు ధనూరావ మెల్లదిశల
నప్రతిహతమ్ముగ నార్చె నంతవరకు
జనములెల్ల దిమ్మెక్కిన శ్రవణకుహర
బలవివశమానసులు నిలంబడిరి శిలలు 307

**అర్థం:** ఎంతవరకు=ఎంత దూరం, ధనూరావము=శివధనుర్భంగ ధ్వని, ఎల్లదిశల =దశదిశల (నాల్గుదిక్కులు, నాలుగు మూలలు, పైన, కింద మొత్తం పది వైపుల), అప్రతిహతమ్ముగ=అడ్డులేకుండా, అర్చెన్=ధ్వనించిందో, అంతవరకు=వినిపించినంతమేరకు, జనములు+ఎల్ల=ప్రజలందరు, దిమ్ము+ఎక్కిన=గడెలుపడిన, శ్రవణకుహర=చెవిరంధ్రముల, బల వివశ మానసులు=శబ్దబలముచేత వశముతప్పిన మనస్సులతో, శిలలు= అచేతనస్థితిలో రాతివిగ్రహములవలె, నిలంబడిరి=నిలుచుండి పొయ్యారు.

**విశేషం:** శిలలవలె కాదు శిలలే. ధ్వని పెద్దది కనుక చెవులు దిమ్మెక్కాయి. ధనుర్భంజనం విశేషం కనుక మనసులు వశం తప్పాయి. శబ్దం దూరం ఐన కొద్ది దాని బలం తగ్గుతుంది. దగ్గరివారికి కల్గినంత భీకర శ్రవణం దూరంగా ఉన్నవారికి కలుగదు. కాని ఇక్కడ ఎంతవరకు ధ్వనించిందో అంతవరకూ జనాలలో చేష్టలు లేవన్నది విశేషం. అతిశయోక్తి సౌందర్యము.

ధనుర్భంగఘట్టములోని ఈ ఏడు పద్యములు సప్తాశ్వములవలె జగద్భ్రమణము గావించినవి. వీనిలో ఐదుపద్యములకటి, చివరి రెండు ఉపశ్రుతి. మొదటి ఐదు పద్యముల ఛందస్సు శార్దూల విక్రీడితము. ఉత్పల, గీతులతో ఉపశ్రుతి. కల్పవృక్ష ఛందః ప్రయోగము వ్యూహాత్మకము. పనిగట్టుకొని వర్ణించిన ప్రౌఢ రచన తొలి ఐదు పద్యములు. శబ్ద కాఠిన్యము ఉన్నదికాని అన్వయ కాఠిన్యము లేదు. అన్వయ కాఠిన్యముతో నారికేళాది పాకవిభజన. శబ్దము బహుధావాడి సర్వులకు తెలిసినపుడు కాఠిన్యము ఉండదు. తెలియనపుడే కఠినమన్న భావన. తెలుగు కొనుటకు ప్రయత్నించవలెను. లేనిచో శ్రీనాథుడన్నట్లు "సోమరిపోతులు కొందరయ్యలు కొనియాడనేరరు". కవి అందరికి తెలిసేలా రాయాలంటారు. అలా రాసినా మరికొందరు తెలియనివారు ఉండనే ఉంటారు. కవి ఎంతవరకు దిగి రావాలి? మనమే పైకి ఎక్కాలి. కవి ప్రయోగ బాహుళ్యమును, శబ్దచమత్కృతులను, పసిగట్టాలి. కోశజ్ఞానము పెంచుకోవాలి.

మొదటి పద్యంలో ధనుర్భంగధ్వని ఆకాశంలో మ్రోగింది. తరువాతి పద్యంలో కైలాసంలో, తరువాతి పద్యంలో స్వర్గంలో, ఆపై రాక్షస లోకంలో, ఐదో పద్యంలో రాజ(భూ)లోకంలో మ్రోగింది. ఇవన్నీ సంచలిత, సంక్షుభిత లోకాలే. ఆరోపద్యం మాత్రం ఈ ధ్వనివల్ల లభించిన ఫలం శుభకరంగా గౌతమాది ఆశ్రమాల మీదుగా సాగింది. భూలోకమంతా వ్యాప్తమయ్యింది.

ఒక ఘట్టంలో ఒకే రకమైన ఛందస్సు, ఒకే శైలి (పదారోపణ), ఒకే మకుటం శోభనిస్తుంది. శైవలోక, స్వర్గలోక, దైతేయలోక, రాజలోకములన్నవి (వివిధ లోకాల్లో ధ్వని చేరిందని రాసినా) మకుట లక్షణముతో శోభించినవి. అన్నీ పద్యాంత పదబంధాలే. ముక్తక పద్యాలను ముడివేసేది మకుటం. ఈ మకుట ప్రయోగంతో ఈ ఐదుపద్యాలు ఒక సంపుటి అని కవి భావన. ఈ నిర్మాణచాతుర్యం నన్నయ ఉదంకోపాఖ్యానంలోని నాగస్తుతి పద్యమాలలో 'మాకు ప్రసన్నులయ్యెడున్' అన్నచోట కన్పించును. నన్నయగారి ఈ నిర్మాణ వైచిత్రిని విశ్వనాథవారే ప్రకాశమానం చేసినారు. తిరిగి ఇక్కడ తానూ చూపినారు.

# నేనే నా దేశం

- డా॥ అద్దేపల్లి రామమోహనరావు

తూర్పున ఉదయించే సూర్యుడు
నా దేశానికి శాశ్వత ప్రతీక
ఎక్కడికెళ్ళినా నాపై నీడను వర్షించే చెట్లు
నా వ్రేళ్ళు గీసిన అద్భుత భావచిత్రాలు
నా శరీరాన్ని చుట్టుకున్న గీతలు
దేశాంచలాల్ని యిముడ్చుకున్న పదధ్వనులు

పడమటి సూర్యుణ్ణి
అస్తమించనీ అస్తమించనివ్వనని
అరుస్తున్న ఆకాశాన్ని చీకట్లో పాతిపెట్టి
నెత్తురు చిందిస్తూ తెచ్చిన నవోదయాన్ని
తూర్పున ప్రతిష్ఠించిన వీరులందరూ
ఈ రోజు నా కంటి దీపాలై
నాకు దారి చూపుతున్నారు

నిన్నటి జ్ఞాపకాల్ని
దారిలో జారిపోనివ్వద్దని

నేటి సంతకాన్ని వ్రేళ్ళతో కాదు హృదయంతో చెయ్యమని
రేపటి జీవితాన్ని
దేహంతో కాదు దేశంతో నడపమని
సూర్యకిరణాలతో మట్టిమీద రాస్తున్నారు

తూర్పున సూర్యోదయాన్ని మాత్రమే
చూడగలడు సామాన్యుడు
పన్నెండుగంటల తర్వాత
సూర్యుణ్ణి పూడ్చిపెట్టే
పడమటి గోతిని కూడా చూడగలడు కవి

కాలమహా కావ్యంలో
నన్ను నన్నుగా చేసిన నిన్నటి పత్రాన్ని పారెయ్యలేను
చెదలు పట్టిన పత్రాలు
ఈనాటివైనా తొలగించక దాచుకోలేను
ఈనాడు పల్లె పట్టణాన్ని ప్రేమిస్తోంది
పట్టణం నగరాన్ని ప్రేమిస్తోంది
నగరం మరెవర్నో ప్రేమిస్తోంది
మనిషిని ప్రేమించే మనిషి మాత్రం
తన ముఖం తనకు కనిపించక
ద్వేషాన్ని ప్రేమిస్తున్నాడు

ఇవ్వాళ పూలు పరిమళాలకు విడాకులిస్తున్నై
అర్థం పాటకు విడాకులిస్తోంది
వస్త్రం దేహానికి విడాకులిస్తోంది
అన్నిటితో కలకాలం వ్యాపారం చేసే
చెక్కు చెదరని వ్యాపారం మాత్రం
అన్ని ఆకుల్నీ విడివిడిగా నమిలేస్తోంది

దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్

అని గురజాడ అన్నాడు గాని
మట్టినిండా మానవరక్త మొలికించి
ముద్దలు ముద్దలుగా మింగేవాళ్ళని చూస్తే
దేశమంటే మట్టేనోయ్ అనిపిస్తోంది

ఔను దేశమంటే మట్టికూడా
అది నెత్తురులో తడిసిన మట్టికాదు
నీ జీవశక్తిని పాతి
చెట్లుపై మొలకెత్తే మట్టి
మట్టిని మరచిన యాంత్రిక జీవితం
మనిషిని తలకిందకీ కాళ్ళుమీదకీ నడిపిస్తుంది
యంత్రాలతో ఎన్ని పనులైనా చేయించుకోవచ్చు
సంతకం చెయ్యవలసింది మాత్రం మనిషే!
ఎన్ని భాషల్నైనా ఒంటిమీద పూసుకోవచ్చు
దెబ్బ తగిలితే అమ్మా అని ఏడవవలసింది తెలుగు భాషలోనే!

నా దేశం
మానవ అనుబంధాల మహనీయ సంకేతం
సాంస్కృతిక సంబంధాల అసమాన సందేశం
నేను నా దేశంలో ఒక చెట్టును
నా కోకిల నా కొమ్మమీద పాడినప్పుడే
నా నరనరాల్లోని వసంతాలు
కొత్త చిగుళ్ళ మీదుగా నడిచి వస్తై

నేను నా దేశపు మట్టిని
నా రైతు చెమటచుక్క
నా తలమీద పడగానే
ఆకుపచ్చని సజీవ సముద్రమౌతాను

కత్తుల్నీ తుపాకుల్నీ యుద్ధాల్నీ తిని
నెత్తురులో జీర్ణంగాక

ఆయాసపడి తూలిపోతున్న కాలమా
నీ చేతిలో ఒక గరిమెళ్ళ పాటనీ
ఒక జాషువా పద్యాన్నీ
ఒక గాలిబ్ గజల్‌నీ పెడతాను

నువ్వు నిటారుగా నిలబడి
స్వేచ్ఛావాయువులు పీలుస్తావు
నీ చుట్టూ అపూర్వ మధురస్వరాలు
పల్లవిస్తాయి
నువ్వు నడిచే దోవనిండా
గులాబీ అత్తర్లు గుబాళిస్తాయి

నా దేశం నా దేశంగా
ఊపిరి పీల్చుకుంటుంది
అప్పుడు నా దేహమే
ఈ దేశ పతాకగా ఎగురుతుంది.

## సావుకీ బతుక్కీ మద్దెన ...

- వేంపల్లి అబ్దుల్‌ఖాదర్

గండశిలో, పీడకలో
రెక్కలు చాచిన రాబందో
మిటకరించే బంతజెముడు చెట్టో
మూగబోయిన కోయిల గొంతో
ముతాకోరు నెత్తిటికత్తో
కడుపులు కాల్చే కరువు రాకాసో కాదు

సీమంటే
ఒగ కాయకట్టం -
ఒగ కైతాచ్చరం -

ఒగ మొండి దయిర్నం -
ఒగ బుంగ నేలమళిగ నిచ్చేపం -
ఒగ సనుబాల వాచ్చల్యెం -

నేను ... వొట్టి మొండినాకొడుకును
బండరాతి పొరల్ని చీల్చుకొని మొలిచిన జువ్విచెట్టును
వొందుమన్ను ఏరకతినే జముడు కాకిని
సిగుల్లను ఇడిసిపెట్టి
ఎండిన మోళ్ళని కొరికే రాతికోయిల్ని
వొడ్డీ కుప్పల మింద కూసోని
అప్పుల కొరివి దెయ్యం బయపెట్టినా
కడతేరని కడగండ్ల మద్దెన
వడగండ్లవాన కురిసి కూలదోసినా
సిర్నవ్వు సెదరకుండా రొమ్మొడ్డినానే గానీ,
'అలో లచ్చునా' అని వలసబాట పట్టాలా -
బోరుబాయిలో జల పడనంత మాత్రాన
బతుకు రోసి పురుగులమందు తాగలా -
చెట్టుకొమ్మకు ఉరేసుకోని యాలాడలా -
సెమరేసుకోని సూస్తే ఇప్పుడు
బమ్మకట్టినట్ల బమ్మకు బమ్మ కండ్లముందరి కొస్తంది ...
తలసెడిన తోడబుట్టు మణుసునొచ్చి
నా నట్టింట అడుగు బెట్టిననబ్బుడు గానీ -
గెడ్డీ గ్యాదం దొరక్క
జలగసొంటి ఏర్లు పీక్కతిని
ముసలిగొడ్డు కడుపుబ్బి సచ్చినబ్బుడు గానీ -
ఎన్నముద్ద పడేయాళ కడవ పగిలినట్లు
చేతికి అందొచ్చిన బిడ్డను
ఇసపురుగు పొట్టనబెట్టుకన్నెబ్బుడు గానీ -
... కొండారెడ్డి బురుజు లెక్కన
మీసం మెలేసి మొగలాయిగా నిలబడినానేగానీ
దిగులు బంత బుజానేసుకోని కూలబడిపోలా -

మొగం సిట్లించకుండా
ఆరు రుతువులతో అచ్చనగాయలు ఆడతానే ఉండా –
వొంచిన నడుం ఎత్తకండా
మొన్ను పిసికి సెమట్లు రాల్చతానే ఉండా –
దలారీ టక్కరి నక్కల ఇగితి మాటలకు
ముక్కమునగా మోసపోతానే ఉండా –
యా ఏటికాయేడు ఎన్ని నట్టాలు వొచ్చినా
యవసాయంతో ఎడతెగకుండ జూదమాడతానే ఉండా –
ఎబ్బుడు మెరిసినా ఉరిమినా
ఆశగా ఆకాశం పక్క ఎగచూస్తానే ఉండా –
దెగ్గిరికి రానేరాకండ
సావుని సావమని సావగొడతానే ఉండా –

ఇంగ జెప్పేదేముంది? ...
పోరకలాడతానే అబ్బుడు కండ్లు తెరిసినా
ఇబ్బుడు
పోరకలాడతానే కండ్లు మూస్తా –
అంతేగాని ... నేను
చీమ సిటుక్కుమంటే
లటుక్కున ఉరోసుకునే పిరికి నా కొడుకునుగాను.
నేను ... కరుకేగానీ పిరికదనం తెలీని
పదునెక్కిన గుబ్బంకొండ పట్టాకత్తిని
బతుకంటే అరతం పోరాటమేనని చెప్పే
పులిగడ్డన పుట్టిన సీమబిడ్డని –
నూరుకోట్ల నా అన్నదమ్ముల చిరునవ్వుల కోసం
పిడికిలిమట్టిని పైకెత్తి
ఇది సొరగం కంటే గొప్పదని
చాటి చెప్పిన సాక్కం పోతుగడ్డ బిడ్డని!

"మనిషి తోటలు పెంచుకోవాలి; బయటకన్నా ఎక్కువ తన లోపల.
కవిత్వంలాంటి ఆ తోటల్లో ఒక నెమిలి సిమిలీలా నర్తించాలి." – శేషేంద్ర

# ఒక ఎండరోజు

- భగ్వాన్

ఎండ పొద్దున్నే పేల్చేస్తోంది
డయ్యరు పిస్తోలూ బుస్సీ తుపాకీ రూదరఫర్డ్ ఫిరంగీ ఇవన్నీ
ఈ ఎండ ముందు బలాదూర్ -
ఇళ్ళెక్కి ఎండ భస్మాసుర నృత్యం చేస్తోంది
సాయంత్రం బీచ్‌లా బిజీబిజీగా ఉండే మా ఊరి సెంటరు
ఎండపోటుకు
దొంగలు దోచిన బాంకు లాకరులా ఖాళీ ఖాళీగా ఉంది
ఎండతో జతకట్టిన ఆకాశం
మా ఊరిని గుటుక్కున మింగేందుకు తయారైన భూతంలా ఉంది

* * *

బస్సు కోసం షెల్టరులో కూర్చున్న యువతీ
ఆమె భుజం మీది పసికందూ -
ఉదయం నుంచీ బేరం దొరకని రిక్షా అబ్బీ అతని డొక్కు రిక్షా -
ఫోటోల్ని కడిగి ఆరబెడుతున్న స్టూడియో అతనూ
అతని చేతిలోని ఫోటోలూ -
బూరా శబ్దం చేస్తూ అటు ఇటూ తిరుగుతున్న ఐసబ్బాయీ అతని
ఐసుబాక్సూ -
ఇంగ్లీషు మీడియం కాన్వెంటు పిల్లాడూ వాడి వీపు మీద సంచీ -
సైకిల్‌పై కాలేజీకెడుతున్న లేతపచ్చ పంజాబీ డ్రెస్సమ్మాయీ
ఆమె వెంట పడుతున్న నూనూగు మీసాల కుర్రాడూ -
వేంగా వచ్చి రోడ్డు పక్కన ఆగిన బస్సూ
దాని వెనుకే లేచిన దుమ్మూ -
అంతా ఎండ వాసన వేస్తోంది
మండుతున్న ఈ ఎండలో ఒక్కో మనిషీ ఒక్కో అగ్నిశిఖ

* * *

పంపుల చెరువొడ్డున చెట్టుకు వేలాడే
తలకింది పక్షుల గుంపెక్కడికి పోయిందో ...
పరమశివుని గుడిముందు మోరపైకెత్తి నిలబడే పిల్లలనేస్తం
బట్లఆంబోతు ఎక్కడ దాక్కుందో ...
ఎదురింటి సంగీతం మాస్టారి శిష్యురాలు
ట్యూషన్‌కింకా రాలేదు, అసలస్తుందో రాదో ...
వీథిలో నిలబడి భేతాళుడిలా అందర్నీ
సవాలక్ష ప్రశ్నలతో భయపెట్టే పక్కింటి బామ్మగారు
ఇవాళ ఇంటి తలుపు తీస్తుందో లేదో
వీథి ముఖం చూస్తుందో లేదో ...
రోజూ నేనెదురైనప్పుడు దారిలో ఓ ముసలాయన
మాస్టారూ బాగున్నారా అని పలకరించేవాడు
ఆ ఆత్మీయం ఇవాళ దొరుకుతుందో లేదో ...

* * *

పొలాల నడుమ అనకొండలా జారిపోతున్న
మలుపు మలుపుల పంట కాలవలో పారేది నీరు కాదు, ఎండే
కరకు ఎండ -
చేల మీంచీ చేపల చెరువు మీంచీ జుయ్ జుయ్ మంటూ
నా చెవులు కొరికేది గాలికాదు, ఎండే
కసాయి ఎండ -
రోడ్డు దాటుతున్న గుడ్డి బిచ్చగాడి చేతికర్రను
యాక్సిడెంటులా భయపెట్టేది లారీ కాదు, ఎండే
కత్తి పదునులాంటి ఎండ -
అంత ఎర్రటి ఎండలోనూ నడిరోడ్డు మీద చకచకా నడిచిపోతున్న
ఆ ముసలమ్మ బోసి పాదాలకు నమస్కరించకుండా ఉండలేను

* * *

మా ఇంటికీ నా బడికీ మూడు మైళ్ళ దూరం
సైకిల్ తొక్కుతూ పోతుంటే

జాతరలో నిప్పుల గుండం తొక్కుతున్నట్టుగా ఉంది
బడి సమయం గుర్తొచ్చిన కంగారులో నాకు
ఫెడలు ఫెడలుకీ ఎండ అడ్డం పడుతోంది
సడన్ బ్రేకుతో ఆగిన ఆటోడ్రైవరు అడ్డొచ్చానంటూ
నన్ను ఎండలా కరిచాడు
అయిదు నిమిషాలు ఆలస్యమైందని
మా హెడ్మాస్టారు నన్ను ఎండలా కసిరారు
తరగతిగదులన్నీ ఎండలతో నిండిపోయాయి
మధ్యాహ్నం పూట కేరీజీలు విప్పుకుని విద్యార్థులు
ఎండను భోంచేశారు
క్లాసులో లెక్కలు చెబుతున్నంత సేపూ
పిల్లలు నన్ను ఎండలా ఫీలయ్యారు
బడి ఆటస్థలం చివర గుడిసెల్లోని పిల్లలు కొందరు
సగం సగం దుస్తులతో
అంత ఎండ తుఫానులోనూ హాయిగా ఆడుకుంటున్నారు
వాళ్ళని చూస్తుంటే బాంబులకు బెదరని
ఇరాకీ బాలలే గుర్తుకొస్తున్నారు

* * *

అందరి వాచీలకూ సమయం అయిదైనా
ఎండకు మాత్రం ఇంకా సాయంత్రం కాలేదు
ఎండతో కుస్తీ పట్టీ పట్టీ అలసిపోయిన చెట్లు
పిందెల్నీ పిట్టల్నీ టపటపా రాల్చుకుంటున్నాయి
అమ్మవారి గుడి ముంగిట ఉయ్యాల స్తంభం మీంచి
ఎండ వేలాడుతూనే ఉంది
వందేళ్ళనాటి మర్రిచెట్టు ఊడలు పట్టుకుని
ఎండ ఊగుతూనే ఉంది
బజ్జీల బండి ముందు ఆకలైన అనాథ బాలిక చూపుల్లో
ఎండ సలసలా కాగుతూనే ఉంది

* * *

నా బడి నుంచి మా ఇంటికి మూడు మైళ్ళు
శరీరం మీద ఎండతట్టులు మోసుకుంటూ
చెమటలతో బట్టలు తడుపుకుంటూ ఇంటికొచ్చిన నాకు
నా ఇల్లాలూ పిల్లలూ విసనకర్రల కత్తులు దూస్తూ
ఎండ విలన్‌తో యుద్ధం చేస్తూ కనబడ్డారు
సాయంత్రం సమయానికి ఎలాగోలాగ
రాజు మేడక్కగలడేమో కానీ గువ్వ గూడెక్కలేదు ....
రాత్రి పడుకునే వేళయినా
ఎండ ఇంకా క్రూర వికటాట్టహాసాలు చేస్తూనే ఉంది
ఇంతలో ఫోను, ఎండ దెబ్బ తగిలిన కాకిలా అరిచింది
మా ఊరి నుంచి నా తమ్ముడు వణుకుతున్నగొంతుతో అంటున్నాడు
'అన్నయ్యా! అమ్మకు వడదెబ్బ తగిలిందిరా
సీరియస్, వెంటనే బయల్దేరు'

*('వార్త' ఆదివారం, 23, జూన్ 2006)*

# డా॥ రాజేశ్వరీ దివాకర్ల కవితలు

## 1. బంధం

పసుపు గడపకు కుంకుమ మిగిల్చి
తాను వచ్చిన పనిని తీర్చుకుని
ఆమె వెళ్ళిపోయింది
అనుభవ గుప్తమైన నవ్వు
అతని బుగ్గగుంటల్లో పాలిపోయింది
ఎంతో పదిలంగా వేసుకున్న కొంగుముడి
ఊహ కందనంతగా బిగుసుకుని పోయింది

చిన్ననాటి నెచ్చెలి
గుండె పూసిన గులాబీ

ఏకాంత జాయ పరిమళమై
కళ్ళకొసల కెంజాయ రేకులు విప్పింది.
ఆమె కన్నబిడ్డలు
వాగులు, తోటలు
మేటిగట్టు వెన్నెల బాటలు
పరచుకుని వచ్చి
అమ్మ చనువును తలచి
నేర్పు చూపారు.

జానపద లోయల్లో
వీరగాథలు ఏరుకుంటూ
కావ్య పరిచర్యల్లో
కవిత్వానికి పట్టం కడుతూ
రసజ్ఞతతో తనకు తాను
మీరి వస్తూ
బతుకు కష్టసుఖాలను
ఏమరక ఆనుకుంటున్నపుడు
కాలం అతని శీర్షాన్ని తాకుతూనే
ఆలోచనలను ఏమాత్రం పండించలేక
ఓటమితో వెనక్కు తగ్గలేక
కసిగా
వాగర్థ సంచయంలో
తాత్పర్యాన్ని కాటేసింది.

అతనికి మీటింగు పెట్టాలంటే ఇప్పుడు
ఆరడి చేసేందుకు ఆవిడ లేదు
ఒకవేళ
మెడలో వేసిన దండను
ఇంటికి తీసుకుని వెళ్ళినా
కరకు దారం తప్ప
మృదు కరస్పర్శ దొరకదు

పుణ్యస్త్రీగా ఆమె తీర్చుకుంది ఋణం
అతనికి ఏపని చేద్దామన్నా
వీడదు ఆమె స్మరణం
ఎలిజీగా మారింది అతని కలం
అక్షర మంతటా ఆవరిస్తుంది
ఏడు జన్మల బంధం.

## 2. రంగి

నా ఎదురు చూపుల కిటికీ కళ్ళకు
రంగి వచ్చిన అలికిడి
వాకిట రంగవల్లుల సద్దుతుంది
అచ్చమైన ఉషోదయమౌతుంది.
నా వదులు భుజాల
రాత్రి ఉడుపులకు
రంగి నడుం బిగించి కట్టిన నూలుచీర
కుచ్చిళ్ళ వరుసల ఒద్దికను చూపుతుంది.
నా దిగులు దినచర్యల ఇంటి చాకిరిని
రంగి ఒత్తుగా కట్టిన జుట్టుముడి
తల కెత్తుకుంటుంది.
నా అల్లరి పిల్లల చిందర వందర గదిని
రంగి సద్దుచేయక సద్దిపెడుతుంది.
నా ఆరోగ్య సూత్రాల
దేహ వ్యాయామానికి
రంగి తదేక నిష్ఠతో
పరిసర లావణ్యమిస్తుంది.
నా నాజూకు సమయాల నాగరికతకు
రంగి జానపదమై విస్తరిస్తుంది.
నా ఏకాంత మగ్నతల
ఇరుగు పొరుగు దూరాలకు
రంగి మాటా మంతీ కలగలుపుల

జనబంధం కలిగిస్తుంది.
రంగి కొంగునంటి నడచి వచ్చే
మమతల నలుసు తొలిబిడ్డకు
బడి చదువుల చనువు నందించానంటే చాలు
కొమ్మ కాసిన పుల్ల చింతకాయకు
జీవన రుచుల లవణం తగిలినట్లు
ఋణశేషం నిలుపుకుంటూ
నాకు బాకీ పడుతుంది.
నా నాలుగు చేతుల అధిక వినియోగానికి
రంగి ఆధి భౌతిక ఆలంబనమిస్తుంది
నన్నందుకోలేనట్టుగా ఒదిగి ఉంటూనే
నా కంటె ఉన్నతమౌతుంటుంది.
నేనిచ్చే అరకొర ఆదాయానికి
నమ్మకమైన విలువను పెంచుతుంటుంది.
భిన్న సందర్భాలకు చూపుతున్న
ఎదురు బదురు అద్దాలను
ఏకరూపమేదో కలుపుతుంటుంది.

## 3. కాయదింపే కుర్రాడు

కాయదింపే కుర్రాడు
నా స్వార్థఫలాపేక్షకు చిక్కాడు.
కడుపాకలిని కలిగినవాడు.
నా చురుకు కళ్ళకు తగిలాడు.
చెట్టు నెక్కమన్నదే తడవుగా
గాలి తిత్తిలా ఎగిరాడు.
వాలుగా, వీలుగా
కడ కొమ్మల నంటి
కసరుపడ్డ చేతులతో
కాయ గుత్తులు దించుతుంటే
అతి చవుకగ దొరికిన లాభానికి
తెగమురిసాను.
వీథిబాలుని శ్రమను
ఎరవేసి లాగానని
సొంత తెలివికి తల ఊపేటంతలో
మిన్ను విరిగింది.
భూమి అంచుకు
రక్తం చిట్లింది.
జారిపడిన జాలిపిల్లాడు
గుడ్లు తేలవేస్తుంటే
కఠినశిల కరిగి
పాదాల అడుగున జలదరించింది.

ఇన్నినాళ్ళు భద్రంగా పెరిగిన
పట్టణ పూజ్య నాగరికత
నా కెదురు తిరిగింది.
సుత్తిమెత్తని దయ
అంకురించింది.
తొట్ట తొలిసారిగా
నా కడుపున వెన్నెల కాయించిన

నా మానస పుత్రుని
ఒడికి చేర్చుకున్నా
అక్షయమ్మైన విద్యనిచ్చి
అక్షర దత్తుని కావించుకోవాలని
ఎద సందడి నొద్దిక చేసి
ముందుగా మంచి
వైద్యానికి తరలించా.

"నేనొక పాటని!
అడవిలో సరిగమలల్లుతూ
ముత్యాలగుంపుల్లా పరుగెత్తే వాగుని!
నీలిమలో మధురిమ చల్లుతూ
రెక్కలమీద తేలిపోయే పక్షిని!
తోటలో వసంతం - గుండెలో గ్రీష్మం
ఎటుపోవాలో తెలీని బాటసారిని!"

---

"ఆకాశం రమ్మంటోంది
చెట్ల సందుల్లోంచి, ఇళ్ళ కప్పులమీంచి
కొండశిఖరాలెక్కి, మేఘాల గుంపుల్లో దూరి
రమ్మంటోంది!
ఋతువుల యుద్ధాల్లో
ఎన్నిపూలు నేలకు రాలాయో చూపిస్తోంది
పక్షిలేని తోటనించి పొమ్మంటోంది
ఒక చంద్రుణ్ణిస్తా నీ ఆత్మ చప్పరించటానికి
రమ్మంటోంది!"

- శేషేంద్ర

# REQUIEM

- AMBIKA ANANTH

Ensconced in a
ruthless womb
thrown out
with disgust,
she became a mauled
disfigured ball of gore
her tiny body
wrapped in a ruddy shroud
got mingled with the rot of the world

If she had stayed on
for the full term
as intended by Nature,
she would have seen
the light of the world
she would have smiled
The most cherished
baby smiles,
she would have prattled
The most loveable baby words
she would have
played with a rightful abandon
chasing the butterflies,
peering into the nest of fledglings,
filling dance in her steps ...

But
the very breath that whispered
in sweet 'lubdubs'
sternly pronounced
her death sentence
to die a breathless death,

The doorway to life got closed
Her tale remained untold ...

the manuscript was torn ...
but a requiem to her was worded
without any qualms ...

"God, bless my mother
to bear only sons
lest she turns a
murderer again"
cries her anguished soul ...

*(In the vicinity of a private hospital in Patiala district, a well yielded 50 dead foetuses, all female - This is a tearful tribute to the girl-babies gone).*
*(Courtesy: Deccan Herald, August, 5, 2007)*



# పక్షి

- వి.ఆర్. విద్యార్థి

రెక్కల తెరచాపనెత్తి
నిరంతరం
గగన సముద్రంలో
ఈదే పక్షికి
ఖగోళమంతా
సుపరిచితమేగదా!
ఖండాంతరాలన్నీ
తన మాతృభూములే గదా!

దానికో ఇంటి దిగులా?
దేశం బెడదా?
జనం మెడలకు
రకరకాల
కట్టడిముళ్ళు బిగించి
నమ్మకాల మత్తులో ముంచి
రాజ్యం చేయాలనే
తపనా?
సాగిలింపజేసుకోవాలనే
కుత్సితమా?

ప్రపంచంలో ఏమూలా
తనకు పరాయిది కాదుగదా!
పలుకబడే ప్రతిభాషా
తనకు మాతృభాషేగదా!
వికసించిన ప్రతి సంస్కృతీ
తన ఆహార్యమే గదా!

లిఖించబడిన చరిత్రల
సారాంశం మాత్రం
దానికి తెలీదనా

ఆకార నిరాకార దేవతలూ
ప్రార్థనలూ ప్రవచనాలూ
లోకశాంతి పూజ్యానికే గదా!

దాన్ని దేశదిమ్మరనండి
వెర్రి బాగులదనండి
మరెలాగయిన్నా పిలవండి
దానిదారి దానిదీ

అది ఎగురుతూ ఎగురుతూ
ఓ శూలమ్మై దూకి
సముద్రాల
లోతును తాకగలదు
ఓ గులకరాయియ్యై పొరలి
పర్వతాల
ఎత్తును కొలవగలదు
ధ్యానముకుళమ్మై మొలచి
అనంతపు
ఆత్మగా వికసించగలదు

అది వెన్నెల రాత్రుల్లో
శశాంకునకు
చెల్లెలు కాగలదు
ఉభయ సంధ్యల్లో
సూర్యుడి రథచక్రమ్మై
పరుగెత్తగలదు
పట్టపగలు పరుగెడుతూ
మబ్బుల్ని పోగుచేసి
పుడమి తల్లికి
జీవం పోయగలదు
చీకటంటే మాత్రం
దానికి గిట్టదు
అది ఎటు తీసుకెళ్తుందోనని
దానికి అనుమానం

పక్షి ఎప్పుడైనా
గుక్కెడు నీళ్ళ దాహాన్ని
మీరిందా?
గుప్పెడు గింజల ఆకల్ని
దాటిందా?
అసలెప్పుడైనా అది
ప్రాణధర్మం విస్మరించిందా?

బావి మాత్రమే
ప్రపంచమనుకుని
తాను మాత్రమే
ప్రవక్తనని
హెచ్చులు పలకడం ఆపి
విర్రవీగడం మాని
ఆత్మావలోకనం గావిస్తే
నింగిలో ఎగిరే తానూ
నూతిలో బతికే మండూకమూ
ఒక్కటేనంటుంది పక్షి
సృష్టి అంగాలమేనంటుంది మెచ్చి!

*(వాకేశా, ఏప్రిల్ 18, 2006)*
*(ATA9 సావనీర్ 'కబురు'లో ప్రచురితం)*



# యస్. ఆర్. పృథ్వి కవితలు

## 1. అప్రజాస్వామ్యం

స్వార్థానికి కళ్ళు మొలిచినప్పుడు
కాలం, దాని నోటిలో మాంసపు ముద్దవుతుంది
రుచి, నెత్తురులో కరిగేలోపు
మెదడులోని ఆలోచనలనిండా
రాజ్యకాంక్ష రంగుల చిత్రాన్ని గీస్తుంది
ఎవడి బ్రతుకు వాడి సొంతం
సింహాసనం కోసం –
మాయల మూటల్ని విప్పుతారు.
తంత్రాలతో సమ్మోహన పరుస్తారు
నాలుకపై అబద్ధాల్ని అందంగా ఊరిస్తారు.
గెలుపు ఎవరినొసట తిలకమవుతుందో తెలీదు
ఎప్పుడు, ఏ రకమైన బాంధవ్యం
తీగెలా అల్లుకుంటుందో తెలీదు.
విజయాన్ని చొక్కా గుండీగా అమర్చేందుకు
హింసా దౌర్జన్యాలు చుట్టాల్లా కదలివస్తాయి.
పీకలు తెగడం, నెత్తురు కారడం,
సారా, వానై కురిసినంత తేలికయింది.
చదరంగంలో పావుల్ని కదిపినంత సులువుగా
ఎన్నికల రణంలో నోట్ల కట్టలు కదులుతాయి
ఆలోచనా శక్తి ఉన్నవాడికి
ఇక్కడ ఓటు ఉండదు;
మభ్యపడే వాళ్ళకే ఓట్లన్నీ
ఓటున్నవాడు కర్తవ్యంలో కరిగి,
చూపుడువ్రేలుపై నల్లచుక్కని కోల్పోతున్నాడు.
ఏ.సి.ల్లో కూర్చొని, ఎన్నికల సంస్కరణల్ని
కాగితాలమీద అక్షరాల్ని చేస్తే –
వాటిని మూటగట్టి,

చీకటి దిక్కులకు విసిరేసే సంస్కారం ఇక్కడ.
వేసే ప్రతి అడుగు
అప్రజాస్వామ్యపు బాటలోనే పడుతుంది.
ఓటర్ల జాబితాలు తయారు చేయడం నేర్వాలి.
ప్రజాస్వామ్యం నుదుట
భవిష్యత్తిలకాన్ని దిద్దాలి.

## 2. గజల్

కోపమొస్తే కోయిలవై పాడాలని అనుకో
విసుగు చెందితే భూదేవిలా నిలవాలని అనుకో

అన్యులు గోదావరిపై పయనించు వేళ
పడవకు తెరచాపనవ్వాలని అనకో

ధూర్తులు నీతిగుండెకు గురిపెట్టినపుడు
అడవిలో చెట్టువై అడ్డుపడాలని అనుకో

పొలిమేరలోకి చోరులురికినప్పుడు
సరిహద్దు వెంట తుపాకీవై నిలవాలని అనుకో

గొంతు తడి ఆరి నేలతల్లి సొమ్మసిల్లితే
ఎదను తడపగ ఏరులై పారాలని అనుకో

ధైర్య సాహసాలకు గురుతుగ ఓ పృథ్వి
స్వేచ్ఛగా ఎగురుతున్న త్రివర్ణ పతాకను అనుకో

"అక్షరాల్ని అగ్నిహోత్రంగా మార్చడానికి బ్రతుకు బ్రతుకంతా
సత్యంముందు సమర్పించినవాడే కవి" - శేషేంద్ర

# తిలక్ పురస్కారం

- దుగ్గిరాల రామారావు

సహృదయుండు "జీ.యస్.వి.ప్రసాదుగారు"
ప్రముఖ వైద్యుండు, సాహితీ బాంధవుండు,
తణుకునందు 'నన్నయ పీఠము'న కధిపతి,
సరసుఁ డగు కార్యదర్శి "సుశర్మ" తోడ
నందఁ జేసెను అస్మద్గృహమ్ము నందు
"తిలకు సత్కృతి"; గుండెలో నిలుపుకొందు
ఈ మధురమైన ఘట్ట మే నెల్ల యపుడు.

అభినవాంధ్రభోజుఁ డల "ప్రసాదు", "సుశర్మ"
గణుతికెక్కినట్టి కవివరుండు,
వారు నా గృహమ్ముఁ జేరవచ్చుట నాదు
భాగ్య మనుచుఁ దలఁతు భావమందు.

ఈ పురస్కృతి నిల్పి సాహిత్య సేవ
నాచరించెడి తంగిరాలాన్వయుండు
సుబ్బరావు, శ్రీపద సుధాంశువు బుధుండు
కృష్ణమూర్తియు; వారల కీర్తికాంత
పృథివి నలుదిక్కులను సంచరించు గాత!

❧❧❧❧

# సందేశగీతి

- పువ్వాడ తిక్కనసోమయాజి

ఎడలేని వడి నెత్రుటేరులు పాటింప
తారాడు హింసాయుధమ్ము నాది
కడగండ్ల స్రుక్కు డొక్కల చిచ్చులెగ్రోయు
సిరివన్నె చలిమంట సెగలు నావి

అవినీతి పాతాళమంట త్రవ్వ నఘమ్ము
పుడమిని పఱచిన ఒడుపు నాది
ఓటుహక్కు తుపాకి తూటాలు ముద్రింప
నోళ్ళు మూయించెడి నోట్లు నావి

విడిలె శృంఖల లహ! గొంతు పెగల దాయె
అరువదేండ్లుగా నా భారతాంబ మూఁగ!
మఱి చికిత్స? వైదేశిక మంత్ర తంత్ర
శాస్త్ర సమ్మోహి తాణ్వస్త్ర శస్త్ర ధాటి!

అమ్మరో! భూమాత! ఆ ప్రకంపనమేల?
స్త్రీ మానభంగ దుస్థ్సితిని గంటె?
ఓయి! సముద్రుడ! ఉగ్రాత్ముడవు గాకు
ధీమంతులిట నిరోధితులటంచు
ఝంఝానిలమ్మ! నీ శౌర్యమ్ము జూపకు
ధర్మవర్తనుల కథ్వాన మనుచు
కాలాగ్ని శిఖలార! కన్నెఱ్ఱ సేతురే
దుండగీండ్ల కిట సంస్తుతి యటంచు

కాఱుమేఘమ! పిడుగులు క్రక్కబోకు!
దైవదూషణమే మా స్వభావమనుచు!
ఉండునే సృష్టి ప్రళయమ్ము లుఱిమె నేని,
వచ్చునే బుద్ధి మృగసమాస్ఫాలనమున?

గగన పత్రికలోని ఘనచిత్రములయందు
సమరస జీవనసార మెఱిగి
భూపరాగశ్రేణి పొదువు శిల్పమునందు
ఐక్యభావనల దార్ఢ్యమ్ము నరసి
నదనదీ జలధుల ఉదకనర్తనమందు
మానవరక్త సామ్యతను గాంచి
జీవకోటికి నెల్ల చేతనా గానమౌ
ప్రాణవాయువుల అద్వైత మెంచి

జ్ఞాన తేజాన హృదయ విస్తరణ జేయు
పాంచభౌతికము కళాప్రపంచ మనుచు
ఈ ప్రపంచ మహారచయితల సభల
జాతి కందిత్తు సందేశగీతి నేడు!

*(ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు, జాతీయ కవి సమ్మేళనము, 21-9-07).*

# పావన స్మృతి

- అత్తిలి వేంకటరమణ

శ్రీ రామాయణ కల్పవృక్ష కవితా శ్రీమంతుడౌ తండ్రికిన్
శ్రీరామాయణ కల్పవృక్ష కవితా శ్రీ భక్తుడౌ పుత్త్రుడై
స్ఫారోదార యశః పరీత సుజన స్వాంతః ప్రదేశుండు, ఔ
రౌరా! 'పావనిశాస్త్రి' ధాత్రివిడె నన్యాయం బకాలంబయో! 1

అంత తొందఱ యేలనయ్యా త్వదీయు
లందఱిని వీడి స్వర్గతి నందుకొనగ
నందనారామ సరస సంస్పదములును
స్వజన సాంగత్య మధురిమ సాటియగునె? 2

విశ్వనాథ సాహిత్య రవి ప్రకాశ
మనవరత భాసమానమై ఆర్షధర్మ
మాంధ్రలోకాన సుస్థిరమగుట గోరి
వితతయత్నంబు లనరించె పితృపరముడు! 3

ఓ విధి! నిర్దయుండవుగదోయి! భవత్కృప యెట్టిదో గదా!
మావలనన్ ప్రమాదములు మాకు నెఱుంగగ వచ్చునే ప్రభూ!
భావుక మౌళి, సౌహృదయ ప్రపాయిత వాక్యుడు, మిత్రవర్యుడౌ
'పావనిశాస్త్రి' లేడనిన పల్కు శిలీముఖదారుణంబయా! 4

నన్నయ్యాదులకున్ మఱి
యున్నాడో యిట్టిబిడ్డ, ఉజ్జ్వలమతియై

మన్నన పితృసాహిత్యపు
టౌన్నత్యము నిల్పుబిడ్డ, ఆంధ్రసవిత్రీ! 5

ఎంత దురపిల్లినన్‌గాని యేమి లగ్గు?
మిగిలియుంటిమి బాష్ప సమ్మిళిత దృక్కు
లగుచు దిక్కులు చూచు నెయ్యముల మేము,
నెనరునంబడు జ్ఞాపకాల్ భ్రమయజేసి! 6

# అభినందన హరిచందనము

**- ఎలమర్తి రమణయ్య**

*(బ్రహ్మశ్రీ వజ్ఝల వేంకటసుబ్రహ్మణ్యశర్మగారికి సహస్రపూర్ణచంద్రదర్శనోత్సవ సభ సందర్భముగా, కర్నూలు ప్రభుత్వ డిగ్రీ కళాశాల పూర్వ విద్యార్థి సంఘమువారు సమర్పించినది).*

తే. జనని జ్ఞానమ్మ నోముల ఘనఫలమ్మొ!
జనకుడా సుబ్బరాయుడే జనకుడౌనొ!
'నేలటూరు'న నెల్లూరు నేలపైన
జన్మనందిన వజ్ఝల చంద్రుడితడు! 1

సీ. జలజలరాలు వజ్రములకు సాటియౌ
సుబ్రమణ్య వరేణ్యు సూక్తులరయ
గలగలపారు విమల గంగతరగల
సరిపోలు నగవులు సభలమెరయ
చలువలమించు వెన్నెలవలె ముంచును
దీనుల ఆర్తులలోని కరుణ
మనముల కట్టివేయును నెఱి మమతల
ప్రోవన నెయ్యపు తావియనగ

తే. మనసు మందాకినీ సుమ మారుతమ్మొ
వయసు లక్షించని దీక్షనియతి వరల
కర్మయోగియై భాషించు శర్మగారు
గురువు మాకన్నమాటయే బిరుదు కాదె! 2

ఉ. తిక్కనసోమయాజికృతి తెచ్చెను తెల్గుకు కీర్తి స్ఫూర్తియున్
చక్కన కూర్చినాడు ఘనసాహితివేత్తల ధీవిశేషముల్
చక్కెరవల్కులూర బుధసన్నుతి గాంచగ తెల్గునేల పెం
పెక్కగజేయ సింహపురి చరిత్రను ధీరుడీతడే! 3

చ. అరుదుగనందు భాగ్యము సహస్ర శశాంక సుదర్శనోత్సవ
మ్మరయ గురూత్తముండు జలజాక్షుడు పద్మభవుండు భర్గుడే
నిరుపమ సద్గుణాఢ్యుడు మనీషి మహోదయు నుత్సవంబనన్
దొరకునె యిట్టిసేవ అని దోసిలియొగ్గుచు మ్రొక్క వచ్చితిన్ 4

తే. విమల చరిత సీతాలక్ష్మి విభుడవైతి
శిష్యకోటికి వాత్సల్యసింధువైతి
సంతు సత్పుత్రుల గాంచి సఫలుడైతి
హరి కృపను గాంచి శుభముల సిరుల గనుమ! 5

డా॥ ఎం. శాంతిరాముడు
గౌరవాధ్యక్షులు

పి. అజయ్‌కుమార్
ప్రధాన కార్యదర్శి

## స్వర్ణవీణ

– డా॥ కాసల నాగభూషణం

శ్రీ పొట్టి శ్రీరాములు
దీపింపగ తెలుగు తల్లి తేజము దెసలన్
రూపించె నొకట రాష్ట్ర
స్థాపన దీక్షా బలమ్ము, త్యాగ ఫలమ్మున్ 1

స్వపరిపాలన యుక్తి భాషా ప్రయుక్త
రాష్ట్ర విభజన కాతడు బ్రహ్మ యనగ
అవతరించెను ఏ.పి.ఎస్ – అమరజీవి
పొట్టి శ్రీరాములనునట్టి స్ఫురణ కలుగ 2

కృష్ణానదీ జలావృత పర్వతమ్ము నా
గార్జున సాగరమ్మయ్యె మనకు
తెలుగు కళా సాంస్కృతిక పీఠమ్మై విశ్వ
విద్యాలయమ్మును వెలసె మనకు
రాజధానగ, సినీ రాజధానిగ భాగ్య
నగర వైభవ శోభ నెగడె మనకు
ఆంధ్ర భాషను మేటి అధికార భాషగా
అమలు చేయగ సంఘమమరె మనకు

తెలుగు సంఘాల ఐక్యతోద్దీప్తికై ప్ర
పంచ తెలుగు సమాఖ్య ఏర్పడియె మనకు
ఐ.టి. రంగాన అగ్రరాజ్యాల తోడ
నిక్కి నీల్గెడి హైటెక్కులెక్కె మనకు 3

మదరాసీ ప్రథ మాసిపోయె భువి నాత్మశ్రీలు పెంపొందగా,
హృదయావర్జకమైన హస్తకళలున్ హేరాళమై గ్రామ్య సం
పద హెచ్చెన్; జనజీవముల్ ప్రకృతి బీభత్సమ్ములన్ జిక్కియున్
పాదలెన్ తెల్గు వెలుంగు వల్లికలు సమ్మోదార్ద్ర చిత్తమ్ములన్ 4

తెలివికి తేటమాటలకు తేకువకున్ నునుమేని వన్నె చి
న్నెలకును కట్టుబట్టు నెఱనీటులకున్ మఱి బైట ఆట పా
టలకును ఆత్మగౌరవపు డాబు లడాయి బడాయి కైతకున్
తెలుగె సదా నిధానమయి తేజరిలన్‌వలె విశ్వవీథులన్ 5

వర్ణ సమామ్నాయము విన
కర్ణామృతమట్లు మధురగాన మెలర్పన్
వర్ణమయ రత్న రంజిత
స్వర్ణాంధ్ర ప్రదేశ వీణ పలుకును గాతన్! 6

*(ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ స్వర్ణోత్సవ సందర్భంగా చెన్నై అమరజీవి పొట్టి శ్రీరాములు స్మారక సంస్థ ఏర్పాటు చేసిన కవి సమ్మేళనంలో సమర్పించిన పద్యాలు)*

❧❧❧❧

గద్యకవిత (దీర్ఘకావ్యం)

# గుండెల్లో వాయుగుండం

- డా॥ ఆవంత్స సోమసుందర్

*(గత సంచిక తరువాయి)*

## 7

భీతావహ స్వప్నంలో బాల్యం. అభమూ శుభమూ తెలియని అమాయకత్వం... తెల్లనివన్నీ పాలేననుకుని ... విషహస్తాలైనా మాతృహస్తాలే ననుకుని, చేతులు చాచే నిర్మలత్వం!

ఇన్ని కుతంత్రాలెరుగని బాల్యోల్లాసం కేవల ఆనందస్వరూపమే కదా!... సంభ్రమాశ్చర్యాలు అనిమిషమ్మై - విడివడని కెంబెదవులలో తళతళలాడే దరహాసాలై ... ఆవేశించిన ఉచ్ఛ్వాస నిశ్వాసాలై పసిబతుకులు వీచేగాడ్పులు ... మబ్బుల అంచున సూర్యాస్తమయాలు - వెలిగించిన మెరుపు రేఖలు చూస్తూ, తమకోసమేనని మురుస్తూ, పరుగులై, ఉరకలై, కేరింతలై ఉద్రేకాలై ...

ఎన్ని యుగాలుగా ఈ నేలతల్లి మెత్తని పొదిగిట శిశుసందోహాలు - నిరంతర కోలాహలమ్మై, వివశమ్మై - ఎంత సుందర భవిష్యత్తును స్వప్నించాయో?!

అద్భుత రసాలు పారవశ్యమందిస్తే ఎంతగా ఊగిపోయాయో? ఎంత వివశమ్మైపోయాయో.

ఈ సాగరవేల, సికతాతలతీరంలో మెత్తని తేమలంచుల మృదుపాదాలు సారిస్తూ క్రీడలతో, ఆనందోత్సాహాలతో సకల దుఃఖాలనూ మరిచిన అమృత క్షణాలను, బాల్యహృదయాలలో ఎన్ని ఉద్విగ్న విలాసాలు పెంపొందాయో? ఎన్ని ఆనందతరంగాలు పెంపొందాయో?

నేడో ఆ బాల్యం చదువుల బరువల క్రింద చెరలాగ ... సూర్యోదయాలకు ఎర ... ఆ మృదుల పాదాలు మెత్తని పావురాయి కూనలు. - నల్లని బూట్ల క్రూర పంజరాల్లో - బిగించబడిన అక్కుపక్షులై - నిరంతర భీతాత్మలై ఎక్కు పెట్టిన మనస్సులలో బిగిసిపోయిన నగ్నభూతాల కొలువులలో - ఆహా చదువులు! వెలుగునీడల నలుపు, తెలుపు గడుల చుట్టూ చెలరేగే మంటల కొలుములు!

పసిగుండెలలో పిశాచాల లోకాంతర విహారం ఇంకా ఎంతకాలం?

బాల్య సరిత్తుల రహస్తీరాలలో రాక్షసగానాలాపాలు ఇంకా ఎంతకాలం?

## 8

ఇంత సుందరమైన ప్రకృతిమాత.. ఇంత మనోమోహన ప్రదర్శనశాల తెరుస్తోందే - ఎందుకర్రా అంత తొందరగా గొర్రె పరుగులతో ఎక్కడికి పోతున్నారు?

ఆగరేం? దర్శించుకోరేం?

ఆ కడలి గడపలలో ఇసుక పరుపులు పరచినది మీ మృదుపాదాల కోసమే కదా! - హాయిగా విహరించరేం?

అరెరే బాబులూ! బుల్లి బుల్లి కెరటాలు మీ కోసమే వచ్చి ఇసుకను మెత్తగా తడిపి, నవ్వుతూ వెళ్ళిపోతున్నాయి కదా! పిచ్చికగూళ్ళు నిర్మించరేం? అవే కదా మీ సుందర భవిష్యద్భవనాల నిర్మాణాలకు నమూనాలు! నిదుర కొమ్మలపై మీ ఎదల కిలకిలాడే కలలు మేకువ మలయమారుతాలలో ఏ అపరిచిత ఆనందోల్లలై ఎగిరిపోతాయో!

బడులూ, బరుగులూ నిడుమరలూ కడగండ్లూ - భయంకర నిశ్వాసాల క్రూర సర్పాలు!

పిలవని పేరంటంగా వచ్చి తాకి, ఛెళ్ళున చరచి ఏ అజ్ఞాతలోకాలకో దుడుంగున తీసుకుపోతాయే!... దారి పొడుగునా పిచ్చి దయ్యాల కయ్యాలే కయ్యాలు! జ్ఞాపకాలు పలకవు. కలలు పలుకరించవు. అనుభూతులన్నీ సీమాంతరాలకు పరారైపోతాయి.

ఏం మిగిలేను? వాస్తవికతకీ, భ్రమకీ నడుమ ఏ పసిడి జలతారు తెరలు వేలాడగలవు? యథార్థ భేతికి గుండెలలో పిరికితెరలు ప్రదర్శించే కురూప కల్పనలు ఏ దుష్టగ్రహాల ప్రేరణలు?

ఆమని చిగురులు తొడిగిన మామిడి తోటలలో మెత్తని ఇసుకదారులలో నగ్న పాదాలతో నడుస్తున్నట్లు కలలుకన్న మనిషీ నీ ఈ చిన్న కోరిక ఎప్పటికి తీరుతుంది?

కొలనుగట్టుపై గెంతుతూ ఎర్రగా, తెల్లగా విరిసిన తామర పువ్వులలో నీ కలలు దాచుకుంటూ - మనిషీ నీ చీలమండలకు ఏ దివ్యానుభూతులు అందాయో స్మరించుకోగలవా?

పల్చని నీటిపొరల అద్దాలలో మెరిసే రంగురంగుల గులకరాళ్ళు ఏరుకుంటూ ముద్దాడుతూ, కెరటాల పులకరింతలకు మురిసిపోతూ మనిషీ ఎన్ని సంతోషాలు మూటకట్టుకోగలిగావో జ్ఞాపకముందా?

ఎన్ని సుందరకాంతులతో వచ్చిందో సూర్యోదయం! ... తానే అన్ని చీకటులను మరిపించ గలనని, మడియించగలనని దీనికెంత గర్వమో! తొందర తొందరగా సాగే వేకువ స్నానాల బాధ్యతల బరువులు .. విషతిక్త కషాయాలు .. అబ్బా! ఈ వెచ్చని సూర్యరశ్మిని చూడనివ్వవా?

ఇంత చక్కని కాంతిని విడిచి ఇంత చక్కని సజీవ స్వప్నరాశిని పోకార్చుకుని ఏ శూన్యంలోకి పోదామంటావు? నెచ్చెలీ! ఇంతకన్న ఆనందమయావాసం ఎక్కడ లభిస్తుంది?

రమణీయస్వప్నాలే కదా! తిరిగిరాని అమృతవరాలు. సశరీర ఆనందానుభూతులే కదా స్వర్గపాథేయాలు.

పుస్తకాలో, మస్తకాలో .. చక్రాలో, హస్తాలో .. దారులో పెన్‌ధూళులో .. ఎంత కశ్మలం? పాలబుగ్గల బాలాదిత్యుడు ప్రతి మనిషికీ గతించిన మనోజ్ఞ బాల్యానికి చిరసంకేతం కదా! మిన్నెక్కి వేడి నిట్టూర్పులు వీచినపుడు ప్రౌఢవయస్కుల అనాలోచిత బాధ్యతలు తప్ప ఏం లభిస్తాయి?

వేకువ తరుణమే తారుణ్య పరిమళం, కారుణ్య సహవాసం! జ్ఞాపకాల కందని కలలకి అందీ అందక చెరిగిపోయే గుండె గుసలలోంచి తళుక్కున దర్శనమిచ్చే విహాయస విహారాలు - అవేకదా చివరివరకూ మిగిలే సహానుభూతులు!

ఆకుపచ్చని చివురుటాకులు విన్నవించే ఆశల శుభసంభాషణలు .. అప్పుడే విరిసిన కొత్తపువ్వులు పలకరిస్తూ జ్ఞాపకం చేసే మరపు మడతల రంగురంగుల అనుభూతులు.

నందనారామాలలో ఓహో ఆ సువాసనలను ఎలా మూటలు కట్టి తెచ్చుకోగలం? చేరబిలిచే చల్లని తల్లుల కరుణామయ రాగరేఖలను ఎన్ని జన్మలెత్తి సొంతం చేసుకోగలం? నవనవలాడే కుసుమాలు వసుంధరా నయనాలు. పొదలలో దాగి ముళ్ళలోంచి పైకి రాలేక కుమిలే పేరులేని పువ్వులు - ఎవరు కల్పించగలరో విముక్తి!

## 9

ఎంత ముసలిదీ పుడమి! అయినా దీనికి అహరహ యౌవనం ఎలా సమకూడుతోంది? ఈ భూమికి జన్మించిన బిడ్డలు లక్షోపలక్షలు కదా! వారికెందుకు

రాలేదు ఈ పోలిక? కనీసం పుత్రాగ్రేసరులైన మానవుల కేల కలగలేదు? మానవపదం నిరంతర ఉభయలింగం. పురుషుడో, స్త్రీయో ఎన్నడూ ఒంటరి వాళ్ళుకాదు. ద్వయీ భావంలోనే అమేయశక్తి సమకూర్చుకుంటున్నవాళ్ళు! అది సరే ...

ఇన్ని జీవరాశులవల్ల ఇంత కల్మషమైపోతోంది కదా ఈ భూమి! ఈ కాలుష్యాన్ని ఎలా క్షాళనం చేసుకుంటోంది?

పరంపరాభివృద్ధిగా మహనీయులు జన్మిస్తూనే ఉన్నారా? వాళ్ళ పాదధూళి సోకినందువల్లనే - ఈ ముసలి మట్టికి నవసురభిళం అబ్బుతున్నదా?

ఆ క్షణానికి ఎంత సాంద్రతరమైనా కావచ్చు. కాని, పరిమళం శాశ్వతంగా నిలవలేదు కదా! దిగంతాల రహస్యకాలుష్యాలవల్ల దుర్గంధపటలం దురాక్రమిస్తున్నది కాబోలు!.... ఈ దుస్థితిని నిరోధించడం ఎలా? మానవజాతికి సాధ్యమేనా? పోనీ దేవతలెవరైనా వచ్చి, ఆ పరమ కర్తవ్యం నెరవేరుస్తారనుకుంటే ఏరీవాళ్ళు? మృషాకల్పనలలో పుట్టి దిక్కూతెన్నూ తెలియకుండా పారిపోయారా?

ఈ వసుంధరా విలాసవతి పునః పునః నిద్రావ్యాప్తికి ఎలా వివశమౌతున్నది? జడమయజర్జరిత ఎలా ఆలవాలమౌతున్నది? మళ్ళీ సాధారణ మానవులలోంచి అసాధరణ మహాశక్తి సంపన్నులు ఆవిర్భవించరా? వారవతరిస్తే తప్ప, మళ్ళీ ఈ వసుంధర సుగంధపూర్ణమై ప్రవర్ధిల్లదా? ఎవరుపదేశిస్తారు భద్రయోగం? పరిశుద్ధాత్ములై ఎవరు మంత్రశక్తితో మంగళాశాసనం కల్పిస్తారు? ఎప్పుడాగమిస్తుందా ముహూర్తం?...

అంతవరకూ శాంతి లేదా? సురభిళం లేదా? సురుచిర సౌమనస్యం అలవడదా? (సశేషం)

- "కవి ఒక సత్యాగ్రహి"
- "కవి ఒక మండే గుండెల జెండా"
- "హక్కుల్ని శబ్ద అర్థ దృష్ట్యా అలంకరించేవాడు కవి"
- కవి శబ్దాల్లోకి పరకాయ ప్రవేశం చేసే విద్యే కవిత్వమనే రహస్యం"
- "కవి పొందే తాదాత్మ్యం వలన కవిత జనిస్తుంది"

- శేషేంద్ర

ఉమర్ ఖయాం రుబాయత్‌లకు అనువాదం:

# స్వర్గావతరణమ్

- కీ.శే.బీర్నీడి విజయదత్

## ప్రథమ సంధ్య

లే! లే! బల్లువ తెల్లవాఱినది; నీ లేనవ్వుతో మద్యమున్
ఖాళీగిన్నెలనింపు! రాగరసమొల్కన్; జీవితమ్మన్న యీ
లీలాపాత్రము పూర్తికాకమునుపే మృత్యు ప్రచండాగ్రహ
జ్వాలల్ రేగును - చేతులార ఒక సీసా మోవికందిమ్మికన్! 1

తూరుపుమబ్బుపై మెఱుపుతోటలు నాటెను వేగుజుక్క; ద్రా
క్షారుణ కాంతి నీ పెదవిఅంచుల వన్నెలు దిద్దినట్లు, సం
ధ్యారమణీయతల్ దిశల కందములద్దుచు నున్నవోసి! సా
ఖీ! రుచులూరు నాసవము గిన్నెల నింపుము! వెన్నరొట్టెతో! 2

ఈ పొగమంచు మబ్బు ప్రవహించిన నెత్తుటిగడ్డగా - నిశా
ద్వీపము గెల్చి, భాస్కరుడు దిగ్జయచిహ్నమువోలె "నెత్తుజెం
డా" పయికెత్తెలెమ్మ! అరుణాధరి! నీ సుమనో మనోజ్ఞమౌ
రూపము వాడిపోవు నొకరోజున వెన్నెలవెండి తీవగా! 3

వెలుగున్ చేతుల వేటకాడు పొడసూపెన్, పాదుషా మేడ కొ
ప్పులపై తాపిన పైడికప్పులకు కాబోల్ కాంతిసూత్రాలతో
వలలల్లెన్; తలయెత్తె ప్రాకృతిక శోభల్, మంచులోమాగి క్రొం
జలిగాడ్పుల్ గిలిగింతవెట్టినవి రోజాపూల చెక్కిళ్ళపై! 4

దశదిశలు నిండి సాంధ్యరక్తములు చింద
బండరాతిరి నల్లని గుండెలోన
పొడిచినది వెల్గు పిడిబాకు! ప్రొద్దుపొడుపు
నిదురకనువిచ్చి చూడు మభ్యుదయశోభ! 5

చీకటులూడ్చి, వెల్తురులు చిల్కి, దిశల్ గయిసేయు నీ యుష
శ్శ్రీ కిరణాంజలుల్ పులకరించిన చల్లని సంజవేళ - నే

దో కలగాంచుచున్ నిదురతూగువ వింటిని పానశాలలో
కేకలు, కన్నువిప్పు కలిగించెడి పిల్పులు, మేలుకొల్పులున్! 6

ఓ నిదురించు లోకమ! ఒహో పతనోన్ముఖ జీవకోటి! అ
జ్ఞానపు ప్రక్కపై కలలుగాంచుచు, నింకను కన్నువిప్పవో?
లే! నవజీవనైక మధువెండక పూర్వమె నింపుకొమ్ము కూ
జాను! పరిత్యజింపుము - విచారము - సారములేని తత్త్వమున్! 7

ఈ మధుశాలకున్ తలుపులింకను గట్టిగమూసియుంచినా
రేమిటి? తెర్వుడీ! తెరువుడీ! మనమాయువు తీరిపోయి, ఈ
భూమి తలమ్మునన్ కునుకుపోయిన నంతియ "మళ్ళి" లేచిరా
లేమిక - ఇంతలోన మధురేఖలు పాత్రల నింకిపోయెడున్!! 8

ఇంటికొప్పున నిలిచి, గొంతెత్తి పిలచి
కోళ్ళు సైతము "కొక్కొరోకో" అటంచు
హెచ్చరిక సేయుచున్నవి! ఏల యింక
ఆలసింతురు మధుపాత్ర అందుకొనక! 9

మిలమిలలాడు లే గరికమిట్టల పుట్టినమంచునీటి చు
క్కలవలె నే యెడారి పెనుగాలికి జీలికలౌనో! ఈ రసో
జ్జ్వల మధువీథికాదరహసన్నవజీవనఘట్టముల్, వృథా
నిల విషవేదనల్ కడిగివేయుము నెచ్చెలి! శీధుధారలన్! 10

అరనెలవంపుపై కదలియాడెడి సన్ననిమబ్బులట్లు సుం
దరతరమైన నీ నుదురు తాకెడి నిద్దపు నీలినీలి ముం
గురు లెగనొత్తుకొమ్ము! సుమకోమలి! జాఱగనీకు వాల్గనుం
దెర! కనుగొమ్ము కాలరథతీవ్రత! నీకొఱకాగదెచ్చటన్!! 11

స్నానమాడుము! హృదయ కశ్మలతవాయ
గోరువెచ్చని గోస్తనీసారధార!
విడువుము విషాదవస్త్రము! తొడుగుకొనుము
శుద్ధ సంతోష కనకకంచుకము - సాఖ!! 12

ఒక మేఘమ్ము మఱొక్క మేఘమున కేవో ముచ్చటల్ సెప్పి ఆ
గక ఆత్రమ్మున ముద్దులాడినది ఆకాశమ్ములో, పుష్ప క
న్యక బుగ్గల్ పులకించె - ఈ మధుర సంధ్యాకాల సౌందర్య మూ
రక పోనీకు! సుఖింపు! దింపు మధుపాత్రస్వర్గమీనేలకున్! 13

తళతళలాడు చిన్కు జలతారుల మేలిముసుంగు చాటునన్
జలధరమూర్తి దాచుకొనె చక్కని కన్నెగులాబి అందమో
చెలి! కనురెప్పలెత్తు! మన జీవన విశ్వవిహాయసమ్ములో
వెలిసినదొక్క చుక్క! ఒక వెల్గని బుల్బులిపాట పాడెడున్! 14

చల్లగ - మెల్లగా - వలపు చాయలపోయెడి పిల్లకాల్వపై
అల్లరిసేయుచున్న మలయానిలముల్ మన వేడియూర్పుతో
ఉల్లసమాడవచ్చు నివిగో! ప్రణయేశ్వరి! ఈ నిమేషముల్
చెల్లకముందె త్రావుదము చేదును తీయముగాని తీయమున్! 15

ఈ తొలి సంజయందు వికసించు పువుల్ మలి పచ్చిసంజ కే
ప్రాతవడున్, పరీమళ పరాగము గాలికే తేలిపోయి, ఈ
లేత గులాబిపూల్ నిలువరించి, కళల్ మొలిపించు చైత్రుడే
భూతమువోలె నీడ్చుకొనిపోవును 'జంషీదు' 'కైకొబాదు'లన్! 16

అరమరలేక జీవితవిహంగము కాలవియత్తలమ్ములో
పరువిడుచున్నదో ప్రణయభాగిని! యెన్నడు నేలగూలునో
ఎరుగము - ఈ క్షణమ్మున బిగించిన కౌగిలి జాఱకుండగా
ఇరువురమున్ సుఖింతము! సఖీ! మధురాసవమానుకైపునన్! 17

ఎరవుకు తెచ్చుకొన్నవికదే! మనకీమధురక్షణమ్ము; ల
స్థిరమగు నీ సుఖోదయ విశేషము తృప్తినొసంగదంచు తొం
దరపడి త్రోసివేయ, కొకనాటి యవస్థ మఱొక్క నాటికిన్
దొరకదు! కంటికందునె! సుదూరపువెన్నెల గబ్బగీమునన్! 18

ఓసి! ప్రణయిని! ఈ మధురోదయమున
సలుపుచున్నార మానంద జైత్రయాత్ర -

కాలనలిగిన యీాచిఱు గడ్డిపోచ
పచ్చగిలు రేపు మన గోరి ప్రక్కమీద!! 19

ఒక్క ఊహకు వేఱక్క ఊహ ఒరసి
అలసిపోయిన నా చిన్ని అంతరాత్మ
ప్రాతవడిపోవు నాశలు పచ్చగిల్ల
క్రొత్త తొలకరికై ఎదుర్కోలుసేయు! 20

ఆజంషీద్ సులతాను నిద్రగొనె, దివ్యస్వర్ణ పాత్రమ్ముతో
రోజాపాదులతోడ పాడుబడె నేరోజో ఇరాంతోట - అం
భోజాతేక్షణ! నేటికిన్ మధువుచిమ్మున్ ద్రాక్షకై ప్రాలినన్
తేజోవాహిని ప్రక్కపూచు నిపుడేనిన్ జీవనోద్యానముల్! 21

పలికింపడీరోజు పచ్చిక బయలున
దావీదురాజు రత్నాలవీణె!
ప్రసరింపదీనాడు బహరాము శిబిరాన
రసపిపాసుల ఒయారములపాట!
సవరింపుడీపూట జంషీదు కొలువులో
పరదేశి పసిడి కిన్నెరల మ్రోత!
కదలింపదీప్రొద్దు ఖైఖుస్రు మేడలో
కన్నెభోగముసాని కాలిగజ్జె!

గాయకులు, నర్తకులు నిద్రవోయినారు
మధువు మధువని బుల్బులి మాత్రమొకటె
పాటగాపాడు నిపుడు పూదోటలోన
ఎండిన గులాబి చెక్కిలి యెఱ్ఱవాఱ! 22

ముద్దుగొనెన్, ప్రియాచరణముద్రలు ప్రేమలు పూయుగుండె; పై
నద్దుకొనెన్, పువుంబడ యుగాదికి జాఱు తుషారధార, లీ
ప్రొద్దు సుకమ్ముగూర్ప, విడిపోయిన దుర్దినభావపంకమున్
రుద్దెదవేమి? నాయెడద క్రొన్నెల వెన్నెలలో తుఫానుగా! 23

ఏది? సఖీ! సుధాకలశమెచ్చట? ఆపిన ఆగదెన్నడున్
పాదరసమ్మువంటిది సుమా! మన జీవితయాత్ర! నిద్రలో
ఖైదయిపోవు జాగృతి వికాసము - ప్రాయపు దివ్వె - ఈ తనూ
వేదిపయిన్ వెలింగినటు వెల్గుచు గప్పున నాఱిపోయెడిన్!! 24

గాజున్గిన్నెల అంచుపై కుబికి రాగచ్ఛాయ కల్పించు! ద్రా
క్షాజీవామృత మొక్క బిందువు, వృథాగా నేలకున్ జాఱినన్
రాజీలేదిక నీకు నాకు, నతిమూల్యమ్మైన ఈ పాత్రకున్
ఆజన్మాంత ఋణస్థుడీత, డిది సర్వాధార మీ ప్రాణికిన్!! 25

బ్రదుకుగులాబిపూల పొదప్రక్కననే మరణమ్ము పొంచు కొ
న్నది; పెనుగ్రచ్చకంపవలె అందిన సౌఖ్య సుగంధవీచితో
హృదయము నింపుకొందును! మఱేల విచారము? ఒక్కసారిగా
పెదవుల కందియిమ్ము నులివెచ్చని ఆసవమూరు పాత్రికన్!! 26

పచ్చని పైరుదుప్పటులు పైపయి కప్పుకొనెన్ పొలాలు - లే
బచ్చిక యొడ్డులత్తుకొని పాఱిన యీ వరహాలవాగు నీ
రచ్చము తేనెయూట అలుగై రసజీవులకున్ సుధా సుఖ
మ్మిచ్చుచునుండె! రమ్ము విహరింతముభూతల నందనమ్ములన్. 27

అలలువలె గాలి కలలకుయ్యాలలూగు
మనుజులెఱుగరు బ్రతుకు కమ్మందనమ్ము
రసమధురమ్మైన మన పరీరంభణమున
నిఖిలసుఖవాస్తవికత బంధింపగలము!! 28

సుకముల్ చెందిరి కైకొబాదు ఖయిఖుస్రుల్ ధారణీశయ్యలం
దిక ఆపీనుగులమాటయెత్తకుము సాకీ! బాహుకండూతి తృ
ప్తికిగా రుస్తుముజాలు యుద్ధముల కత్తిన్ దూయనీ! చద్దికూ
టికి తిప్పల్ పడనిమ్ము తాయి! మధుగోష్ఠిన్, వాని విన్పింపకే! 29

ఊరికెడారికిన్ నడుమ నుండిన పచ్చని యీ పొలమ్ములో
వా, రథినాథు, లీ ప్రజలు బానిసలన్న విభేద మింతయున్

చేరదు, సింహపీఠిక వసించి, ప్రభుత్వము చేసి చేసి పే
రూరులు మాసి చచ్చిన మహోన్నతులన్ కరుణింతమిప్పుడుర్వీ! 30

పాపులు పవిత్రు లనదలు భాగ్యనిధులు
కలిసిపోదురు మేదినీగర్భమందు
మృత్తికారూపమున మాత్ర మెఱుకపడదు
కలిమిలేముల హెచ్చుతగ్గుల గలాట!! 31

బంగారమ్మును కూడఁబెట్టుకొను భూస్వాముల్, సుధావృష్టిగం
బంగారమ్మును గాలికిన్ విసరు శ్రీమంతుల్! ధరాధూళిలో
నం గన్మోడ్తురు ధూళియౌదురిక బంగారమ్ముగా మారరో
శృంగారస్తని! త్రవ్వఁబోరు ప్రజలేనీ వారి పైకెత్తగా!! 32

బహురాముల్ మహమూదులున్ మధువునాస్వాదించి, ఆనందసం
గ్రహముల్ సల్పినభర్మహర్మ్యములలోనన్ సింహశార్దూలముల్
సహవాసమ్మొనరించు నేడు! మృగయాసంరంభియై చన్న అ
బృహరామ్ నెత్తిన తన్ను గాడిద చలింపండాత డీప్రొద్దునర్వీ! 33

ఇల ఒక ప్రాతసత్రము ప్రియేశ్వరి! రేలుబవళ్ళు వన్నె చి
న్నెల తలుపుల్, గరీబులు గనీబులు నిచ్చట కొన్నినాళ్ళుగా
నిలచి, సుఖించి, అంత పయనించెద రొక్కరివెంట నొక్కరే
తలమునకో, యెఱుంగముగదా! మఱికొందరు వత్తు రాపయిన్! 34

మనపూర్వుల్ సుఖియించిరెచ్చట? అదేమార్గమ్ములో నేను నీ
వును నీనాడు సుఖించుచుంటిమిక రేపో మాపో, ఈ జీవిత
మ్మును చాలింతుము నిద్రవోయెదములే, భూగర్భ శయ్యాతల
మ్మునినింకెవ్వరిశయ్యలౌదుమొకదే, మున్ముందు ప్రాణప్రియా! 35

రాజితమైన యెఱ్ఱనిగులాబి ఎటన్ చివురించు నచ్చటన్
సీజరురాజు రక్తములు చిందినవో అనుకొందునో సఖీ!
ఈ జలపాత మెత్తు సెలయేఱు లకానొకనాఁట నెవ్వతో
రాజకుమారి వాల్గనుల రాల్చిన సమ్మదబాష్పబిందువుల్! 36

ఏ సుకుమారి మున్ను శయనించెనొ ఈ సెలయేటి ప్రక్కగా
మోసులువాఱు పచ్చికలు ముద్దులుచిందెడు! కౌముదీకళా
హాసవికాసమాయె మధురాధరమే చిఱుగడ్డిపోచ యౌ
నో! సఖి! మెల్లగా నడువవో! పరిణామ విచిత్రసృష్టిపై!! 37

జలజలపాఱు నిర్ఝరిణి చల్లని యీ కెరటాల నూగు పూ
వులపొదతీగలన్ కదుపబోకుము! నెచ్చెలికాని నిండు కౌ
గిలి బిగియింపులోన పులకించిన యే జవరాలి మేనిటన్
వలపుల రూపుదాల్చి, బలవంతముగా లతకత్తుకొన్నదో! 38

అవిగో! మృత్యు పదధ్వనుల్, ప్రియసఖీ! ఆ భూత మెన్నెన్ని మా
నవ కంకాళ కపాల పాళికలు దండల్ కట్టుకోనున్నదో!
చివురించీ చివురింపకే కనులు మూసెన్ లేతరోజాలు! ఈ
పువుమొగ్గల్ చిఱునవ్వుతో, మనకు నేర్పున్ జీవితామూల్యతల్! 39

పూలగుడారముల్ నిలిపి మున్ మన నెచ్చెలులెందరో పిపా
సాలస లాలసాత్మవశులై మధువొక్కటి రెండుగిన్నెలన్
గ్రోలి-శమించివారలకరొక్కరు, జీవతమున్ దుకూలమున్
కాలము కత్తెరించు, నరుణాధరి! రేయిబవళ్ళ కత్తెరన్!! 40

గడచిపోయిన కాలచక్రమునుండి
మరల నొక్క నిమేషమ్ము తిరిగిరాదు!
భావిసుఖమున్నదో! లేదొ! వర్తమాన
మనుభవింపుము! విడువకు మమృతపాత్ర! 41

నిన్నటి దుఃఖఘట్టములు - నెచ్చెలి! రేపటి వేదనాస్మృతుల్
అన్నియు తీరు చేరెడు సుధాసవమానినచాలు! రేపు రే
పన్నది "నిన్న"గా తిరుగు నల్లన కొన్ని క్షణాలుదాట, ఎ
న్నెన్ని శతాబ్దులింతకు గతించెనొ రేపును మార్చి నిన్నగా! 42

రేపటి ఆశజూపి అలరింపకు! మోపిక పట్టుమంచు నా
ఊపిరి తీయబోకు! మెచటో వెలిమబ్బులలోని నీటికై
చాపకుచేయి! చెంతనె రసాసవమున్నది అందుకొమ్ము! సా
ఖీ! పదునైనదాక కురియించెద మీ బ్రతుకుం బలాలపై!! 43

ప్రాయు, మొక్కొక గడియ పైబడినకొలది
చంద్రకళవోలె క్రమముగా సన్నగిల్లు!
ఆయువువ్యయించు రేపటికంటె నీవు
పడుచుపిల్లవుసాఖి! యిప్పుడొక కొంత! 44

పలదిక లేనిపోని బరవాస, నిరాశ వహింపబోకు! నీ
చెలువము నంతయున్ మధురశీధువుతోడుగ క్రుమ్మరింపు! నె
చ్చెలి! మనసార - ఈ వయసు చెల్లగనున్న ఖయామునుందు! ని
ర్మలమగు నీ తనూమధురిమల్ తొలికార్మెఋపున్ తళత్తళల్. 45

(సశేషము)

# హైకూ శతకం

– డా॥ కాసల నాగభూషణం

1. కవితకి
కొత్త వసంతం తొడగిన
చిగురాకు హైకు!

2. అందాల
గంధాలు వీస్తున్న మొగలి
పూరేకు హైకు!

3. అక్రమాల
గుండెల్లో దిగుతున్న
పిడిబాకు హైకు!

4. పార్క్‌లో వాకింగ్
వ్యాయామానికి
ఇళ్ళనుంచి స్కూటర్ల మీద!

5. అభ్యుదయం
వడ్డిస్తున్నాను రండి! –
మనవాళ్ళంతా!

6. మిట్ట, పల్లం
చదును చెయ్యాలి –
మీరంతా మిట్టకి రండి!

7. నీకోసం
జారిన కన్నీళ్ళు
చీలిన గుండెల్లో - కెంపుల్లా

8. వృద్ధాప్యం
తలపోతల తుంపర!
బాల్యం మట్టి వాసన!

9. మెట్టు ఎక్కితే
మనిషి - దేవుడు!
దిగితే - రాక్షసుడు!

10. దొంగలతో
మనకి పేచీ లేదు -
దొరల్లా నటిస్తేనే!

11. తెలివితేటలు
ఒంటిమీద బట్టలు -
ఐనా మృగాలే!

12. మనసు దాచి
మరోలా చెప్పడానికే
ఇప్పుడు భాష!

13. రిసెర్చి
కంపారటివ్ స్టడీ!
నిజమే - ఏ విషయంలో?

14. రైల్లో వెళుతోంటే
చెట్లే కావు -
స్మృతులు కూడ వెనక్కి!

15. జెండా ఎంతో ఎత్తున!
స్తంభం?
నేలలో - పాతుకుపోయి!

16. ఇద్దరిలో
ఒకరు దుష్టులా? - చాలు!
ఏకాంత నేరాలు!

17. బంకవచ్చు!
పాపం రాదు! -
అన్నవాడు - రాక్షస గురువు!

18. తల్లులు ముగ్గురు -
ఐనా రాముడు
ఏకపత్నీవ్రతుడు!

19. మార్క్స్ చెప్పని
ఎన్నో ఎక్స్‌ప్లాయిటేషన్స్ -
పైకి చెప్పలేనివి!

20. రాధా గోపికలు
ఫ్రాయిడ్ చెప్పినట్టు -
పచ్చి కోరికలు!

21. భీముని కంచు విగ్రహం
ముక్కలైంది -
పెదనాన్న ప్రేమ!

22. అన్ని అకృత్యాలకి
ఒకే ఔషధం -
అమృతాంజనం!

23. విశ్వమానవుడు -
పొరుగువాడితో
నిత్యం తగాదా!

24. గడియారపు ముళ్ళు
నగరాల్లో
మనుషుల కాళ్ళు!

25. బివేరాఫ్ డాగ్స్ - బోర్డు!
లోపల
నాలుక్కాళ్ళ కుక్క - ఒక్కటే!

26. ఎవడు హీరో?
ఎవడు విలన్?
తేల్చి చెప్పేది హీరోయిన్!

27. ఐతే సూపర్ హిట్!
లేదా అట్టర్ ఫ్లాప్!
హైటెక్ సినిమా - ప్రేమ!

28. లోకానికి
తెలిస్తేనే - తప్పు!
తెలియకపోతే - ఒప్పే!

29. పొరపాటా? - తప్పు!
పట్టుబడ్డావా? - నేరం!
దాచావా? - పాపం!

30. ఏవి తప్పులు?
తెలియాలంటే -
ఇతరులు చెయ్యాలి!

31. చితుల సెగలకి
ఊరంతా
ఏసీ చేసినట్టు - కాశి!

32. దాచాలనుకున్నావా? -
నిప్పుల్ని!
చూడు - అంటుకుంది కొంగు!

33. జంతువుల్లో సైతం
జాతి సాంకర్యం!
చేయించింది - మనిషి!

34. చిన్నప్పుడు
కాపీ రైటింగ్!
కాస్త పెద్దయితే - కాపీరైట్!

35. బ్యాగు నిండా పుస్తకాలు
స్కూలుకి!
కాలేజీకి - ఒకటే!

36. ప్రొఫెసర్రా!
పోతాడులేవోయ్!
ల్యాబ్అటెండర్-నమస్తే గురూ!

37. నూర్రోజులు
హిట్ ఇచ్చింది హీరోయిన్!
క్రెడిట్ మాత్రం - హీరోకి!

38. హీరోయిన్ బికినీల్లో!
డైరెక్టర్ తల్లీ, పెళ్ళాం -
చీరల్లో!

(సశేషం)

తమిళపులుల విప్లవగీతాలు:

# శ్రీలంక తమిళ కవితలు

*("శ్రీలంకాద తమిళు కవనగళు" అనే కవితా సంకలనం ప్రొ॥ ఎస్. కార్లోస్‌గారి సంపాదకత్వంలో కన్నడంలో వెలువడింది. మూలంలోని తమిళ కవితలను శ్రీమతి తమిళ్ సెల్వి, శ్రీ నెల్లికుంట వెంకటేశ్, శ్రీ కె. నరసింహమూర్తి కన్నడంలోకి అనువదించారు. ఈ కన్నడ అనువాదక కవితలను శ్రీ గుత్తి జోళదరాశి చంద్రశేఖర రెడ్డిగారు తెలుగులో పెట్టారు. వీరందరికీ కృతజ్ఞులం - సంపాదకుడు).*

## 1. అణచివుంచిన సాయంత్రం

– నక్షత్రన్ చెవ్విందియన్

సాయంత్రం ఎండ చల్లబడుతోంది
సొగసైన దుఃఖం నన్నావరించు కొంటున్నది
మనుషుల్ని పోగొట్టుకొన్న వీథిలో
ఈనాడే పరిచయమైన
బాలికల వెంట సైకిల్‌పై పోతాను
పాదలావరించిన చీలుదారిలో
మొదట ఒక సైకిల్ పోయిన గురుతుంది
కొన్నేళ్ళ క్రితం
నేను పోగొట్టుకొన్న నమ్మకం, పంతం,
మనోవేదన, చింత .... అన్నింటినీ
పొందాను నేడు
మనుషుల్ని పోగొట్టుకొని
మౌనంగా వున్న దారిలో
టైర్లు రాళ్ళమీద చేసే శబ్దం వినిపిస్తోంది ....

*(పై పేరుతో కవితలు వ్రాస్తున్నవారు "అరుళ్ అంబళవాళర్". శ్రీలంకలోని కరవెట్టిలో 1974లో జన్మించారు. "వసంతం 1991" అనేది వీరి తొలి కవితల సంపుటి. "జాఫ్నా" "ఎల్‌టిటిఇ" పట్టులో ఉండగా తమిళనాడులోని "త్రికోణమలై"లో మూడేళ్ళు ఉన్నారు. 1996లో ఆస్ట్రేలియా వెళ్ళి, రాజకీయ అర్థశాస్త్రం చదివారు. అక్కడే స్థిరపడ్డారు.)*

# 2. ఒక వేసవి రాత్రి 1981

- ఐ.వి.యస్. జయపాలన్

కలవారి యింటి పిల్లలు నవ్వుతూంటే
తన్నులు తిన్న పనిపిల్లలా
పసిడిలా వ్యాపించిన ఎర్రవరికంకి విస్తారం
తలవాల్చుకొని
తమిళుల వరిమళ్ళు కాలిపోయి పడి వున్నాయి.

ఆహ్లాదమైన సంధ్యాసమయంలో
"వెల్లావళి"[1] గుడిసెలో నేనున్నాను.
"మునుపట్లా లేనేలేరు
ఈనాటి జాఫ్నా పిల్లలు
మనబిడ్డలు"
మండి మసైన ప్రక్కింటిలో
ఊరి కావలివాళ్ళల్లో ఒకడు చెప్పాడు.

చెట్టు చిలగడలు (టపియోకా) కాల్చుకు తిని
మసిబారిన వ్రేళ్ళను
తుపాకి గొట్టానికి తుడిచాను
నిన్నటి ఈ వేళకి ఈ గుడిసెలో
"పిళ్ళైయాన్ తంబి"[2] మాతోనే వున్నాడు.
నేడు ఆ కాలువ బోదుల్ని కౌగలించుకొని
పోరాటపు గాయాలతో పడివున్నాడు
నేటి రాత్రిని ఎలా గడిపేది?
రేపటిరాత్రులు ఎలా వస్తాయి?

*(1. శ్రీలంక తూర్పు సరిహద్దులో ఓ గ్రామం.*
*2. శ్రీలంకలో 1981 శాసనం మేరకు సింహళీయులు తమిళులకు చెందిన ప్రదేశాల్ని ఆక్రమించుకొని వ్యవసాయం నెపంతో తమిళుల్ని ఘోరంగా బయటకు తరిమిన సందర్భంలో "పిళ్ళైయాన్ తంబి" ప్రతిఘటించి, ఉద్యమం లేవదీసి, తాను చచ్చి, తన జనులకు ఆ నేల మిగిల్చాడు. (ప్రారంభపు తమిళపోరాట యోధులలో ఇతనూ ఒకడు.)*

## 3. నమ్మిక

- ఐ.వి.యస్. జయపాలన్

జంట బాసిన కోయిల
శోకంలా
మెల్లమెల్లగా
ఒరుసుకు వస్తున్నవి
నదిలోని నీళ్ళు

గాలిలో ఊగే
వెదురు బంగుల నడుమ
ఎగిరిపడుతున్నవి
వరాల చేపలు
నిండు వేసవి

మండే యిసుకలో
ఎండిన మర్రిపళ్ళ
చిన్న చిన్న విత్తులు
రాలిపడివుండటం చూచి
నిరాశ చెందుతాను.

అయినా
ఎక్కడో దూరంగా
ఇంపైన గొంతుతో
వానపాట పాడుతాడు
"వన్నియూరు"[1] బాలుడు!

*(1. శ్రీలంక సైన్యం జాఫ్నాలో చొరబడినప్పుడు ఎల్.టి.టి.ఐ. వాళ్ళు "వన్నియూర్"లో రక్షణ పొంది, అక్కడి నుంచే శ్రీలంక సైన్యాన్ని త్రిప్పికొట్టారు.*

*2. ఐ.వి.ఎస్. జయపాలన్ - జాఫ్నాలోని 'ఉడువిల్'లో 1946లో జన్మించారు. ఆర్థికశాస్త్రంలో పట్టభద్రులు. ముస్లింలకు విరుద్ధంగా ఎల్.టి.టి.ఇ. గైకొన్న నిర్ణయాన్ని వ్యతిరేకించారు. "సూర్య నొడనె పేసుదిల్" (= సూర్యునితో మాట్లాడటం); "ఈళత్తుమణ్ణుం - ఎంగళ్ ముగంగళుం" (= శ్రీలంక మన్నూ - మా ముఖాలూ) మొదలైనవి వీరి కృతులు. తమిళ సాహిత్య రంగంలో సుప్రసిద్ధులు.)*

## 4. ఉద్యన వనమూ - కుహూ స్వరమూ

- హంసధ్వని (తమిళ సెల్వన్)

నా నాడూ ఉద్యానవనమూ
మంటలపాలై
పొగనిండిన కాడు.
ఇంకా అణిగిపోలేదు.
బూడిద కొండలో నిలిచి

ఏ సాగరంలోనో నిలిచే నీకు
వ్రాస్తున్నాను.

మిత్రమా!
ఇది నీకూ తెలుసు
కళ్ళకలకా కావచ్చును
ఆకాశాన్ని సూటిగా
చూడ్డం కన్నా

నీవు
వేరేమి
చేస్తావు?

నీవు
మరలి వచ్చేటప్పటికి
నాడూ ఉద్యానవనమూ
ఉంటాయని చెప్పలేను

నీవు
ఇదంతా
సహజమేనంటావా?

నేను
ఉండలేనలా
నా ఉద్యానవనం
నాకు కావాలి
నా కుహూస్వరం
నాకే మిగలాలి!

*[శ్రీలంకలో అనేక పోరాటాలకు నెలవైన "వన్ని" ప్రదేశంలో "చెట్టికుళం" అనే గ్రామంలో జన్మించిన "తమిళ సెల్వన్" తమిళ సాహిత్యంలో పట్టభద్రులై, ఇప్పుడు కెనడాలోని "మాంట్రియల్"లో ఉన్నారు. "సిరైగళిల్ ఇరుందు" (చెరసాలల నుండి), "అక్కరైపోన అమ్మవుక్కు" (అటుపోయిన అమ్మకు) మొదలైన కవితా సంపుటాల కర్త].*

## 5. జీవాగ్ని

– ఎస్. బోస్

ఇక చలనం లేదు
బ్రతికి వుండటం గురించీ
చింత లేదు
చావును ముఖాముఖి ఎదుర్కొనే సిద్ధతలో
బ్రతుకుభయాన్ని చితినిచేసి
కొరివి పెట్టేశా
నాకు నేనే
మండేదీ నేనే!

కాలుడా!
ఇంక పోయిరా!
నీ పాశంలో చిక్కుకుంది
నే ఉమ్మిన ఎంగిలిలో
వలపేనిన చిన్నజీవి
సాంబశివుడా! రా!
సంతోషంగా తాండవమాడు
నా ఎదలోని నిప్పే నీ నాట్యరంగం
లోకం నాలో బూడిదయ్యింది
తీసిపెట్టుకో నుదుట
నా బూడిద అణువణువూ రోమాంచనమొందనీ
ఎప్పుడూ వెలిగే నీ నిత్యజ్యోతిలో
భగ్గునమండే నా చితిఊపిరీ
కలగలిసిపోనీ తాండవలోలా!
నిప్పు కణిక చేతబట్టిన నాకెల్లప్పుడూ
కొత్తజన్మ ఉండనీ
అన్నింటా జీవాగ్నియై ఉన్న శంకరా!
నన్ను సజీవంగా ఉండనీ.

*(యుద్ధప్రదేశంగా ప్రసిద్ధమైన వన్ని నివాసులు శ్రీ ఎస్.బోస్. అనేక తమిళ పత్రికల్లో వీరి కవితలు ప్రచురితమవుతున్నాయి. కావ్యవిమర్శలో పేరుపొందినవారు.)*

# ఉద్ధవుడి కోసం

- ఒరియా మూలం: శకుంతలాదేవి
తెలుగు అనువాదం: డా॥ తుర్లపాటి రాజేశ్వరి

("నీ మనసే నీ గురువు - ఉద్ధవా! ఏమిటీ ప్రశ్నలు?" - మహాభాగవతం.)

నువ్వు ఎవరికోసం రాస్తున్నావ్?
ఎందుకు రాస్తున్నావ్?
సూర్యతాపంతో వేడెక్కిన వసుధను
నువ్వు వర్షంలాగ
సేలయేటిలాగ
ఆశ్వాసించి, ఈ ఎడారిని చైతన్యవంతం చేసి
హరితభూమిగా చేస్తానంటావు.
నిన్నెవరు అర్థం చేసుకుంటారు?
నీలమోహనుడిలాంటి నిశీథివేళలో
కాంతులు జిమ్మే ఆ నిశి కన్నులు
నీ మనస్సీమల అంతరాంతరాలలోనికి చొచ్చుకుపోయి ...
పంకాన్ని ఈ వలకి లాగి తెచ్చాయి...
నిన్ను కాంతి ప్రపూర్ణునిగా చేసాయి ...
నిజమే ... కావచ్చు ...
నువ్వు భూమిమీద విరిగిపడిన ధనస్సువి.
ఇది మాలిన్యపూరితం... సంకుచితమైన మార్గం.
చూసి ... చూసి ... నువ్వేం అర్థం చేసుకున్నావ్? ...
అధికస్నేహంతో, ఆదరంతో పచ్చటి ఆకులు ... ఆహారంగా
మేకకు అందించిన ఆ హస్తాలే ...
మరికొన్ని క్షణాలకే వాడికత్తితో ... బలిపశువునిచేసి ఖండిస్తాయి,,,
జీవనమూలాలు ఎంత వెదికినా ... ఊహుం ...
చేతికి అందవు.
ఒక్క మాటైనా చెప్పటానికి
ఒక్క నిట్టూర్పు విడివటానికి
కూడా సమయం ఉండదు.

చమత్కారాలతో - కల్పనలతో గ్రంథాలు రాసే ఉత్తమ రచయితా ...
నీకు దగ్గరగా అన్నీ ఉన్నాయనే భ్రాంతిలో ఉంటావు ...
కానీ వెనక్కి చూస్తే నీది విషాదం నిండిన
కొండచిలువలాంటి క్షుధిత జీవనం.
ఉద్ధవా...! నీ భావనాశక్తి, కళాకాంతులు అన్నీ కరిగిపోతాయి ...
కొన్నాళ్ళు పోతే ... నీవు అలసిపోతావు ...
నీ కలం కదలనని మొండికేస్తుంది ...
నువ్వు అచేతనంగా - శవంలాగ పడిఉంటావు.
ఎవరు నీ గురించి చింతిస్తారు?
నువ్వు మరణించాక నీ గురించి మాట్లాడతారు ...
'ఇక్కడొక జీవన్మృతుడు ఉండేవాడు ... కవి ...
ఆ ... బాగానే రాసేవాడు ...
ఇప్పుడిక లేడు ... కన్నుమూశాడు ...!
తారాజువ్వలాగ పదాలు ఆకసంలోకి ఎగురుతాయి.
అర్థమైందా ... పిచ్చివాడా ... ఉద్ధవా...!
కృష్ణుడి నామజపం వదిలి
ఏమిటీ వెర్రి ఆకాంక్షలు!
కురుక్షేత్రంలో శిరసులు ఖండింపబడి
మొండాలతో శతచ్ఛిద్ర గాయాలతో
లక్షల లక్షల వీరుల దేహాలు ...
తన కుమారుడని తెలియక ...
ఆ మృతశరీరాన్ని ఊతగా పట్టుకొని
రుధిరపుటేఱును దాటిన మానధనుడు - సుయోధనుడు...
ఓ పిచ్చి ఉద్ధవా ... ఇవన్నీ రాస్తే
నీకేం లభిస్తుంది? ...

"కవిత్వమొక దేవాలయం. దానిలోకి అడుగుపెట్టేటప్పుడు మనిషే కాదు దేవుడు కూడా కాళ్ళు కడుక్కొని, ఆచమనం చేసికొని, చెప్పులు బయట విడచి, గుడిఘంట కొట్టి, వినయ వినమ్రతతో చేతులు జోడించి లోపల ప్రవేశించాలి". - శేషేంద్ర

# ఒక గర్వకారణమైన అనుభూతి

(నేను 1969 డిసెంబరు 27వ తేదినాడు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో కన్నడ విభాగంలో తెలుగు ఉపన్యాసకుడుగా చేరాను. మూడునెలలపాటు కష్టపడి కన్నడ భాషనేర్చుకొని, కన్నడ ఎం.ఏ., విద్యార్థులకు, కన్నడ బి.ఏ. ఆనర్స్ విద్యార్థులకు (కన్నడ మాధ్యమంలో) తెలుగు భాషా సాహిత్యాలు బోధించేవాడిని. నేను తెలుగు సాహిత్యం చెపుతుంటే కన్నడ విద్యార్థులు ఎంతగానో ఆనందించేవారు. దేవుని దయవల్ల; దిగుమర్తి సీతారామస్వామిగారు, పింగళి లక్ష్మీకాంతంగారు, తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు వంటి గురువుల ఆశీస్సుల వల్ల నాకు ఈ పాఠ ప్రవచన శక్తి వచ్చింది. 1971-72 బ్యాచ్ బి.ఏ. ఆనర్సు రెండవ సంవత్సరం విద్యార్థులలో చిరంజీవి నరహళ్ళి బాలసుబ్రహ్మణ్యం అనే విద్యార్థి ఉండేవాడు. రెండేళ్ళపాటు నా తెలుగు పాఠాలు విని ఆనందించిన అతడు నన్ను గురించి ఈ క్రింది కవితను వ్రాశాడు. దీనిని కన్నడ మహాకవి కె.వి. పుట్టప్ప ('కువెంపు') రచించిన "శ్రీ రామాయణదర్శనం" పుస్తకంలో వ్రాసి, సంవత్సరం చివరలో జరిగే వీడ్కోలు సభలో ఆ గ్రంథాన్ని విద్యార్థులపరంగా నాకు బహూకరించాడు. తరువాత బాలసుబ్రహ్మణ్యం కన్నడంలో ఎం.ఏ.; పిహెచ్.డి. డిగ్రీలు పూర్తి చేశాడు. ఉపన్యాసక వృత్తిలో చేరాడు. కన్నడంలో గొప్ప విమర్శకుడుగా పేరు ప్రఖ్యాతులు గడించాడు. ఇప్పుడు బెంగుళూరులోని శేషాద్రిపురం కళాశాలలో కన్నడ ప్రొఫెసర్‌గాను, ప్రిన్సిపాల్‌గాను పనిచేస్తున్నాడు. 35 ఏళ్ళక్రిందట ఇతడు వ్రాసిన ఈ కవిత నా అధ్యాపక జీవితానికి ఒక కలికి తురాయిగా భావిస్తున్నాను.) - తంగిరాల

## నం మాస్తరు

- నరహళ్ళి బాలసుబ్రహ్మణ్య

భీమకాయద వ్యక్తి
ముగ్ధ ముఖదింద
ముగుళునగె నక్కాగ
ఎష్టు చెంద!

తలెయ తుంబిద తెలుగు
కన్నడది బరువాగ
అంబెగాలిన తొదలు
ముంజావ బిసిలు!

సరసదలి బుక్క బిచ్చి
ఎల్ల తలెగూ చుచ్చి
తృప్తియిందలి నగువ
ఇవర కెచ్చు
విద్యార్థిగళిగె బలు
అచ్చుమెచ్చు!!

అనువాదం:

# మా మేష్టారు

- నరహళ్ళి బాలసుబ్రహ్మణ్యం

భీమకాయపు వ్యక్తి
ముగ్ధముఖంతో
చిరునవ్వు నవ్వినపుడు
ఎంత అందం!

తల నిండిన తెలుగు
కన్నడలో వస్తున్నపుడు
ప్రాకుతున్న చంటిబిడ్డ తడబాటు
ప్రొద్దుపొడుపు లేతఎండ దీటు!

సరసంగా బుక్కు తెరచి
అందరి తలలనూ చులచి
తృప్తిగానవ్వే ఈయన నిక్కు
విద్యార్థులకు మిక్కిలి చొక్కు!!

❧❧❧❧

ఆధ్యాత్మిక ఆంగ్ల మహాకావ్యం:

# సావిత్రి

- మూలం: మహర్షి అరవిందయోగి

- అనుసృజన: ఆచార్య తంబిశెట్టి రామకృష్ణ

(మహర్షి అరవిందయోగి రచించిన "సావిత్రి" జగత్ప్రసిద్ధమైన ఆంగ్ల మహాకావ్యం. ఇంత సుదీర్ఘమైన మహాకావ్యం ఆంగ్లసాహిత్యంలో మరొకటి లేదు. ఇందులో మూడు భాగాలున్నాయి. ఒక్కొక్క భాగం కొన్ని పుస్తకాలుగా విడదీయబడింది. ఒక్కొక్క పుస్తకం మళ్ళీ ఆశ్వాసాలుగా వర్గీకరించబడింది. మూడు భాగాలలో ఉన్న 12 పుస్తకాలలో మొత్తం 49 ఆశ్వాసాలున్నాయి. ఈ మహాకావ్యం 724 పుటలలో, సుమారు 25,000 పద్యపాదాలుగా వ్యాపించి ఉంది.

ఈ మహాకావ్యంలో - అన్నీ - పాంచభౌతిక పదార్థాలు, తరులు, గిరులు, నదీనదాలు, నరులు, సురలు, అసురులు, సకలభువన సంచయాలు - సజీవాలైన పాత్రలుగా దర్శనమిస్తాయి. ఇందులో రమణీయమైన నాటకీయత ఉంది. అలంకార వైచిత్రి ఉంది. ఇది సాహితీప్రియులకు ఎంతైనా సంతసం కలిగిస్తుంది. సాధకులకు యోగమార్గాన్ని నిర్దేశిస్తుంది. ఇంకేం కావాలి ఈ మానవజన్మకు? నన్ను నేను పునీతుణ్ణి చేసుకోవడం కోసం, అతి వినమ్రుడనై చేస్తున్న ఒక చిరు ప్రయత్నమే ఈ అనుసృజన).

మొదటిభాగం: మొదటిపుస్తకం:

# ఆరంభగ్రంథం

## ప్రథమాశ్వాసం

# ఉదయం పుట్టుక

అది అమరులు నిద్రిస్తున్న వేళ
వారు మేలుకోవడానికి ఒక్క ఘడియ ముందు -
శబ్దానికి భావం, కాలానికి గతి ఇంకా ఏర్పడలేదు.
అది ఆది మధ్యాంత రహిత నిశ్శబ్ద జగతి
అంతటా నిండిన శూన్యం.
ఎక్కడో, రూప గుణాతీతమైన ఒక అంతశ్శక్తి
మేలు కుంటున్న జాడ.
అంతటా అలుముకున్న సృష్టి రహస్యపు చీకట్లు -
చీకట్లను ఛేదించుకుంటూ,
గుర్తు తెలియని గమ్యాలను చేరుకోవాలని
తపిస్తున్న ఒక అజ్ఞాత శక్తి కదలిక.
చేతన - అచేతనావస్థల మధ్య, కొట్టుమిట్టాడుతున్న,
జ్ఞాన శూన్యమైన బలిమి, వదలని నిద్రమత్తులో,
తన చుట్టూ తాను తిరుగుతున్న సవ్వడి.
జాడలేని నీడగా, కనిపించని కలగా,
బుద్ధి పరిధికి ఆవల నిలిచిన భావంగా,
జగతి మేలుకుంటున్న అలికిడి.

లేవాలనే తపన, వెళ్ళాలనే యాతన -
ఎక్కడికి వెళ్ళాలో తెలియని అయోమయం.
రూపు సంతరించుకోవటానికి వదలని, బృహత్ ప్రయత్నం.
రూపు రేఖలు నిర్ధారించుకోలేని, అశక్తత.
సుదూర గతంలో, ఒక ఫలించని కోరిక,
చెదరిన స్మృతి, మూతబడిన కన్నులు -

తన్ను తాను వెతుక్కుంటున్న ఒక విఫల ప్రయత్నం
పాతిపెట్టబడ్డ గతంలోంచి, ఒక వారసత్వం ఒళ్ళు విదుల్చుకుంది.
పురిటి నొప్పుల్లోంచి బయట పడటానికి -
ఇది మరో ప్రయత్నం - మరో ప్రపంచం.
బుద్ధిలోంచి స్పృహకు, స్పృహలోంచి ప్రజ్ఞవైపు -
ఎప్పుడో రానున్న మహాప్రస్థానం వైపు -
ఒక్క వెలుగు రేఖ కనిపించగలదన్న ఆశ.
బ్రహ్మాండపు బుగ్గమీద, పురిటి బిడ్డ వేలిస్పర్శ -
తళుక్కున మెరసిన ఒక మెరుపు,
భళ్ళున తెరుచుకున్న ఒక తలుపు,
మూగవోయిన అగాధాల వైపు,
చూపు సారించిన ఒక దివ్య చక్షువు -
ఆధిభౌతికశక్తులు సేదతీరిన వైనం.
కుంటువడిన ఆనందపుహేల కోసం,
వెదకుచున్న ఆదిత్యహృదయం.
జడత్వం, అలసత్వం కలసి తెచ్చిన,
మత్తులోంచి, మగత నిద్రలోంచి,
ప్రజ్ఞ పరాకాష్ఠగా, ఆనందం పరమావధిగా,
ఒక జీవం, ప్రాణం పోసుకోవటానికి
అదిగో - ఆధిభౌతిక ప్రపంచాలనుండి,
వినిపిస్తున్న పిలుపు.

నిరాశ, నిస్పృహలతో క్రుంగిపోయిన ప్రకృతి,
మళ్ళీ, చూపులతో, స్పర్శతో -
తన్ను తాను సంబాళించుకున్నది.
''లోచన'' లోంచి ఆలోచన ఉద్భవించినది
నిశీథిని చీల్చి, నిశ్శబ్దాన్ని ఛేదించింది
శిథిల సమాధిలోంచి, బయటపడ్డ జీవం,
పతనం చెరపిన స్మృతుల్లోంచి,
గతాన్ని అన్వేషించి,
కొత్త పుంతలు సంతరించుకోవాలి

కొత్త ఆశ్రయం వెతుక్కోవాలి.
స్వర్గలోకాల్లోంచి, వ్యక్తావ్యక్తంగా -
కనిపించిందో అభయముద్ర -
మేలుకున్న ఆశల స్వప్నాలు
తెరచుకున్న అజ్ఞాతలోకాల ద్వారాలు -
ద్వారాల కావల పసిడివాకిళ్ళు -
ఆ మూల సౌధాల దాగిన సత్యాలు.
జారి పడిన దేవుడి ఉత్తరీయంలా,
చెదరిపోయిన చీకట్లు -
ఒక్కసారిగా వెలుగు చూసిన దార్శనిక జగత్తు.
చిరుచీలికలోంచి కనిపించిన తొలివెలుగు,
కోటి సూర్యప్రభాసమానమై,
ఎల్లెడల వ్యాపించి, అజ్ఞాతలోకాలను ముంచెత్తి,
అవ్యక్తసత్యాల హరివిల్లును ఆవిష్కరించింది.

ఈ ఉషోదయం ఒక నవోదయంగా, తన వింతకాంతుల్ని,
అనంతకాలపు ఘడియల్లో -
విత్తనాలుగా వెదచల్లింది.
ఆకాశపు కాగితం మీద, ఆధ్యాత్మిక ఉషోదయాల
రంగురంగుల బమ్మల కథ వెలిసింది.
ఆనందానికి, ఆధిభౌతిక సౌందర్యానికి,
నిర్వచనం రాయబడింది -
ఇకపై, అంతా స్ఫుటం, తేటతెల్లం.
ఇది ఒక భావవిస్ఫోటం -
మదిలో ఎగసిన మాటలమంటలు - అందుకు సాక్ష్యం.
బ్రహ్మాండపు కేంద్రబిందువు నుండి,
తెరచిన నిమీలిత నేత్రాలు - స్వర్గానికి ద్వారాలు.
అంతవరకు, ఖగోళాంతరాళాల మధ్య చిక్కుకున్న,
ఒక సౌందర్యదేవత
విసరిన కనుచూపు
భువన సంచయాల, అనంతయాత్రాసీమలపై నిలిచింది.

ఆమె, తన పాదస్పర్శకై వేచియున్న,
గగనతలంవైపు చూపు సారించింది.
భూగోళం, ఆమె రాకను పసిగట్టింది.
ఆమె పదఘట్టనలు విన్న ప్రకృతి పరవశించింది
ఆమె దరహాస చంద్రికలు, నిశ్శబ్దానికి నీరాజనాలు.
భూవ్యాకాశాల మధ్య, ఉవ్వెత్తున లేచిన సుడిగాలి,
క్రతువై, స్వాగత గీతికయ్యై,
పర్వతశిఖరాగ్రాలపై కెక్కి విస్తుపోయింది.
పైపైకి ఎగసిన తరుశాఖలన్నియు,
గగనతలమునకు తలలు వంచినవి.

అర్థం, పరమార్థం బోధపడని భూగోళం -
చుట్టూ ఆవరించిన అజ్ఞాన తిమిరం -
సందేహాల మధ్య కొలువుతీరిన సత్యం -
ముందే మున్నదో తెలియని వితండవాదం -
శ్రమ, స్వేదం, ఆవేదనలకు ప్రతీకగా మారి,
వంగిన వసుధపై,
మెరిసిన ఉషఃకిరణం, సుప్రభాత శ్రీరాగం.
అస్పష్ట స్వరూపాలను, అద్భుత మూర్తిమంతం చేసి,
కనుమరుగైన,
ఓ దివ్యశక్తి ఆవిర్భావం - ఆపై, అంతర్ధానం.
మర్త్యుల, మానవ మాత్రుల, హృదయాల్లో
ఇమడలేని విరాట్ స్వరూపం,
రానున్న మహామనీషికి సంకేతం.
కాలానికి పరిధుల్ని చెరిపివేస్తూ,
అమరత్వ సిద్ధికి బాటలువేస్తూ,
పంచభూతాల కొత్త సమీకరణం -
భూమిలో, గాలిలో, అంతటా కలిసిపోయింది.
ఇది - ఓ కొత్త ఆవిర్భావానికి ఆదేశం, అమర సందేశం.
సేద దీరి, ఎప్పటిలా మేలుకొన్న పృథ్వి
మళ్ళీ పరుగందుకొన్న జీవనం (సశేషం)

గీటురాయి-1:

# పురుషోత్తముడు

- డా॥ మల్లేల గురవయ్య

అధునాతనాంధ్ర పద్యమహాకావ్య స్రష్టలలో శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి సుప్రసిద్ధులు. వారు రససిద్ధులు. వీరింతకు మునుపు కైకేయి - తరంగిణి మాఘమేఘములు' రచించి పలువురి ప్రశంసలు, ఘనసన్మానములందికొని యున్నారు. వీరి అనువాద కావ్యము మాఘ-మేఘము అమోఘమైనది. అది సర్వ స్వతంత్ర కావ్యమువలె తన విశిష్టతను చాటుకొన్నది. ఇటీవల వీరనువదించిన కుట్టికవి (వాంఛేశ్వర కవి) మహిష శతకము కూడ వెలువడి, పండితులందఱ కానందము నందించినది.

ప్రకృతము 'పురుషోత్తముడు' ప్రబంధమును గూర్చి నాలుగు మాటలు. చారిత్రక ప్రాధాన్యముగల పురుషోత్తముని గూర్చి, ఇతఃపూర్వము నాకు తెలిసినంత వరకు కీ.శే. గాడేపల్లి కుక్కుటేశ్వరరావు 'విజయముద్ర'ను, డా. మేడసాని మోహన్ "పురుషోత్తమ చక్రవర్తి" ని వ్రాసియున్నారు. ఒక ఖండ కావ్యముగా వెలువడిన 'విజయ ముద్ర ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీవారి పురస్కారము నందుకొన్నది. పురుషోత్తము చక్రవర్తి ప్రచారమునకు రాలేదు. శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారి 'పురుషోత్తముడు' తప్పక వారి కీర్తి ప్రతిష్ఠల నినుమడింప జేయగల మహాకావ్యమని నా విశ్వాసము.

శ్రీ చి. కృష్ణమూర్తిగారి రచన మఱెవ్వరు అనుసరింపలేని అనుకరణ సాధ్యము కాని ప్రత్యేకశైలి కలది. అది నిజముగా దైవవర ప్రసాదము. సంవాదాత్మక శైలిలో పాత్రల మనస్తత్త్వ చిత్రణ, సన్నివేశ సంవిధాన చాతురి, రసోజ్జ్వల భావపుష్టి, వ్యర్థపద ప్రయోగములు లేని అర్థ గౌరవము, భావమునకు తగిన భాషాసౌష్ఠవము సహృదయులైన పాఠకుల హృదయములలో హత్తుకొని శాశ్వత ప్రగాఢముద్ర వేయగల ప్రతిభావిశేషము, వర్ణితవస్తువును హృదయపీఠములో ప్రత్యక్షముగా ప్రదర్శింప జేయగల మహాద్భుత సామర్థ్యము, సందర్భ శుద్ధిని బట్టి అలంకారములను అలవోకగా ప్రయోగించు ప్రజ్ఞాధురీణత, సుదీర్ఘ సమాసములను సుందరముగా రసబంధురముగా కూర్పుగల నేర్పు, ఒక్కొక్కప్పుడు అలతి అలతి పదములతో మహార్థస్ఫూర్తిని స్ఫురింపజేయు వైలక్షణ్య వైచక్షణ్యములు, నిత్యవ్యవహార యోగ్యముగా అతిసహజములైన అచ్చతెలుగు పదముల సొబగులతో రసరామణీయక మొనర్చుట; జాతీయములు, సామెతలు, నుడులు, లోకోక్తులు

నీతులు ప్రయోగించి కావ్యసౌందర్యమును అర్ధగాంభీర్యముతో ఇనుమడింప జేయుట -ఇట్లెన్నో మహోత్తమ కావ్యకళా సృష్టికి వలయు సర్వ సల్లక్షణములను సందర్భోచితముగా సమన్వయించి వీరు నిర్మించిన మహాకావ్య సృష్టి సర్వదా క్షణక్షణ నవ్యతా రామణీయకము. శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారి 'పురుషోత్తముడు' చారిత్రక మహా కావ్యము. సాధారణ సామాజిక రచనకన్న చారిత్రక రచన ఎంతో కష్టతరము. ఇందు ఇతివృత్తపరముగా మొదట చారిత్రక సత్యాసత్య నిర్ణయము జరుగవలెను. దానికి తగిన ఉపపత్తులను సమీకరించి, అవి కథాకథన గమనమునకు ప్రతిబంధకములు కాని రీతిలో మలచుకొని, కల్పనలకే మాత్రము కించిదవకాశము కూడ కలిగింపక జాగరూకతతో కావ్య నిర్మితికి పూనుకొనవలెను. ఇది కత్తిమీద సాము వంటిది. లభించిన యథార్థ సంఘటనలను ఉన్నదున్నట్లు చెప్పిన అది కేవలము చరిత్రయేయగును. రసపుష్టితో కావ్యకళాసృష్టి సర్వజన సంతుష్టిప్రదముగా సాగించుటలో చూపవలసిన మెలకువలు పాలకువలెట్టివో శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారికి చక్కగా తెలియును. వీరియింటి పేరు చిటిప్రోలు. కాని వీరి కావ్యకళాసామ్రాజ్యము సువిశాలమైనది. ఆయన కృష్ణమూర్తి కావున కావ్యమే ఒక విశ్వముగా విశ్వరూప దర్శనము చూపించిరి.

ఇక సంగ్రహముగా 'పురుషోత్తముడు' కావ్యమును సమీక్షింతము. ఈ గ్రంథమున 'ఆముఖము'లో ఇరువది పద్యములును, ఉపసంహారములో తొమ్మిది పద్యములును ఉన్నవి. ఇవిగాక ఆచార్య తంగిరాల వెంకట సుబ్బరావుగారికి అంకితముగా వ్రాసిన పద్యములు పదునేడు. శ్రీ చి. కృష్ణమూర్తిగారు ఈ ఖండకావ్యమును ఎనిమిది ఖండములుగా విభజించిరి. అందలి పద్యములు 1106. ఇందలి ఆముఖమునందే కావ్యార్థసూచన వస్తుగతముగా సూర్యప్రస్తుతితో సాగినది. పురుషోత్తముని పరిపాలన లోకబాంధవుడైన సూర్యుని విలోకనములలో జగత్ప్రశస్తి వహించుచుండగా ఒక వెఱ్ఱిమబ్బు తునక మత్సరము పూనినదట. ఇది విశ్వవిజేత కావలెనని దండెత్తిన గ్రీకురాజు అలెగ్జాండరును తక్షశిలరాజు అంభి ఆశ్రయించి దేశద్రోహమున కొడిగట్టిన వృత్తాంతమును సూచించుచున్నది. ఎందుకు మాత్సర్యము పూనెనో కారణమనూహ్యము. ప్రక్కయిల్లు పచ్చగానున్నచో చూచి ఓర్వలేని క్షుద్రుల మనఃప్రవృత్తి క్రమముగా ఈర్ష్యాద్వేషములతో, వెక్కసమగు అక్కసుతో శాశ్వత శత్రుత్వముగా మారుట సహజమే.

ఒక సూర్యుడేమి శతసూర్యులు మింట దీపించినను ఆ ప్రతాపమును రూపుమాపుదునని కాలాంబుదము విజృంభించినది. ఆ మహామేఘమునకు స్వాగత

మొసగుటకై ఒక చిన్న మబ్బుతునక ఎదురేగినది. నూఱుకాదు శతసహస్ర మేఘములు వచ్చి చుట్టుముట్టినను, దివ్య ప్రతాపదీపితుడైన ప్రభాకరుని ప్రభలవన్నె తగ్గునా! ఎంత ఔద్ధత్యముతో ఎదిరించినను మబ్బులన్నియు చివరకు నీరు కాఱిపోవలసినదే. ఇందు నీరు కాఱిపోవుటయను ప్రయోగము శ్రీ కృష్ణమూర్తిగారి అద్వితీయ రసౌచితీ నిరూపణకు నిదర్శనము. దివాకరుని దివ్యతేజస్సుతో సమస్తలోకము మేల్కని చైతన్యప్రదమై వెలుగొంది తీరునను భావ్యభ్యుదయ కాంక్షతో ఆముఖము ముగిసినది. కావ్యార్థ సూచనలోని మబ్బుతునకయె అంభి. ఇతడు పురుషోత్తముని సామ్రాజ్యమునకు ప్రక్క తక్షశిలలో పాదుకొని ఎప్పటి తన పూర్వుల పూర్వవైరమునకో మఱల ఇప్పుడు గట్టి పునాదులు వేసికొనుచున్నాడు. అతడు దీర్ఘద్వేషి. ఆజన్మాంతము కోపము రూపముగన్న కుటిలుడు. నీచాతినీచ ప్రవృత్తికి అతడు ప్రతిరూపము. సమగ్ర దేశసౌభాగ్య సంపత్తికి స్వస్తి పలికి, దేశవిచ్ఛిత్తికి నిత్యమాయోపాయములు పన్ను నికృష్టుడు. దీనికి పూర్తిగా భిన్నుడు నిత్యసత్య గుణసంపన్నుడైన పురుషోత్తముడు. తన్ను చంపవచ్చిన కసాయి వానికైన దీర్ఘాయుస్సు నాశించు మహోదారుడు. ప్రథమ ఖండమున అధముడైన అంభి అవినీతిని సూత్రప్రాయముగా తెలిపి పురుషోత్తముని ఉత్తమగుణములను కవి విలక్షణ రీతిలో వివరించెను. అంతటి మహోన్నతునికి ఎంతటి క్రూరదుష్ట ప్రాణియైన హాని చేయతలపెట్టదు.రాజులందఱు సూర్యతేజములో వెలుగు రాజువలె ప్రకాశింపగా, ఒక్క అంభి మాత్రమే ఒక కొయ్య బమ్మవలె నిస్తేజుడై పురుషోత్తముని మహోన్నత గుణములకు ఒక మబ్బు రేకవలె అహిత బుద్ధితో వర్తిల్లినాడు. అతని పోకడలన్నియు తెలిసిన పురుషోత్తముడు అంభియెడ ఆవంతయు అల్క చూపలేదు. అంభి ఎన్నెన్నో పన్నాగములు పన్ని తన తెలివితేటలన్ని వెలుగబెట్టి ఏదియు ఫలింపక ఎంతగా దిగులు చెందెనో ఆ దైవమునకే ఎఱుక. పురుషోత్తము నెదిరించుటకు చిన్ని అవకాశమైనను ఎప్పుడు దొరకునా అని ఎదురుచూచుచున్నాడు. ఈ ప్రథమ ఖండములో తోడేలు - మేక కథను ఒక్క ముక్కతో పోల్చిన విధము ఎంతో రసౌచితిని కూర్చినది.

ద్వితీయ ఖండము ప్రధానముగా అంభికి - అతని చెల్లెలు ప్రార్థనాదేవికి జరిగిన సంవాదమునకే ప్రాముఖ్యమీయ బడినది. గ్రీకురాజు దాడిచేయనున్నాడని అంభికి తెలిసినది. ఇక అతని ఆలోచనా పరంపరలకు అంతులేదు. స్వాగతముతో ఎదురేగి ముందుగా తక్షశిలకు ముప్పు కలుగకుండ చూచుకొనవలెను. అటుపై అతని తోడి మైత్రితో పురుషోత్తముని పని ముగింపవలెనని తలచినాడు. ఇది యెఱిగిన అంభి చెల్లెలు ప్రార్థనాదేవి - "పులి రాక తెలిసి పరువులు తీసెదవా? లేక పోలియింతువా?"అని ప్రశ్నించినది. వెంటనే సమాధానము రాలేదు. అటుపై

"అవును గ్రీకురాజు భారతభూమిపై పాదము మోపుచున్నాడు. సేనాబలముకన్న అతని గురువు అరిస్టాటిల్ బుద్ధిబలమే విజయ సాధనము. అతడింతవరకు పరాజయ మెఱుగుడు. పరపతాక భారతాకాశవీథిలో ఎగురక తప్పునా?" అన్నచెల్లెంద్ర నడుమ సుదీర్ఘ చర్చ సాగినది. పాంచాలపతికి ఆహ్వానమంపవలెనని నీకెట్లు నోరు వచ్చినది? మనకు వారికి ఒద్దిక కలదా? అతని పురుషోత్తమ నామము నేతిబీఱ" అన్నాడు. వెంటనే ప్రార్ధనాదేవి "అన్నా! ఎంతమాట! అతడు సార్థక నామధేయుడు. నిలువెల్ల అతనిలో విషమని పల్కుట తగునా! దేశరక్షణ మహాయజ్ఞములో పాల్గన రమ్మని వర్తమాన మంపు"మన్నది. అంత అన్న "నాపై అతనికి కించిత్తు కూడ గౌరవము లేదు. నన్నొక నీచునిగా ఆ దుర్మతి తలచుచున్నాడు. మొన్ననే వాడొక దూతను మంతనమునకై పంపినాడు. అతడాతని కుమారుడట" అని అనగా "ఎప్పుడో మనకు వారికి సంబంధములు తెగినవి. దేశరక్షణకై యిప్పుడొక్కటియగుట మంచిది కదా" అని ప్రార్ధన తెలిపినది. అంత అంభి "నేనీ దినమే సరిహద్దులలో ఉన్న అలెగ్జాండరుకు సగౌరవముగా స్వాగతము పలికెదను. యవనులు దండెత్తుచున్నారని ఇంతకు మునుపు కొంత వంత చెందితిని. కాని అదియే యిపుడు నాకు శుభమును కలిగింప గలదని అనిపించినది. నీ వెఱ్ఱిమొఱ్ఱి పలుకులకు నేనిపుడు కోపగించుకొనకూడదు. ఆ గ్రీకురాజుకు తగిన సత్కృతికూడ చేసెదను" అనెను. అతని మాటలకు చెల్లెలు చెవులు చిల్లులు పడినట్లైనది. "ఇట్టిమాటలు కట్టిపెట్టు"మన్నది. తన నాశమునకు తానే గోతులు త్రవ్వుకొనుటయా! "పురుషోత్తమునిపై నీవైరము దుర్భరమ్మైనచో వీరధర్మివై నీ మగటిమి చూపి మార్కొనుము. త్వరపడక సావధానముగా ఆలోచింపుము" అని చెల్లెలు హెచ్చరించినది. కాని వానిలో మార్పు రాలేదు. "నేనోర్పు చూపుకొలది నీవు రెచ్చిపోవుచున్నావు. తాతకు దగ్గులు నేర్పుదువా! ముందు వెనుకలన్ని ఆలోచించియే ఆ సికిందరును యవనప్రభువును కలిసికొనుటకు నిశ్చయించికొన్నాను. ఇక మాటాడకు. నేనా ముష్కర పాంచాలరాజు ముఖము చూడను" అన్నాడు. అపుడు ఆమె అన్నతో "అన్నన్నా ఎంతమాట! నన్నెంతో ప్రేమతో పెంచిన నిన్ను ధిక్కరింతునా! అన్నియు తెలిసినవారు కూడ ఒక్కొక్కప్పుడు పొరపడుట సహజమే. నీవిప్పుడు పాంచాలరాజునెడ వైముఖ్యము చూపుచున్నావు. రేపు గ్రీకురాజు పరిస్థితి యెట్లుండునో యోచింపుము. మాతృరక్షా మహాయజ్ఞములో సమిధిగా సమసిపోవుటే ఉత్తమ ధర్మము" అన్నది. అంత అన్న "ఎందుకీతర్కములు? పాంచాలరాజు పదవీచ్యుతుడైన గాని నా మనస్సులో రగులు మంట ఆరదు. ఇకనెవ్వరెన్ని చెప్పినను నేను లెక్కింపను. గ్రీకులతో పొందుకోరుట తథ్యము" అని నిష్కర్షగా కుండ బ్రద్దలు

కొట్టినట్లు అంభి పలికినాడు. వెంటనే ప్రార్థనాదేవి "ఒక్క నీవు ఆ యవనప్రభువు, సమస్తరాజులు ఒక్కటిగా వచ్చి యెదిరించినను పురుషోత్తముడొక్కడే తగిన సమాధాన మియ్యగలడు. నాడు నారాయణుడే యీ రాఘవుడని నమ్మి విభీషణుడు అన్నను వదలి రాలేదా! కలుషాత్ముడైన శత్రువును నీవు ఆశ్రయించినచో ఈ లోకము నిన్ను మన్నించునా!" అని వాపోయినది. ఎంత చెప్పినను అంభి తన బుద్ధి మార్చుకొనలేదు. "నేను నా ప్రయత్నములలో నిమగ్నమగుదును. ఎవరైన ఇది దోసమన్నచో వాడెంతవాడైన క్షంతవ్యుడు కాడు. నేడే గ్రీకు భూవిభుని మైత్రీ సంపత్తికై పోవలెను. చెల్లెలవు కాబట్టి నిన్నుపేక్షించుచున్నాను. ఇక నీతో వ్యర్థముగా మాటలాడుకొను చున్నచో మంచి అవకాశము తప్పిపోవును. వెంటనే నీవికపోయి మనస్సును కుదుట పరచుకొమ్ము" అనినాడు. అపుడు ప్రార్థనాదేవి తన ప్రార్థన లాలకింపని అన్న పిచ్చి పోకడలకు ముందు ముందెన్నెన్ని చిక్కులు రానున్నవో అని భావించినది. చివరగా అన్నతో "ఇనుమైన కరిగి వెన్నయగునట్టి నా విన్నపము కన్నీరు నీకు అపహాస్యములైనవి. నీకు బాహ్యచక్షువులే కాని హృదయము గ్రుడ్డిదైనది. మగవారు మగతనముతో వర్తించినప్పుడు మగువలకు రాజకీయములు తగవు. మగతనము పోయి మందులైనచో మగువలు మిన్నకుండుట సరికాదు. అపుడు జాతియే నశించును." అని కొంత తీవ్రముగా ప్రార్థనాదేవి మాటాడినది. ఇక ఈ పురమున కాపురముండుటయే తగదని నిశ్చయించుకొన్నది. అప్పుడంభి "ఏమీ! మూర్ఖావేశముతో ఇల్లు వీడి పోదలచితివా! నన్ను నా నగరమును వీడిపోయిన నిన్నెవ్వరాదరింతురు? ఆ పురుషోత్తముని పంచ చేరెదవా! అరుల పంచ పరుల పంచ కాలిడుట తలవంపులు సుమా! ఇల్లు వదలి పోదునని నీవు బెదిరింపులు పలికిన నేను భయపడను. తల్లితండ్రి తానుగా నుండి నిన్ను పెంచి పెద్దజేసిన నీయన్నయన్న మాటలు విని నా ఆనగా అణగిమణగి యుండుము" అన్నాడు. కాని ఆమె చివరకు విడిపోక తప్పదని నిర్ణయించినది. "నేనా పురుషోత్తముని దరికేగుచున్నాను. భారతకీర్తి కేతనము భంగము సేయని వాని పాదములాశ్రయించుటలో తలవంపులు లేవు. నేనేమి సాధింపగలనని నీ అనుమానమా! అవసరమైనచో అతివలు అశనిపాతములు కుప్పింపగలరు సుమా! నీవు భారతమాత కన్నులలో నెత్తురు జత్తిల్లజేయుట కరుగు చున్నావు. నేను విరోధి రక్తమును తల్లికింపుగా నింపి - సస్యశ్యామల మొనరించుటకై ఏగుచున్నాను" అని తెలిపి చివాలున అటనుండి ప్రార్థన వెడలెను. జీవచైతన్యములు లేని చిత్రమువలె మారు మాటాడక అంభి అట్లే నిశ్చేష్టుడై చూచుచుండెను. ఇట్లీ ద్వితీయ ఖండములో రెండు విభిన్న దృక్పథముల మధ్య సాగిన సంవాదము అత్యద్భుతముగా నున్నది. **(సశేషం)**

గీటురాయి-2:

# మంచు మైదానం

- డా॥ జీగురు అయిలయ్య

"మంచు మైదానం" ఒక యాత్రాస్మృతుల లిఖిత కావ్యం. ఒక అనుభూతుల తలపోత. కవి వి.ఆర్. విద్యార్థి హృదయం విప్పారి పుప్పొడులై తేలియాడిన ఉద్విగ్న క్షణాలు. కళలు అలలు అలలుగా సాగిపోయిన సందర్భం. ఒక కవిగా, సృజనశీలిగా తనదైన శైలిలో స్పందించిన లోతైన విశ్లేషణ. ఇవన్నీ కలగల్సిన ఒక అద్భుత అక్షరీకరణే ఈ 'మంచు మైదానం' కవితా సంపుటి. ఇది తెలుగు సాహితీ వనంలో పుష్పించిన ఒక మహోన్నత అక్షర సంపద.

కవి వి.ఆర్. విద్యార్థి కేవలం ఒక మాజీ సైనికోద్యోగి, ఒక రిటైర్డు ఆర్.ఇ.సి. ఇంజనీర్ మాత్రమే కాదు. గొప్ప ప్రకృతి ప్రేమికుడు. ప్రపంచమంతా పదికాలాలపాటు పచ్చగా వర్ధిల్లాలనే తపన గలవాడు. సున్నిత మనస్కుడు. అందుకే అందరు యాత్రికుల్లాగా ప్రయాణంచేసి రాలేదు. అందరి తల్లిదండ్రుల్లాగ పిల్లాపాపలతో హాయిగా గడిపి కాలం వెళ్ళబుచ్చలేదు! ఇప్పటి వరకు తూర్పుయూరప్‌లో అనేక పరిణామాలు చోటుచేసుకున్న నేపథ్యంలో, ఇవాళ అమెరికా అనివార్యంగా ప్రపంచానికంతా విద్యా, శాస్త్ర సాంకేతిక రంగాలకు ఒక పరిశోధన కేంద్రంగా మిగిలింది. ఇది ప్రపంచం నలుమూలలనుండి వచ్చి స్థిరపడిన మేధాసమూహం. విభిన్న సంస్కృతుల, సంప్రదాయాల సమ్మేళనం. మనిషి నాగరికుడై నిర్మించుకున్న ఒక అద్భుత సకలసంపదలు, సౌకర్యాలుగల దేశం. ఈ కవి అమెరికాకు పోతూపోతూ, వస్తూవస్తూ అనేక అనుభవాలను, అనుభూతులను మోసుకొచ్చాడు. దాని సంస్కృతులను, సౌరభాలను తనవెంట తీసుకొచ్చాడు. అవి కేవలం తన బంధుమిత్రులకే పరిమితం చేయకుండా, సాహితీ ప్రియులందరికీ పంచిపెట్టాడు.

ఒక దేశ ఆర్థిక, రాజకీయ ఆకాంక్షలు, సంస్కృతులు ఇంకో దేశానికి రుచించక పోవచ్చు. భిన్నాభిప్రాయాలు కల్గి ఉండవచ్చు. ఇందుకు ఎవరి అభ్యంతరాలు వారివి. ఎవరి అభీష్టాలు వారివి. ఎవరి భౌగోళిక, సాంస్కృతిక నియమాలను అనుసరించి వారి వారి జీవనశైలి ఉంటుంది. అయితే వారి సామాజిక నీతులు, నియమాలు మరో దేశంపై బలవంతంగా రుద్దటం నేరం. తమ సంస్కృతే గొప్పదనే భావం కల్గిఉండటం ఒక అహంకారం. ఒక అమానవీయత. మానవ హక్కుల ఉల్లంఘన. ఒక దేశం తాను రూపొందించుకున్న రాజ్యాంగం, నిర్మించుకున్న ప్రభుత్వ విధానాలు, చట్టాల ప్రకారం ఆ దేశ ప్రజలకు సకలసౌకర్యాలు, సామాజిక, ఆర్థిక భద్రత కల్పించటం నాగరికం.

ఇంకా జవాబుదారిగా ఉండటం ఆ దేశంయొక్క ఉన్నతసంస్కృతికి ప్రతీక. ఒక నిదర్శనం.

'మంచు మైదానం' కవితా సంపుటిలో కవి వి.ఆర్. విద్యార్థి అమెరికాలోని 'నాసా'ను దర్శించి 'నువ్వు అనంత విశ్వానికి/ముఖ ద్వారానివి/మానవ యశస్సువి/నవనవోన్మేష మేధస్సువి' అంటాడు. అమెరికా 1969 సం॥లో చంద్ర మండలం మీదికి పంపించిన 'అపోలో - 11' చూసి చలించి ముగ్ధుడౌతాడు. 'నాసా/నీ ముందు/దూరాలు కరిగి పోతున్నాయి/ ఒకరి మంచి చెడ్డలు/ఒకరం తెల్సుకునే రోజులు/దూరమేమి లేదు' అంటూనే 'నీ నుంచి ఆశించేది/విశ్వమానవ సంక్షేమం/వినాశ బుద్ధి సంహరణం' అని హితవు కోరుతాడు. 'లాస్ వే గాస్' అనే కవితలో 'నీ జేబులు/బరువు గుంటె/గులాబిలై వికసిస్తాయ్/నీ గుండెలు కలల ఖజానలై/మెరుస్తాయ్ నీ కన్నులు/ఇట బతుకే ఒక ఉత్సవము/దేశ దేశ సంపన్నుల విడిది ఇది' అని సంబరపడతాడు. మళ్ళీ వెంటనే 'గరీబోడు కాలు మోపే స్థలం కాదు' అని ఆర్థిక అసమానతలు గల సమాజాల గురించి చింతిస్తూ బాధపడతాడు. బెంగపడతాడు.

'నయాగరా' కవితలో 'అది ఎన్ని యుగాల మాట/ఒకానొక జాగృత సంధ్యలో/ఏ నక్షత్రం కన్నబిడ్డో' అంటూ ప్రకృతి ఈ మానవాళికి ప్రసాదించిన గొప్ప వరప్రసాదినితో తనివితీర ముచ్చటిస్తాడు. మునకేస్తాడు, తాను ఆ ప్రకృతి దృశ్య సాంగత్యంలో పరవశుడౌతూ, 'పగలు చూస్తే/ప్రాణం పోసుకున్న/ముత్యాల గుంపులు చిందుతూ/ ఇంద్ర ధనుస్సులు పుష్పిస్తూ/ రాత్రి వేళ అది/ రంగుల తారా పరివారం/ప్రకృతి ధరించిన చీర కుచ్చిళ్ళు' అంటూ దాని రసరమ్యతకు ముగ్ధుడౌతాడు. ఇంకా అంతటితో ఆగక 'నయాగరా' జలపాతం యొక్క అంతరంగంలో జరబడి, పరకాయ ప్రవేశం చేసి 'ఆ రోజుల్లో/స్వచ్ఛమైన ప్రకృతి/ఒళ్ళు విదిల్చి నర్తించే/ పదకింకిణి తాను/ ఇప్పుడు తన చుట్టూ/ఊపిరాడనంతగా/ నాగరికతల కంచె/రహదారుల వలలు/వికృత ప్రతికల్పన/తనని కబళిస్తోంది' అంటూ దుఃఖశీలుడవుతాడు.

కవి వి.ఆర్.విద్యార్థి నిగర్వి. నిర్మోహమాటస్తుడు. 'స్వేచ్ఛ' అతని ప్రాణ వాయువు. ఎంతటి ప్రకృతి ప్రేమికుడో అంతటి సామాజిక విలువలకు, సృజన శీలతకు నిబద్ధత గలవాడు కూడా. 'వెలుగు' కవితలో 'దళారి మనస్సు/సృజనవనంలో/ఎక్కడైనా/వో మిణుగురు స్పందించిందో.../గుప్పిట్లో బంధించి/రాజ్యం చేస్తూ/వో వెలుగు వెలగాలనుకుంటుంది' అంటూ ఒక దేశంయొక్క పెత్తందారి పోకడలను నిరసిస్తాడు. దుయ్యబడతాడు.

యాంత్రీకరణ పెరిగిన కొద్దీ మనిషి పరాయీకరణ చెందుతాడు. మర బమ్మై శ్వాసిస్తాడు. ఇంకా ప్రకృతికి దూరమైతాడు. అనేక అనురాగాల్ని, అనుభూతుల్ని కోల్పోతాడు. ఈ భావాన్ని తనదైన శైలిలో 'బ్యాలెన్స్' కవితలో 'నిజం చెప్పాలంటే/ నువ్వు పుట్టినప్పుడు/చచ్చినప్పుడు/ఇంకా బతుకు లోను/స్పృహే ఉండదని' వేగవంతమైన జీవనశైలి గురించి జాలిపడతాడు. ఇంకా 'నువ్వు బతికింది లేనిదీ/ బతికితే ఎంత బతికిందీ/ఆ లెక్కలన్నీ/నీ తర్వాతే తేలేది' అంటూ కొంత తాత్వికతను జోడించి మనకు చెపుతాడు. మనిషి సహజత్వాన్ని కోల్పోకుండా, సృజనశీలురై ఉండాల్సిన జాగురూకతను బోధిస్తాడు. 'అలర్ట్' చేస్తాడు.

'మనిషి జాగ్రత' కవితలో 'వొస్తున్న వివరాలను చూస్తే/మార్స్ మీద మనిషి/ ఎప్పటికైనా స్థిరపడతాడు' అంటూనే 'ఇక్కడి/దళారుల చూపులు/అక్కడికి పాకుతాయి/ఇంటర్ ప్లానెటైజేషన్/వ్యాపారం కోసం/మార్స్‌నూ కేంద్రంగా చేస్తారు/పేటెంట్ హక్కులంటారు/యుద్ధం కొరకంచులో/వేగినోడిగా/చావు బతుకుల సరిహద్దు/కరవాలం అంచుమీద నడిచినోడిగా/రహస్యమొక్కటి చెప్పిపోతాను/మార్స్‌ను 'స్టార్ వార్స్'కు/కేంద్రంగా ఎంచుకుంటారు/అనంత విశ్వంలో/ప్రాణి మనుగడకే ముప్పు తెస్తారు/క్షణాల్లో 'గెలాక్సీ'ని/మసి చేస్తారు/ అప్పటికి నేనుండనుగాని/దళారీ విషప్పురుగులతో/మీరు జాగ్రత్త/తర్వాత తరాలు/జాగ్రత్త' అని సామ్రాజ్యవాదపు కొత్త పోకడలను, ఎత్తుగడలను పసిగట్టి భవిష్యద్దర్శనం కల్గిస్తాడు.

'దూరం' కవితలో మనిషి సామూహికతను కోల్పోయి, మానవీయ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలుగా మారుతున్న వైనాన్ని మనకు కళ్ళకు కట్టినట్టు చిత్రీకరిస్తాడు. 'కుటుంబంలో సైతం/ఒక్కొక్కరో ద్వీపం/సోమవారం నుండి/ శుక్రవారం దాకా/నీకు నువ్వే అపరిచితుడివి' అంటూ బాధపడతాడు. 'ధీ సంజీవని' కవితలో 'మిత్రమా మనం/ఒకింత బతుకు దెరువు కోసం/అమృతం కురిసే రాత్రుల్ని/చెమటోడ్చే పగళ్ళలో పోగొట్టుకున్నాం' అంటూనే 'ఇప్పుడు మన మాటకు/ మనం పరాయిలం/మన పాటకు/మనం బధిరులం/మన సంస్కృతికి/మనం అపరిచితులం/మన చరిత్ర/మనకు ఐతరేయం/మన దేశానికి/మనమే పరదేశీయులం' అంటూ అభివృద్ధి పేరున జరిగే మేధావలసలపై అంతర్మథనం చెందుతాడు. బాధపడతాడు. 'ఆనవాళ్ళు' కవితలో 'నిన్న నువ్వొచ్చి/ నా పురాతన చరిత్ర సౌధాన్ని/పునాదులతో తవ్వి పడేసి/నీ అల్ప సంస్కృతిని/అమోఘంగా దిద్దు కుంటున్నావు/నీ నేర చరిత్రను/పావన భాష్యంగా/ప్రచారం చేసుకుంటున్నావు' అంటూ నిలదీస్తాడు.

ఇంకా 'స్పర్శ' కవితలో తన జీవిత సహచరి, సహధర్మచారిణి అయిన రత్నమాలతో తిరుగు ప్రయాణంలో సేదతీరుతూ అనుభూతుల్ని నెమర వేసుకుంటూ ఊసులాడుకుంటారు. 'ప్రియతమా!/మనకు సరిహద్దులు లేవు/ అన్ని బంధాలకు అతీతంగా/ఎలా తేలిపోతున్నాం' అని మురిసిపోతారు. అంటూనే 'స్పృశింపబడడానికి/అంతరిక్షమే కానక్కర్లేదు/తపోవనాల్లో/నిష్క్రమించాల్సిన/అవసరం లేదు/కాకుంటే ఇక్కడ/ఏకాంతంలో/ఈదే అవకాశం లభించింది' అని తన్మయత్వం చెందుతారు. ఇంకా 'ఎగిరే పక్షిని పడగొట్టి/కాల్చుకు తినడం/వేటగాడి నైజం/భయపడితే పక్షి/నక్షత్రమై వెలిగేదెప్పుడు/ఏ మూల/ఏ యుద్ధం పొంచి ఉన్నదో/ఏ ప్రభుత్వం/దేనికి ఎరవేసి కూర్చున్నదో/ఎవడు మన సమస్తాన్ని దోచుకోవడానికి/సమాయత్తమౌతున్నాడో/ఎలా తెల్సు?/ఇదో అంతులేని/ముగిసిపోని యుద్ధం/అనివార్యంగా/యుద్ధంలో మనము/సిపాయిలం కావొచ్చు' అంటూ మానవ జీవితాల్లో అనివార్యమవుతున్న పరిస్థితులను తల్చుకుంటూ ఆవేదన చెందుతాడు.

ఇది వారి అన్యోన్య దాంపత్యానికి, అనురాగానికి పరాకాష్ఠ. పదవీ విరమణ చేసిన తల్లిదండ్రులకు, అత్తమామలకు అంతగా ఆదర్శవంతమైన కొడుకులు, కోడళ్ళు ఉండటం వారి అదృష్టం. అంతరించి పోతున్న మానవ సంబంధాలకు ఓ చెంపపెట్టు. వారి జీవన సరళి ఆధునిక కుటుంబాలకు ఒక జలధార.

చివరిగా, వి.ఆర్.విద్యార్థి ఈ అనుభూతులను తానొక్కడే కాకుండా సమస్త మానవులూ అనుభవించాలనుకుంటాడు. ఎక్కడైనా ఎప్పుడైనా విశ్వమానవ విహంగమై, స్వేచ్ఛగా ఎగిరే రోజులు రావాలని, ఉండాలని ఒక మానవీయ సమాజాన్ని ఆకాంక్షిస్తున్నాడు. ఇందుకు ఎటువంటి కట్టుబాట్లు, తనిఖీలు, నిఘాలు ఉండకూడదని కోరుకుంటున్నాడు. అప్పుడే మానవ సమూహాలు, విశ్వవ్యాప్త పరిమళమై మానవజాతి శోభిల్లుతుందని అతని ప్రగాఢ విశ్వాసం. ఆ విశ్వాసాన్ని మనమంతా మంచి మనస్సుతో స్వాగతిద్దాం.

ఈ పుస్తకం యొక్క ముఖచిత్రం శ్రీ వేణు సంకోజు మరియు శ్రీనివాస్ నాయక్‌ల అద్భుత కళాతృష్ణను ప్రతిబింబిస్తూ అనేక ప్రకృతి వర్ణాలు ఒలకబోస్తోంది. అట్ట చివరి పేజిలో 'నయగరా' జలపాతం, ఇన్‌సెట్‌లో 'కవి దంపతుల' ఫోటోగ్రఫీ శ్రీ అమరేంద్ర వేలూరిగారి సృజనశీలతకు అద్దంపడుతుంది. తెలుగు పాఠకులందరూ తప్పక చదవాల్సిన గొప్ప కవితా సంకలనం ఇది.



అనుబంధం-1:

# కవితా నీరాజనం

## 'గానకోకిల' శ్రీ దర్శి లక్ష్మీవేంకటేశ్వరవరప్రసాదరావుపంతులుగారి షష్ట్యబ్దిపూర్తి మహోత్సవంలో వివిధ మహాకవులు చల్లిన ఆశీరక్షతలు

## 8-8-2007, బుధవారం, బెంగుళూరు

## జీవన రేఖలు

"ప్రసాదరావు" అనే వీరి అసలు పేరుకన్నా కొసరు పేరైన "పంతులు" అనేదే జగత్ప్రసిద్ధం.

1. **జననం:** 8-8-1947.
2. **తల్లిదండ్రులు:** పార్వతమ్మ - వేంకట సుబ్బారావు
3. **పితామహి - పితామహుడు :** లక్ష్మమ్మ - లక్ష్మీనారాయణ
4. **కులం, గోత్రం :** ఆరువేల నియోగి బ్రాహ్మణులు, భారద్వాజస గోత్రం
5. **స్వగ్రామం :** 'దర్శి', ప్రకాశం జిల్లా (పొదిలి దగ్గర ఉన్న 'దర్శి' కాదు, ఇది కోనంగి దగ్గర ఉన్న 'ఇసుక దర్శి').
6. **అన్నదమ్ములు-7, అక్కచెల్లెళ్ళు-7** (అన్నదమ్ములలో ఈయన ఏడవవారు)
7. **విద్యాభ్యాసం :** ప్రాథమిక విద్య - 'దర్శి' గ్రామంలో
   ఉన్నత విద్య - 'వలపర్ల' హైస్కూలులో (S.S.L.C. వరకు)
8. **అభిరుచులు:** సంగీతం, నటన.

   (1) తల్లి పార్వతమ్మగారు గొప్ప సంగీత విద్వాంసురాలు. ఆమె దగ్గరనే పంతులుగారు సంగీతం నేర్చుకున్నారు. తల్లి నేర్పిన మొట్టమొదటి పాట "శ్రీకృష్ణ తులాభారము" నాటకంలో చందాల కేశవదాసుగారు రచించిన "బలేమంచి చౌకబేరము... మించినన్ దొరుకదు సుజనులార! బలేమంచి చౌకబేరము" అనేపాట. నాటకాన్ని ముత్తరాజు సుబ్బారావుగారు రచించినా ఈ పాట మాత్రం కేశవదాసుగారు వ్రాశారు. మన మొట్టమొదటి సినిమా పాట కూడా ఇదే. (సినీమా పాటలు వ్రాసిన రెండవ వ్యక్తి తోలేటి వెంకటరెడ్డి).

దీని తరువాత "బాల కనకమయ చేల...." అనే త్యాగరాజ కీర్తన నేర్పింది తల్లి.

(2) తండ్రి వేంకటసుబ్బారావుగారికి పద్యనాటకాలంటే చాలా ఇష్టం. 'అబ్బూరి' వంటి ఎందరో ప్రసిద్ధ రంగస్థల నటులతో ఆయనకు సన్నిహిత సంబంధాలుండేవి. ఆయన పంతులుగారికి నేర్పిన మొట్టమొదటి పద్యం (శ్లోకం) "శ్రీ రాఘవం దశరథాత్మజ మప్రమేయం..." అనేది.

(3) 1956లో (9ఏళ్ళ వయసులో) టంగుటూరి ప్రకాశం పంతులుగారి సభలో ప్రార్థన చేసి ఆయన ఆశీస్సులు పొందారు ప్రసాదరావుగారు. ("ఎవ్వనిచే జనించు జగము..." అనే పోతన పద్యాన్ని పాడారు).

9. **నటన-నాటకరంగం:** 9 సంవత్సరాల వయస్సులోనే పాండవోద్యోగ విజయాలలో వికర్ణునిపాత్ర ధరించారు. తరువాత యౌవనదశలో 'శ్రీ రామాంజనేయ యుద్ధం'లో రామునిపాత్ర, ఉద్యోగవిజయాలలో శ్రీకృష్ణుని పాత్ర సత్యహరిశ్చంద్రలో విశ్వామిత్రునిపాత్ర ధరించి పేరుప్రఖ్యాతులు గడించారు. 1990లో అఖిలభారత తెలుగురచయితల మూడవ మహాసభలలో (బెంగుళూరులో) 'పడకసీను'లో కృష్ణుడుగా నటించారు. ఆచంట వెంకటరత్నంనాయుడుగారు దుర్యోధన పాత్ర ధరించారు.

10. **సినిమా రంగం:** ప్రసాదరావుగారు తెలుగు కన్నడ భాషలలో కొన్ని సినిమాలలో కూడా నటించారు. 'వీలునామా' (1967) - 'నాటకాల రాయుడు' (1969) - 'తల్లా? పెళ్లామా?' (1970) - 'మల్లెల మనసులు' (1973) అనేవి తెలుగు సినిమాలు. 'ప్రచండ స్నేహితరు' - 'రవివర్మ' - 'అభిమన్యు' అనేవి కన్నడ సినిమాలు.

11. **వివాహం-సంతానం:** 1973లో పంతులుగారికి వివాహం జరిగింది. ప్రకాశం జిల్లా 'వేటపాలెం'కు చెందిన 'మల్లెం'వారి ఆడుపడుచు, నవనీతమ్మ - కృష్ణయ్య దంపతుల పుత్రిక 'శ్రీలక్ష్మి'తో పెండ్లి జరిగిన తరువాత 1974 జూన్ 4వ తేదీని బెంగుళూరులో కాపురం పెట్టారు. 1974 నుండి 1992 వరకూ బెంగుళూరులోని యువతీయువకులకు నాటకాలలో తర్ఫీదు ఇచ్చారు. రామాంజనేయయుద్ధం, కృష్ణాంజనేయయుద్ధం, బాలనాగమ్మ, సత్యహరిశ్చంద్ర, పాండవోద్యోగవిజయాలు, వీరాభిమన్యు మొదలైన నాటకాలను నేర్పారు. బుఱ్ఱకథలు, హరికథలు కూడా నేర్పించారు. 1993

నుండి 2005 వరకు రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసి ఆర్థికంగా స్థిరపడ్డారు. శ్రీలక్ష్మి-ప్రసాదరావు దంపతులకు ఒక కొడుడు - ఒక కూతురు. కొడుకు చిరంజీవి శివమారుతి 1977 సెప్టెంబరు 27వ తేదిని జన్మించాడు. B.Com. చదివి వ్యాపారం చేస్తున్నాడు. కూతురు చిరంజీవి అనూరాధ M.Sc. Psychology చదువుతోంది.

12. **మిత్రులు:** పంతులుగారికి మిత్రులు అసంఖ్యాకంగా ఉన్నారు. కవులు, గాయకులు, రంగస్థల నటులు, సినిమానటులు, రాజకీయవేత్తలు (అన్ని పార్టీల వారూ), పారిశ్రామికవేత్తలు .... ఒకరేమిటి ... ఎందరో....... దేశం నలుమూలలా ఉన్నారు. నాటి జమిందారు గోగినేని వెంకటేశ్వరరావుగారితో ప్రారంభించి, ఈనాటి శ్రీ జె.ఎస్. రెడ్డిగారు, శ్రీ డి.కె. ఆదికేశవులుగారి వరకూ ఎందరో ఉన్నారు. బంధువుల కన్నా మిత్రులంటేనే పంతులుగారికి చాలా ఇష్టం. ఆయన మాటల్లోనే చెప్పాలంటే -

"నాకు కుటుంబ సభ్యులనుండి (అంటే అన్నదమ్ముల నుండి, అక్కచెల్లెళ్ళనుండి) ఎటువంటి సహాయమూ అందలేదు. భగవంతుని కృపవల్ల నాకు మంచి స్నేహితులు లభించారు. వారి సహాయంతో జీవితంలో పైకి వచ్చాను."

13. దైవభక్తి - చాలా ఎక్కువ. ముఖ్యంగా రామాయణంలోని ఆంజనేయస్వామి అంటే చాలాయిష్టం. శ్రీవేంకటేశ్వరస్వామిగారు వీరి ఇలవేల్పు. షిర్డీ సాయిబాబాగారిని నమ్మిన భక్తులు. ప్రతిసంవత్సరం షిర్డీ వెళ్ళివస్తూ ఉంటారు.

14. **"జీవితమంటే ఏమిటి?"** - అని నేను వేసిన ప్రశ్నకు పంతులుగారు ఇలా సమాధానం చెప్పారు:- "(జీవితాన్ని)బాగా ఇష్టపడుతూ కష్టపడటం లేదా కష్టపడుతూ (జీవితాన్ని) ఇష్టపడటం. జీవితాన్ని సులభంగా (easy) తీసుకోకూడదు. సంఘర్షణ ఉంటేనే జీవితం అంటే ఏమిటో తెలుస్తుంది. దీనికి ఉదాహరణం రామాయణంలో ఆంజనేయుని వ్యక్తిత్వం!".

2005 పార్థివ ఉగాదినాడు మా "శ్రీరస" పంతులుగారికి "గానకోకిల" అనే బిరుదునిచ్చి సత్కరించింది. బెంగుళూరులోని పెద్ద సాహిత్యసంస్థ "తెలుగు విజ్ఞాన సమితి" కార్యవర్గ సభ్యులలో ప్రసాదరావుగారొకరు.

**- తంగిరాల వెంకటసుబ్బారావు**

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

"గానకోకిల" - నటసమ్రాట్ - స్నేహశీలి - జీవిత సత్యజ్ఞాని - వేంకటేశ్వర, ఆంజనేయ, షిర్డీసాయి భక్తుడు - నిగర్వి - నిరంతర కళోపాసకుడు - మంచికి ప్రాణమిచ్చే మనీషి - శ్రీ దర్శి లక్ష్మీ వేంకటేశ్వర వరప్రసాదరావు పంతులుగారు షష్టి వసంతములు పూర్తి చేసికొన్న శుభవేళ అందించు

# పద్యపుష్పగుచ్ఛము

- టి.వి.కె. సోమయాజులు

తే. 'దరిసి' వంశ విమల పయోధి చంద్ర!
'పార్వతీ - సుబ్బరాయ'ల భవ్యపుత్ర!
'గానకోకిల' నటనా విధాన ధుర్య !
సరస 'వేంకటేశ వరప్రసాదరాయ'
అందు మివె షష్టిపూర్త్యభినందనములు!! 1

క. నినుఁ గన్న 'సర్వజిత్తు'ను
గను భాగ్యము, ఆశిషములు, కంటివి మిత్రా!
ఘనతర 'చంద్ర సహస్రం
బును గను భాగ్యంబు' కూడ పొందుము సుఖివై!! 2

మ. 'శత మానం భవతం' చు ఆశిషము విస్తారంబుగా విప్ర సం
తతి యందించెను షష్టిపూర్తి శుభసందర్భంబునన్ నీకు! ఇ
చ్చితి పద్యంబుల పుష్పగుచ్ఛమిది! 'లక్ష్మీ వేంకటేశా'ఖ్య! ఉ
న్నత భాగ్యంబుల శాంతి సౌఖ్య విభవానందాల వర్ధిల్లుమా! 3

మ. కవులున్ పండితులున్ నటాగ్రణులు ముఖ్యంబైన మిత్రాళి సం
స్తవనీయంబగు నీ చరిత్రమును విస్తారంబుగా మెచ్చి - ని
న్నవలోకించి శుభాభినందనలు నీ కందీయగా షష్టి పూ
ర్తి వసంతోత్సవ మబ్బె! 'గాన నటమూర్తీ'! శ్రీప్రసాదాభిదా! 4

ఆ.వె. ఘనులు 'చిలకమర్తి' - 'కందుకూ'ర్లకు వచ్చె
'పంతుల'న్న బిరుదు ప్రముఖులగుట!
ఎంత ఘనత చూచి ఇచ్చిరో స్నేహితుల్!
'పంతుల'న్న బిరుదు వచ్చె నీకు! 5

సీ. 'నటనా విధాన ప్రజ్ఞాని' వీవనుటకు
ఆంధ్ర నాటకరంగ మదియె సాక్షి!
'సంగీత కళలోన సాటి లేర'నుటకు
ధర 'గాన కోకిల' బిరుదు సాక్షి!
అల 'నటనా విద్య కాచార్యుడ' నుటకు
విరివియౌ నటన తర్ఫీదు సాక్షి!
'మిత్రత్వమును కోరు మేటియౌ' ననుటకు
వర మిత్ర సంఖ్యయే ప్రబలసాక్షి!

తే. సాధు జీవన పరమార్థ సత్యమునకు
అగును నీ జీవితంబుదాహరణ సాక్షి!
నాటక కళావిధాన విజ్ఞాన హృదయ !
సరస సంగీతధుర్య! 'ప్రసాదరాయ'! 6

* * *

## ఆశాసనము

- దుగ్గిరాల రామారావు

క. అరువది యేఁడులు నిండిన
తరుణమ్మున బంధుమిత్రతతితో మహమున్
జరుపుకొను వేంకటేశ్వర
వరప్రసాదు పడయుత! శుభమ్ములు సుఖముల్. 1

సీ. కలికి పార్వతమ వేంకటసుబ్బారావు యు
గ్మము - తపఃఫలముగా - కన్నవాడు,

లలనామతల్లి శ్రీలక్ష్మి చిత్తసరోరు
హము మరందము చూఱలాడువాడు,
ఒక పుత్రు డొక కూతు రొలసి ముచ్చట గొల్పు
పరిమితమ్మగు కుటుంబమ్మువాడు,
పరమాదరమ్ముతో బంధుమిత్రుల చేత
'పంతులూ!' యని పిల్వబడెడివాడు,

తే. ప్రథితికెక్కిన గొప్ప వ్యాపారవేత్త,
దర్శివంశపయోధి చంద్రముడు, వేంక
టేశ్వర వరప్రసాదు నూరేండ్లు పైన
వర్ధిలునుగాక! వేంకటేశ్వరుని కరుణ. 2

ఆ. ఆంజనేయ భక్తు, డభినయరక్తుండు,
గాయకు, డనుకూల నాయకుండు,
దాత, ధార్మికుండు, దర్శి పంతులుగారు
వరలుగాత! దేహబలముతోడ. 3

* * *

# రసాభినందనం

– రసరాజు

ఉ. 'ఘర్షణ లేనిదే బ్రతుకు కబ్బములో రసపుష్టి లేదు – సం
ఘర్షము వల్లనే అసితకంధరముల్ మెరపుల్ సృజించుచున్
వర్షమొసంగు – ఊరకనె వచ్చి, సుఖంబిడి, ఏదియున్ సము
త్కర్షము గూర్పబోదు – వడగాడ్పులనేకము వెన్క, దాగెడిన్!' 1

శా. ఈ సూక్తిన్ మనమందు నిల్పుకొని – తానెన్నో శ్రమల్ పొంది – వి
ద్యాసౌంగంధ్యము నెంచి చూడకనె 'శ్రీ దర్శి'ంచి – సౌందర్య'ల
క్ష్మీ' సౌభాగ్య 'వరప్రసాదము'ను గాంచెన్ – 'వేంకటేశా'ఖ్యుడై
ఆ సప్తాద్రివిభుండు బ్రోవ – సుకృతుండై 'పంతుల'న్నింటిలో! 2

ఉ. నాటకరంగ వైభవము నల్దెసప్రాకగ - ఆతడెంత పో
రాటము సల్పెనో కళలరాణి యెరుంగును - క్రొత్తవారలన్
దీటుగ నిల్పి - తానును గణించెడి పాత్రలు దాల్చె - 'లక్ష్మి'తో
పాటు సరస్వతిన్ గలుగువారలలో నతడెంత ధన్యుడో! 3

ఉ. రంగులు పూసినన్ వదనరంగము పైని - ప్రసన్న జీవన
ప్రాంగణమందు కన్పడవు రంగులు - రంగులు కల్గి యచ్చటన్
రంగులు లేక నిచ్చట విరాజిల గల్గుటదెంత గొప్ప! ఎ
బ్బంగిని 'పంతులీ' ఉభయ పాత్రలలో కృతకృత్యుడాయెనో! 4

ఉ. 'శ్రీరస' - 'గానకోకిల'ను చేసి - ఉగాది మహోదయాన - స
త్కారమొనర్చుటే సముచితంబగు జ్ఞాపిక వానికిన్; కళా
సారమెరింగి ఆప్తులు, రసజ్ఞులు, నేడు సమాదృతిన్ - శుభ
శ్రీ రహియింప 'షష్టి'నొసరించిరి - 'సప్తతి' తొంగిచూడగన్! 5

ఉ. 'పంతులు'గా ప్రసిద్ధుడయి - భారతికిందగు సేవచేసి - సా
మంతులు, పేదవారనెడి మాటలు ప్రక్కకు ద్రోసి - స్నేహ సం
క్రాంతికి పూలదండలను కట్టినవాడతగాడు - 'షష్టి' వా
సంత పరీమళాలవిగొ! 'సాయి' - కృపన్ వెదచల్లె వానిపై! 6

* * *

'గానకోకిల' శ్రీ దర్భి ప్రసాదరావుగారి షష్టిపూర్తి శుభవేళ

## శుభాకాంక్షల సప్తపది

- డా॥ మన్నవ భాస్కరనాయుడు

క. శ్రీకరములు, మాన్యగుణ వ
శీకరములు, వేంకటేశ శ్రీమంత కృపా
శీకరములు, షష్టికి శో
భాకరములు... ఆప్తహృదయ పరిమళ వరముల్ 1

సీ. తొలి పరిచయమునే వెలకట్టలేని వే
జన్మల నిధులుగా చక్కబెట్టు,
సరస సంభాషణా చాతుర్యమున మన
చల్లని కూర్మిని కొల్లగొట్టు,
అనురాగ శాకము అరమర లేకుండ
గుండె కంచాలలో కొసరి పెట్టు,
తెలుగు పద్యానికి తేనెల రుచి అద్ది
వినువారి చెవులకు విందు బెట్టు,

తే. మచ్చలేనట్టి చెలిమికి మచ్చు తునక!
స్వచ్ఛ సంగీత క్షేత్రాన పసిడిమొలక!
'గానకోకిల' అనిపించు కర్మజీవి!
మోదముల రేవు దర్శి ప్రసాదరావు! 2

తే. సరస చైతన్యమొసగు 'శ్రీరస' సభలకు
నిలయగాయక మణియైన నిర్మలుండు,
తేట తెలుగున పాడి కర్ణాట సీమ
హర్షమును పెంచు సంగీత కర్షకుండు. 3

ఉ. కమ్మని కంచుకంఠమున గానము చేయు ప్రసాదరావు నా
తమ్ముడు షష్టివత్సర సుధారసపానము చేయువేళ నా
కమ్మని గుండెలోని మమకారము పొంగి రసాబ్ధిపూరమై
చిమ్మెను పద్య సప్తపది శ్రీకరమైన శుభమ్ము కోరుచున్! 4

సీ. తల్లి పార్వతిగారు తండ్రి సుబ్బారావు
నోముల పంటగా నుతులకెక్కి
ఈరేడు లోకాల కింపైన బంధమౌ
పదునాల్గు మందితో పరిమళించి,
కాంతిమంతమగు ప్రకాశము జిల్లాల
దర్శి గ్రామం పేరు తగ ధరించి,
ఆరువేల నియోగి అరువది శ్రీలుగా
ఛత్ర భారద్వాజ గోత్రమంది,

తే. జన్మభూమి ప్రతిష్ఠను, సంప్రదాయ
సంస్కృతి విధాన నిష్ఠను, జనహృదయ వ
శీకరణ విశిష్టతను, ఈ లోకమునకు
చాటి చెప్పిన సొగసైన మేటి వీవు! 5

క. మున్నీటి తనయ లక్ష్మిని
వెన్నుడు పెండ్లాడినట్లు విధివిహితముగా
చెన్నైన కులము మల్లెం
కన్నియ శ్రీలక్ష్మి చేయి గైకొంటివయా! 6

క. శివమారుతి అను తనయుడు
భవదీయ విశిష్ట హనుమ భక్తికి ధ్వజమే!
పువుతీగ అనూరాధ త
మ వరతనయ మధురమ్మైన మణియగు నిజమే! 7

తే. తల్లిపాల సంగీతము తప్పత్రాగి
తండ్రి హృదయాభినయ రక్తి దాల్చినావు
నాట్య సంగీత కళల విన్నాణమైన
ప్రతిభ నీ సొత్తు సుస్నేహ పట్టభద్ర! 8

ము.సరం. తెలుగు కన్నడ చలన చిత్రము
లలదుకొన్నవి నీదు నటనలు
తెలుగు నాటకరంగ శోభకు
వెలుగు నొసగిన కుశలుడా! 9

తే. ఇష్టపడి జీవితమ్మున కష్టపడుచు,
కష్టపడటమే బ్రతుకున కిష్టమనుచు
కర్మయోగమే మానవ ధర్మమనిన
కృష్ణగీతకు ఋజువుగా ఎదిగినావు! 10

తే. జీవితాన సంఘర్షణ చేవనొసగు
ననుచు నమ్మిన చైతన్యమనము నీది

భిన్నరంగాల బ్రతుకున ఎన్నదగిన
ఘర్షణమ్ము నీ ఆదర్శ వర్షణమ్ము! 11

చ. ముదమును నేర్పు జీవితము మూర్ఖుడు చెప్పిన గాథకాదు, ఆ
ముదమును త్రాగు బేలతనమోర్చెడు గుండెల బాధకాదు, నీ
విధులను సక్రమంబుగ వివేచన చేయుట జీవితంబనే
సదమల శీలిపై సఖుల సంపదనే సమకూర్చుకొంటిమే 12

క. అరవై ఏళ్లయినా ఈ
ఇరవై ఏళ్ళ యువకునికి ఇంపగు సతిగా
వరమతియగు మా సోదరి
కరమున కరమై నడువుడు కనుపండువుగా! 13

తే. కాపురమ్ము ప్రేమాలయ గోపురమ్ము
షష్టిపూర్తి సంసారాన తుష్టకీర్తి!
వేయి పున్నముల్ దర్శించి, విమలమైన
ఆయురారోగ్యములు గల్గి అలరుగాక! 14

ఆ. ఏడడుగులు కలసి తోడుగా నీడగా
నడచి వచ్చి కలలు ముడిచినారు,
కలలలోని తీపి కాంక్షల ఫలములు
ఏడుమలలరేడు ఇచ్చుమీకు! 15

క. షరిడీ బాబా కృపయును,
కరమరుదగు వేంకటేశు కరుణము మీపై
కురియగ, భావి సుమాలై
విరియగ మీ జీవితములు వృద్ధియగునులే! 16

శుభమ్ భూయాత్

* * *

## శ్రీ దర్శి లక్ష్మీవేంకటేశ్వరవరప్రసాదరావు పంతులుగారి షష్ట్యబ్దిపూర్తి

# అభినందనము

- పువ్వాడ తిక్కనసోమయాజి

తే. జీవితాధ్యాయ సంపుటిన్ జిలుగుపుటల
స్వానుభవ కథాకథనముల్ సగమునిండ,
వెనుదిరిగి చూచి, తలయూచి, మునుగడంగ,
తుష్టి జరుపుకొను మహమ్ము - షష్టి పూర్తి. 1

క. 'దర్శి'న్ వెలసె ప్రకాశ ని
దర్శనము, ప్రసాదరాయ ధరణీసురు, డా
దర్శప్రాయుండు, కళా
స్పర్శా "కలకంఠగాన" సంకీర్తనుడై. 2

సీ. సంగీత మధుధార చనుబాల గుడిపిన
తల్లి యుల్లములోని చల్లదనము,
పద్యాల హృద్యతన్ పలుకు నేరుపు బట్ట
తండ్రి శిక్షణలోని తఱపితీపి,
ఆంధ్రకేసరి సభన్ ప్రార్థన పద్యాన
పరిమళించిన బాల్య పరిఢవమ్ము,
చిన్నారి పొన్నారి చిఱుత బ్రాయముననే
పటుపాత్రలు ధరించు నటనదీక్ష

తే. మధుర జీవన మందార మాధవముగ
నవ్యగాన ప్రవంతి కానందలహరి
నోలలాడించె నీ 'పద్యలోలు', నవని,
షష్టి పుష్టించి, ఫలియించె షష్టిపూర్తి! 3

సీ. 'పాండవోద్యోగముల్' పద్యధారావేగ
'విజయ' వైభవమున విఱ్ఱవీగ

నటరంగము సినిమా నవదంపతులవోలె
'మల్లెల మనసు'లై పల్లవింప
కన్నడ చిత్రసీమోన్నయ సవ్యసా
చిత్వమ్ము 'అభిమన్యు' చెంగలింప
కర్ణాట యువకళాకార బృందమునకు
నభినయాభినివేశ మమర గలిపి

తే. 'మల్లె'పుం బిడ్డ 'శ్రీలక్ష్మి' మనసుదోచి
తనయు 'మారుతి' 'ననురాధ' తనయ గాంచి
తల్లి పార్వతి వేంకటార్యుడు తండ్రి
దీవనల, గడించితివి ప్రతిష్ఠ మిత్ర! 4

శా. శ్రీమత్తిర్పతి వేంకటేశ్వరుని రాశీభూతకారుణ్యమున్
రామస్వామి కటాక్షదక్ష హనుమద్రక్షా సమీక్షాద్యుతుల్
స్వామీ! యున్న వెసన్ లభింతు షిరిడీ సాయీశు సామీప్యమున్
ఈ మీ షష్టిని సత్ప్రసాదమిడె! కొమ్మీ ఆయురైశ్వర్యముల్! 5

(సశేషం)

- కవిత్వం జీవితానికి రూపాంతరం.
- రసమంటే కవి కరిగిపోయి ప్రవహించేది.
- భావాలన్నీ ఆత్మాశ్రయాలే. కనుక కవిత్వమంతా ఆత్మాశ్రయమే. ఆత్మాశ్రయం కాకపోతే కవిత్వం కవిత్వమే కాదు.
- కవిత్వం పుట్టడానికి, కవికి ముందు అనుభవాలు కావాలి. అనుభవాలు అనుభూతులు, అనుభూతులు భావాలు కావాలి.
- వస్తువు కళాత్మకత పొందకపోతే అది కవిత్వం కాదు, కానేరదు.
- కవిత్వం - ఏమి చెప్పడమనే దానికన్నా ఎక్కువగా ఎలా చెప్పడమనే దానిపై ఆధారపడి ఉంటుంది.

- శేషేంద్ర

అనుబంధం-2:

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# అక్షరాక్షతలు

వధువు: చి.సౌ. భార్గవి వరుడు: చి. ఉమామహేశ్వరరెడ్డి

తే. శ్రీకరంబగు తిరుమల శిఖరినలరి
భక్త కోటికి దర్శనభాగ్యమొసగు
ఆర్తజన రక్షకుండు 'పోచా'న్వయమును
'దాసి' వంశమ్ము గాచుత! దయ యెలర్ప. 1

శా. శ్రీమత్తిర్వతి శ్రీనివాసుడు శుభశ్రీలక్ష్మి పద్మావతీ
భామామానస చోరు డర్థిజన కల్పక్ష్మారుహం బోముతన్
ప్రేమన్ 'భార్గవి' - 'రెడ్డి' దంపతులు వర్ధిల్లంగ నశ్రాంతమున్
క్షేమస్థైర్య శుభాయు రభ్యుదయ సుశ్రీలెల్ల నందించుచున్. 2

తే. 'తులసి' - 'విజయభాస్కర' దంపతుల తనూజ
'భార్గవి' - 'ఉమామహేశ్వరు' పాణిపద్మ
మందు కొనినట్టి శుభసమయమ్మునందు
దేవతలు బ్రోచుదురుగాత! దీవనలిడి 3

చ. లలిత నవీన యౌవన విలాసములో విరబూసినట్టి కో
ర్కెల కుసుమాల తేనియలు తృప్తిగ దంపతులార! గ్రోలుడీ!
చిలుకలు - గోరువంకలయి జీవితముల్ కలబోసికొన్న గుం
డెల నొక గొంతులో పలుకుడీ! అనురాగ మనోజ్ఞగీతికల్. 4

ఉ. వెన్నెల వానలో తడిసి, ప్రేమకు వెచ్చని గూళ్ళు కట్టి ఆ
పున్నమిరేయి సిగ్గిల, నపూర్వముగా వినువీథిలోన సౌ
ఖ్యోన్నతు లందుచున్నవవిగో! తమిమీర చకోరముల్; హృదుల్
దొన్నెలు చేసి త్రావుడు వధూవరులార! సుధానురాగముల్. 5

సీ. సన్నాయి పలికెను, సౌభాగ్యశీలురై
పదమూనుడని పూలబాటలందు -
లాజలు కురిసె, చిరంజీవులై పర
స్పరము కూరిమితోడ వరలుడనుచు -
దీవించిన ధరుంధతి సుశీలురై ధాత్రి
స్థాపించుడు యశఃపతాకలనుచు -
శుభతోరణములాడె, శుద్ధాత్ములై కోర్కె
లుయ్యాలలూగుచు నుండుడనుచు -
కవులు, శిల్పులు, చిత్రలేఖకులు వచ్చి -
బంధుమిత్రులు, గాయకవరులు మెచ్చి
పసుపుపచ్చని దీవెనల్ బరపినారు
నవ వసంతము లెన్నెన్నొ నడచిరాగ! 6

మ. రసరాజ్యాన పదంబులూనితిరి - చిల్కల్ గోరువంకల్ వలెన్
ప్రసరింపన్‌వలె మీదుప్రేమ - భవితవ్యంబెల్ల పూదోటయ్యై
మిసిమిందీవలు సాగావలెను - సంపెంగల్, గులాబీలు, జా
జి సుమంబుల్ విరియన్‌వలెన్ పరిమళశ్రీలెల్ల వ్యాపింపగన్. 7

శా. పూవుందావియురీతి నొండొరులు సంఫుల్లానురాగమ్ముతో
సేవేళన్ జరియింపగావలయు, పండింపన్ వలెన్ కోరికల్
పావిత్ర్యంబగు గేస్తు ధర్మమున సౌభాగ్యోదయశ్రీలకుం
దావై - మీరు రహింపగావలయు సత్యాన్వేషణోద్యోగులై. 8

సీ. పచ్చని తోరణపంక్తుల మీదుగా
నవవసంతుడు పెండ్లినడక వచ్చె!
వేయి కోయిలలు సన్నాయిలో శ్రుతిగూర్చి
కల్యాణిరాగాలు కలయబోసె!
కోటి తీవియలు మీ కోసమే కుసుమించి
భవ్యసువాసనల్ పంచియిచ్చె!
మధురవైవాహిక మందార మిదె మీకు
అమృతంపు మధుభాండ మందియిచ్చె!

శ్రీలు విలసిల్ల 'భార్గవీ' ప్రేమమీర
గా 'ఉమామహేశ్వరరెడ్డి!' కలసి మెలసి
హర్షముప్పొంగ ఆనందవర్ష శతము
కోరి సాగింపుడింక సంసార యాత్ర! 9

తే. ఆయురారోగ్య సంవృద్ధి యగునుగాక!
భోగభాగ్యమ్ములవి మిమ్ము పొందుగాక!
అమిత ప్రేమాభివృద్ధి మీకగునుగాక!
లలిత సద్గుణసంతతి కలుగుగాక!! 10

కల్యాణవేదిక:
శ్రీకోందండరామాలయము
సంజీవనగర్, నంద్యాల
15-11-2007

ఇట్లు
మిమ్మాశీర్వదించు -
రసరాజు - టి.వి.కె. సోమయాజులు
తంగిరాల వెంకటసుబ్బారావు

(పరిష్కర్త: దుగ్గిరాల రామారావు)

- రస విశిష్టమైన రచనే కావ్యమవుతుంది.
- కవిత్వమొక ఆత్మకళ.
- శబ్దార్థాలను అలంకరించడమే కవిత కావడం.
- కవి పుట్టింది కవి బ్రతకడానికి కాదు, మనిషిని బ్రతికించడానికి.
- మానవ జీవితాన్ని జీర్ణించుకొని, ఆ బలంతో ఒకమాట చెప్పడమే కవిత్వమవుతుంది.
- కవిత్వమెప్పటికీ దేశకాలాతీతమైన ధర్మాన్ని, సత్యాన్ని చెబుతుంది.
- కవి గొంతుక ఒక శాశ్వత నైతిక శంఖారావం.
- కవిత్వంలో నీతీ ఉంటుంది, రీతీ ఉంటుంది, ప్రయోజనతా ఉంటుంది.

– శేషేంద్ర

# 'శ్రీరస' సాహిత్య సభలు

*(2007వ సంవత్సరం జనవరి నుండి డిసెంబరు వరకు 'శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య' వారు జరిపిన 35 సాహిత్యసభల వివరాలు - సంక్షిప్తంగా)*

**1**

సాహిత్య మహాశివరాత్రి-కీ.శే.నల్లూరి అప్పలరాజుగారి స్మారక సాహిత్యోపన్యాసం (i)

**10-2-2007**, శనివారం, సాయంకాలం 5.30గంటలకు

"ప్రాచీనాంధ్ర సాహిత్యం - పద్యమాధుర్యం"

వక్త : ప్రముఖ రంగస్థలనటుడు డా॥ మీగడ రామలింగస్వామి, విశాఖపట్టణం

వేదిక : గాంధీ సాహిత్యసంఘం, మల్లేశ్వరం, బెంగుళూరు.

**2**

సాహిత్య మహాశివరాత్రి-కీ.శే.నల్లూరి అప్పలరాజుగారి స్మారక సాహిత్యోపన్యాసం (ii)

**11-2-2007**, ఆదివారం, సాయంకాలం 5.30గంటలకు

"తెలుగులో పద్యనాటకాలు"

వక్త : డా॥ మీగడ రామలింగస్వామి

వేదిక : గాంధీ సాహిత్యసంఘం, మల్లేశ్వరం, బెంగుళూరు.

సాహిత్య మహాశివరాత్రి సౌజన్యం: శ్రీమతి సుజాత-శ్రీనల్లూరి సుబ్బరాజు దంపతులు

**3**

శ్రీకృష్ణకర్ణామృతము (పద్యానువాదము) ఆవిష్కరణ సభ, **15-2-2007**, గురువారం, సాయంకాలం **5.00** గంటలకు జరిగింది.

కీ.శే. శివకవి ఎన్. శివనగౌడుగారు అనువదించిన 'శ్రీకృష్ణకర్ణామృతము' (పద్యానువాదం) గ్రంథాన్ని పి.ఇ.ఎస్.కళాశాలలో బహుభాషావేత్త, శతావధాని, సంస్కృత పండితుడు డా॥ ఆర్.గణేష్‌గారు ఆవిష్కరించారు. పి.ఇ.ఎస్. విద్యాసంస్థల సంస్థాపకులు ప్రొ॥ ఎం.ఆర్.దొరస్వామిగారు కృతిని స్వీకరించారు. ఆచార్య హెచ్.ఎస్.బ్రహ్మానందగారు (శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం) గ్రంథాన్ని పరిచయం చేశారు. ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు గారు అభినందనలు తెలిపారు. పి.ఇ.ఎస్.కళాశాల ప్రిన్సిపాల్ డా॥ ఎం. రుక్మాంగద నాయుడుగారు సభకు అధ్యక్షత వహించారు. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారి వందన

సమర్పణతో సభ జయప్రదంగా ముగిసింది. శివనగౌడుగారి పుత్రులు శ్రీయుతులు విశ్వనాథగౌడు, శ్రీనాథగౌడు, జగన్నాథగౌడుగారల సౌజన్యంతో, పి.ఇ.ఎస్. కళాశాల వారి సహకారంతో ఈ సభ ఏర్పాటు చేయబడింది.

## 4

### శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - 1

(శ్రీ వాసవి కన్యాకాపరమేశ్వరీ దేవాలయంలో)

**2-3-2007** శుక్రవారం, సాయంకాలం **6-00**గంటలకు

**'పోతన భాగవతం - రుక్మిణీ కల్యాణం'**

పౌరాణికులు: 'త్రిభాషా మహాసహస్రావధాని' 'సరస్వతీ పుత్ర' -'అభినవ శుక'

**శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు, ఎం.ఏ.**

('ప్రణవ పీఠం', ఏలూరు, పశ్చిమ గోదావరి జిల్లా)

సన్మానింపబడినవారు

**శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారు** (ప్రముఖ కథా రచయిత్రి, చిత్రకారిణి)

**డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు**, ఎం.ఏ., పిహెచ్.డి.

(ప్రముఖ కవయిత్రి, విశ్రాంత ఆంధ్రోపన్యాసకురాలు)

సౌజన్యం : **శ్రీమతి శ్రీలక్ష్మీకామత్‌గారు**

('ఆభరణ జ్యూయలర్స్' 1వ మెయిన్, మహాలక్ష్మీ లేఔట్, బెంగుళూరు)

## 5

### శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - *2*

**3-3-2007** శనివారం, సాయంకాలం **5-30**గంటలకు

గాంధీ సాహిత్యసంఘం, మల్లేశ్వరంలో

కీ.శే. ఆకెళ్ళ సీతామహాలక్ష్మి - డా॥ ఆకెళ్ళ నరసింహం దంపతుల

స్మారక సాహిత్యోపన్యాసం

విషయం : **శ్రీనాథ కవిసార్వభౌముని కవితా వైభవం**

వక్త : 'త్రిభాషా మహాసహస్రావధాని' 'సరస్వతీ పుత్ర' -'అభినవ శుక'

**శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు, ఎం.ఏ.**

('ప్రణవ పీఠం', ఏలూరు, పశ్చిమ గోదావరి జిల్లా)

సౌజన్యం:శ్రీమతి శ్యామల-డా.ఆకెళ్ళ సత్యసుబ్రహ్మణ్యకుమార్ దంపతులు
శ్రీమతి భారతీదేవి-డా. ఆకెళ్ళ అరుణ్‌కుమార్ దంపతులు
డా. లలితాలక్ష్మి-శ్రీ ఎస్.ఎల్.మూర్తి దంపతులు

6

శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - *3*

**4-3-2007** ఆదివారం, సాయంకాలం **5-30**గంటలకు,
గాంధీ సాహిత్యసంఘం, మల్లేశ్వరంలో
కీ.శే. డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారి స్మారక సాహిత్యోపన్యాసం

విషయం : "ముక్కు తిమ్మనార్య ముద్దుపలుకు-పారిజాతాపహరణం
వక్త : 'త్రిభాషా మహాసహస్రావధాని' 'సరస్వతీ పుత్ర' -'అభినవ శుక'
శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు, ఎం.ఏ.
('ప్రణవ పీఠం', ఏలూరు, పశ్చిమ గోదావరి జిల్లా)
సౌజన్యం : శ్రీమతి సీతామహలక్ష్మి -
డా॥చన్నాప్రగడ లక్ష్మీనరసింహమూర్తి దంపతులు
ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మి - శ్రీ ఎల్.ఎస్.బాబు దంపతులు

7

శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - *4*

**5-3-2007**, సోమవారం, సాయంకాలం **5-30**గంటలకు
గాంధీ సాహిత్యసంఘం, మల్లేశ్వరంలో
కీ.శే. వరకాల లక్ష్మారెడ్డి స్మారక సాహిత్యోపన్యాసం

విషయం : "ధూర్జటి కవితావైభవం"
వక్త : 'త్రిభాషా మహాసహస్రావధాని' 'సరస్వతీ పుత్ర' -'అభినవ శుక'
శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు, ఎం.ఏ.
('ప్రణవ పీఠం', ఏలూరు, పశ్చిమ గోదావరి జిల్లా)
సౌజన్యం :శ్రీమతి సత్యామునిరెడ్డి-పా॥వరకాల రామనరసింహారెడ్డి దంపతులు

## 8

### శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - 5

(శ్రీ వాసవి కన్యాకాపరమేశ్వరీ దేవాలయం, మల్లేశ్వరంలో)

**8-4-2007** శుక్రవారం, సాయంకాలం **6-00**గంటలకు

శ్రీమతి రోహిణీ సత్య రచించిన

### 'మమేకం' కవితా సంపుటి ఆవిష్కరణ

ముఖ్య అతిథి : 'దాసరాధేయ' శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు

ఆవిష్కర్త : శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారు

గ్రంథ పరిచయం : శ్రీమతి అంబికా అనంత్‌గారు, డా. దివాకర్ల రాజేశ్వరిగారు

అభినందన : శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారు

అల్పాహార సౌజన్యం : శ్రీలంక చంద్రశేఖరంగారు

వేదిక సౌజన్యం : శ్రీ ఆర్.పి. రవిశంకర్‌గారు

## 9

### శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - 6

(శ్రీ వాసవి కన్యాకాపరమేశ్వరీ దేవాలయం, మల్లేశ్వరంలో)

**9-4-2007** సోమవారం, సాయంకాలం **6-00**గంటలకు

శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారు రచించిన కావ్యముల ఆవిష్కరణ

### 'అక్షర దేవాలయము' ఖండకావ్య సంపుటి

ప్రకాశకులు : సన్ పబ్లిషింగ్ హౌస్, బెంగుళూరు

ఆవిష్కర్త : శ్రీ ఆర్.పి. రవిశంకర్‌గారు

కృతి స్వీకారం : శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు

కావ్య పరిచయం : డా|| మన్నవ భాస్కరనాయుడుగారు, తిరుపతి

### 'పురుషోత్తముడు' వీరమహాకావ్యము

ఆవిష్కర్త : శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు

కృతి స్వీకారం : ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారు

కావ్య పరిచయం : ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు

## 'మహిష శతకము' పద్యానువాదము

ఆవిష్కర్త : డా॥ ఆర్. గణేష్‌గారు
కావ్య పరిచయం : శ్రీ ఇంద్రకంటి పినాకపాణిగారు, మైసూరు
కవి సత్కారం : 'దాసరాధేయ' శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు
ప్రతిస్పందన : 'కవి రాజశేఖర' శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారు
సౌజన్యం : ప్రతిభా జ్యూయలరీ హౌస్, బెంగుళూరు
వేదిక సౌజన్యం : శ్రీ ఆర్.పి. రవిశంకర్‌గారు

## 10

శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - 7

**20-4-2007,** శుక్రవారం, సాయంకాలం **5-30**గంటలకు

గాంధీ సాహిత్యసంఘం, మల్లేశ్వరంలో

కీ.శే. ఎ. మునిస్వామి నాయుడుగారి స్మారక సాహిత్యోపన్యాసం

విషయం : "మహాభారతం - ఆధునిక జీవనం"
వక్త : శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావుగారు, ఎం.ఏ.
(రిటైర్డ్ ప్రిన్సిపాల్, సిద్దార్థ కళాశాల, విజయవాడ)
సౌజన్యం : శ్రీమతి ఎ. కాంతమ్మ మునిస్వామి నాయుడుగారు మరియు
శ్రీమతి రుక్మిణి - శ్రీ ఎ. రాజేంద్రనాయుడు దంపతులు

## 11

శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - *8*

**21-4-2007,** శనివారం, సాయంకాలం **5-30**గంటలకు

గాంధీ సాహిత్యసంఘం, మల్లేశ్వరంలో

కీ.శే. అగ్రహారం కృష్ణారెడ్డిగారి స్మారక సాహిత్యోపన్యాసం

విషయం : "రాయలవారి ఆముక్తమాల్యద"
వక్త : శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావుగారు, ఎం.ఏ.
అధ్యక్షులు : ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు
సౌజన్యం : శ్రీమతి రాధిక - శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డి దంపతులు

## 12

### శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - *9*

**22-4-2007,** ఆదివారం, సాయంకాలం **5-30**గంటలకు

గాంధీ సాహిత్యసంఘం, మల్లేశ్వరంలో

కీ.శే. సుబేదార్ మేజర్ ఎం. కృష్ణమనాయుడుగారి

స్మారక సాహిత్యోపన్యాసం

విషయం : పింగళి - కాటూరి కవివర్యుల 'సౌందర నందము'

వక్త : శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావుగారు, ఎం.ఏ.

సౌజన్యం : శ్రీమతి జలజాక్షి - డా॥ ఎం. రుక్మాంగదనాయుడు దంపతులు

## 13

### శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - *10*

**29-4-2007,** ఆదివారం, సాయంకాలం **5-30**గంటలకు

గాంధీ సాహిత్యసంఘం, మల్లేశ్వరంలో

కీ.శే. ఆనందమ్మ నారాయణ (కీ.శే. పి.ఎస్. నారాయణగారి ధర్మపత్ని)

స్మారక సాహిత్యోపన్యాసం

విషయం : "తిక్కన భారతం - స్త్రీ పర్వం"

వక్త : డా॥ బడ్డుపల్లి గిరిజాలక్ష్మి, ఎం.ఏ., పిహెచ్.డి.
(రీడర్, వేద సంస్కృత కళాశాల, నెల్లూరు)

అధ్యక్షులు : డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు

సౌజన్యం : శ్రీమతి శ్రీలలితాంబిక-శ్రీపి.ఎస్.వి. అనంతనారాయణ దంపతులు

## 14

### శ్రీ సర్వజిత్ సాహిత్యవసంతోత్సవం - *11*

**30-4-2007,** సోమవారం, సాయంకాలం **5-30**గంటలకు

గాంధీ సాహిత్యసంఘం, మల్లేశ్వరంలో

కీ.శే. తంగిరాల శకుంతలాదేవి ('భళ్ళమూడివారి చిట్టి')

స్మారక సాహిత్యోపన్యాసం

విషయం : "కాసుల పురుషోత్తమకవి శతకసౌందర్యం"

వక్త : డా॥ బడ్డుపల్లి గిరిజాలక్ష్మి, ఎం.ఏ., పిహెచ్.డి.

అధ్యక్షులు: శ్రీమతి అంబికా అనంత్‌గారు

సౌజన్యం : తంగిరాల వెంకటసుబ్బారావుగారి చిరంజీవులు -
కాళి - రాము - సీత - శీను - శశి

## 15

'త్రిభాషా మహాసహస్రావధాని' 'సరస్వతీ పుత్ర' -'అభినవ శుక'

### శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు, ఎం.ఏ.

('ప్రణవ పీఠం', ఏలూరు, పశ్చిమ గోదావరి జిల్లా)

### "శ్రీ భాగవత సప్తాహం"

**31-5-2007** గురువారం నుండి **6-6-2007** బుధవారం వరకు
ప్రతిదినం సాయంకాలం **6-00** నుండి రాత్రి **8-00** గంటల వరకు

వేదిక : శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరీ దేవాలయం,
8వ క్రాసు, (సంపిగె రోడ్డుకు-మార్గోసా రోడ్డుకు మధ్య), మల్లేశ్వరం, బెంగుళూరు-3.

శ్రీ భాగవత సప్తాహానికి ఆర్థిక సహాయం చేసిన వదాన్యులు

1. 'దానరాధేయ' శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు
2. శ్రీమతి డి.ఎ. తేజేశ్వరి - శ్రీ కె.ఎమ్. శ్రీనివాసమూర్తి దంపతులు
3. శ్రీమతి భారతి - శ్రీ కలవచర్ల గోపాలకృష్ణమూర్తి దంపతులు
4. శ్రీమతి ఎ. పాప - ప్రొ॥ డి.హెచ్. శాస్త్రి దంపతులు
5. శ్రీమతి కె. వనజాక్షి - శ్రీ ఓ.ఎల్. సూర్యనారాయణ దంపతులు
6. శ్రీమతి వనజ - శ్రీ ఎం.ఎన్. అనంతరామన్ దంపతులు

వేదిక సౌజన్యం : శ్రీ ఆర్.పి. రవిశంకర్‌గారు
(కార్యదర్శి: శ్రీ కన్యాకా పరమేశ్వరీ దేవాలయం ట్రస్టు)

సభా నిర్వహణ సహకారం : శ్రీమతి రమ-శ్రీ జి. శివరామ్ దంపతులు
మరియు మల్లేశ్వరం భక్తజనసభ సభ్యులు

## 16

### స్వర్గీయ బుచ్చిబాబుగారి 91వ జయంతి ఉత్సవం

**14-6-2007,** గురువారం, సాయంకాలం: **5.30**గంటలకు

వక్త : **ఆచార్య కాత్యాయనీ విద్మహేగారు,** ఎం.ఏ., పిహెచ్.డి.

(తెలుగు ప్రొఫెసర్, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు)

విషయం : "చివరకు మిగిలేది" నవల - వైశిష్ట్యం

అధ్యక్షులు: శ్రీ వి.వి.న మూర్తిగారు

(ప్రముఖ కథారచయిత, నవలా రచయిత, బెంగుళూరు)

వేదిక : **గాంధీ సాహిత్యసంఘం,** 8వ క్రాస్, (3వ మెయిన్‌కు - 4వ మెయిన్‌కు మధ్య)

మల్లేశ్వరం, బెంగుళూరు-560 003, ఫోన్‌నెం. 23311186.

సౌజన్యం : శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారు మరియు

శ్రీమతి సోనా - శ్రీ డి. బుచ్చివెంకటసుబ్బారావు దంపతులు

## 17

### ప్రసాదరావు పంతులుగారి షష్ట్యబ్దిపూర్తి మహోత్సవం - *1*

**17-8-2007,** శుక్రవారం, సాయంకాలం: **5-30**గంటలకు,

సత్కార సభ

### శ్రీమతి శ్రీలక్ష్మి-శ్రీదర్శి లక్ష్మీవేంకటేశ్వరవరప్రసాదరావు దంపతులకు పూర్ణకుంభ స్వాగతం, వేద పండితుల ఆశీస్సులు

పంతులుగారి పరిచయం: డా॥ దివాకర్ల రాజేశ్వరి

కవితాశీస్సులు : డా॥ మన్నవ భాస్కరనాయుడు, తిరుపతి

శ్రీ ఇంద్రకంటి పినాకపాణి, మైసూరు,

శ్రీ జి. చంద్రశేఖరరెడ్డి, హైదరాబాద్

డా॥ దివాకర్ల రాజేశ్వరి

వివిధ మిత్రులచే సత్కారం

పంతులుగారి రంగస్థల నటమిత్రులచే పద్యపఠనం

ప్రతిస్పందన : శ్రీ డి.ఎల్.వి.వి. ప్రసాదరావు పంతులు

## 18

ప్రసాదరావు పంతులుగారి షష్ట్యబ్దిపూర్తి మహోత్సవం - *2*

**18-8-2007**, శనివారం, సాయంకాలం: **5-30**గంటలకు,

సాహిత్య సభ

### 'శ్రీ లలితా సహస్రనామ వైభవం'

వక్త : 'ఆర్షవిద్యాసాగర'-'రామాయణ రసభారతి'-'ఉపన్యాస కళానిధి'-'సాహితీ బృహస్పతి'

శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాణమూర్తిగారు, ఎం.ఏ.

(రీడరు, మాతృశ్రీ ఓరియంటల్ కళాశాల, జిల్లెళ్ళమూడి, గుంటూరు జిల్లా)

## 19

ప్రసాదరావు పంతులుగారి షష్ట్యబ్దిపూర్తి మహోత్సవం - *3*

**19-8-2007**, ఆదివారం, సాయంకాలం: **5-30**గంటలకు,

సాహిత్య సభ

### 'సౌందర్య లహరి'

వక్త : 'ఆర్షవిద్యాసాగర' - 'రామాయణ రసభారతి' -
'ఉపన్యాస కళానిధి' - 'సాహితీ బృహస్పతి'

శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాణమూర్తిగారు, ఎం.ఏ.

(రీడరు, మాతృశ్రీ ఓరియంటల్ కళాశాల, జిల్లెళ్ళమూడి, గుంటూరు జిల్లా)

## 20

కీ.శే. విష్ణుభట్ల విశ్వనాథశాస్త్రి - కీ.శే. బాడాల రామయ్యగారల

స్మారక సాహిత్యోపన్యాసం

### ''కవిసార్వభౌమ శ్రీనాథుడు''

**10-10-2007**, బుధవారం, సాయంకాలం **5.30**గంటలకు

వక్త : ప్రముఖ రంగస్థల నటుడు, తెలుగు ఆచార్యుడు అయిన
డా॥ అక్కిరాజు సుందరరామకృష్ణగారు ఎం.ఏ., పిహెచ్.డి. (హైదరాబాద్)

అధ్యక్షులు : ప్రొ॥ రత్నాకరం శంకరనారాయణరాజుగారు

సౌజన్యం : 'దాసరాధేయ' శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు

వేదిక : గాంధీ సాహిత్యసంఘం.

## 21

## శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య
## బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు శాఖ
## కేంద్ర సాహిత్య అకాదెమి, దక్షిణప్రాంతీయ కార్యాలయం
## సంయుక్తంగా నిర్వహించిన
## ''పఠాభి - శేషేంద్ర స్మారక చర్చాగోష్ఠి ''ఆధునికాంధ్ర కవిత్వం''

**28** అక్టోబరు **2007**, ఉదయం **10.30** నుండి సాయంకాలం **6.00**గంటలవరకు

వేదిక : సెనెట్ హాల్, సెంట్రల్ కాలేజ్ ఆవరణ,
డా.బి.ఆర్. అంబేడ్కర్ వీథి, బెంగుళూరు - 560 001

స్వాగతోపన్యాసం : శ్రీ బాలగురుమూర్తి, ప్రాంతీయ కార్యదర్శి, సాహిత్య అకాదెమి

ప్రారంభోపన్యాసం : ప్రొఫెసర్ హెచ్.ఏ. రంగనాథ్
కులపతి, బెంగుళూరు విశ్వవిద్యాలయం

కీలకోపన్యాసం : ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు
శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య

ప్రత్యేక ఆహ్వానితులు: శ్రీమతి టి. నందనారెడ్డి, (పఠాభిగారి పుత్రిక)

*తేనేటి విరామం*

మొదటి సమావేశం ఉదయం **11.30** గంటలకు

అధ్యక్షులు : డా॥ అద్దేపల్లి రామమోహనరావు

మొదటి పత్రం : 'ప్రయోగవాదిగా పఠాభి' డా॥ కె. సంజీవరావు ('శిఖామణి')

రెండవ పత్రం : 'కవిగా శేషేంద్ర' శ్రీ గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డి

మూడవ పత్రం : 'విమర్శకుడుగా శేషేంద్ర' డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు

*భోజన విరామం:*

రెండవ సమావేశం మధ్యాహ్నం **2.30** గంటలకు

అధ్యక్షులు : డా॥ ఎండ్లూరి సుధాకరరావు

నాల్గవ పత్రం : 'ఆధునికోత్తర కాలంలో తెలుగు కవిత్వం'
డా. మన్నవ భాస్కరనాయుడు

ఐదవ పత్రం : 'తెలుగు కన్నడ భాషలలో స్త్రీవాద కవిత్వం'
డా. కట్టమంచి ఆశాజ్యోతి

ఆరవ పత్రం : 'తెలుగులో దళితకవిత్వం' డా. ఎండ్లూరి సుధాకరరావు

సమావేశకర్త : డా. దివాకర్ల రాజేశ్వరి

సాయంత్రం 5 గంటలకు సమాపనోపన్యాసం
శ్రీ సంజయ్‌వీర్‌సింగ్ ఐ.పి.ఎస్. రిజిస్ట్రార్, బెంగుళూరు వి.వి.

వందన సమర్పణ : ఆచార్య జి.ఎస్. మోహన్, తెలుగు శాఖాధ్యక్షులు.

## 22
## బహుభాషా కవితాగోష్ఠి

51వ ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవం + 51వ కన్నడ రాజ్యోత్సవం: ఈ రెండింటినీ పురస్కరించుకొని 1-11-2007నాడు, గాంధీ సాహిత్య సంఘంలో బహుభాషా కవితాగోష్ఠి నిర్వహింపబడింది. కుర్తాళం శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతి, పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామివారి సమక్షంలో ఈ కవితాగోష్ఠి జరిగింది. వేదపండితులు స్వామివారికి స్వాగతం పలికారు. వేదపండితుల ఆశీస్సులతో సభ ప్రారంభమయింది. శ్రీ వేంకటేశావధానిగారు శ్రీ మోక్షగుండం సుబ్బరామ రాఘవేంద్రశర్మగారు ఈ వేదపఠనంలో పాల్గన్నారు. మొదట ఆచార్య తంగిరాల కవితా నిర్వచనం చేశారు. తెలుగు, కన్నడం, సంస్కృతం, తమిళం, మలయాళం భాషలలో పలువురు కవులు తమ తమ కవితలను చదివారు. డా॥ ఆర్.గణేష్ (సంస్కృతం-కన్నడం); డా॥ మన్నవ భాస్కరనాయుడు; డా॥ దివాకర్ల రాజేశ్వరి, శ్రీమతి అంబికా అనంత్; శ్రీమతి ఆచంట హైమవతి; శ్రీమతి రోహిణీసత్య (తెలుగు + కన్నడం); శ్రీమతి అరిపిరాల సువర్ణ (తమిళం); శ్రీమతి మారుతీ శ్రీలత; శ్రీ ఎ. వేణుగోపాలమూర్తి; శ్రీ మార్కండపురం శ్రీనివాస (కన్నడం + తెలుగు); ప్రా॥ తంబిశెట్టి రామకృష్ణ; ప్రా॥ విజయ సుబ్బరాజు (కన్నడం); డా॥ సంధ్యారెడ్డి (కన్నడం); శ్రీ వై.యస్.కృష్ణమూర్తి (కన్నడం); శ్రీమతి ఇందిరాబాలన్ (మలయాళం). ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు ఈ గోష్ఠిలో పాల్గన్నారు. శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామివారు వేదపండితులను కవులను ఘనంగా సత్కరించారు. తరువాత ఆశుకవితాగానం చేశారు. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారి వందన సమర్పణతో సభ ముగిసింది.

## 23

## రామాయణ సప్తాహం

**2007,** డిసెంబరు **3**వ తేది సోమవారం నుండి డిసెంబరు **9**వ తేది ఆదివారం వరకు, ప్రతిదినము సాయంత్రం **6**గంటల నుండి రాత్రి **8**గంటల వరకు; శ్రీ వాసవి కన్యాకాపరమేశ్వరీ దేవాలయంలో వాల్మీకి రామాయణ సప్తాహం జరిగింది.

వక్త : ''రామాయణ ప్రవచన సుధాకర''-''రామాయణ సుధానిధి''

డా॥ మైలవరపు శ్రీనివాసరావుగారు (గుంటూరు)

సౌజన్యం : శ్రీమతి డి.ఎ. కల్పజ-శ్రీ ఆర్. ప్రేమచందర్ దంపతులు
ప్రొ॥ టి. వత్సల - ప్రొ॥ టి. రామకృష్ణ దంపతులు
శ్రీమతి లలిత-డా॥ పి.హెచ్. ప్రసాద్ దంపతులు
మరియు శ్రీరస శాశ్వత సభ్యులు

## 24

## 'శ్రీరస' సాహిత్యసభల పోషకులు

1. 'ధానరాధేయ' శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు.
2. శ్రీమతి సుజాత - శ్రీ ఎస్. సుబ్బరాజు దంపతులు.
3. శ్రీమతి డి.ఎ. తేజేశ్వరి - శ్రీ కె.ఎమ్. శ్రీనివాసమూర్తి దంపతులు.
4. శ్రీమతి డి.ఎ. కల్పజ - శ్రీ ఆర్. ప్రేమచందర్ దంపతులు
5. ప్రొ॥ టి. వత్సల - ప్రొ॥ టి. రామకృష్ణ దంపతులు.
6. శ్రీమతి టి. నందనారెడ్డి - శ్రీ వి.కె. హరీంద్ర దంపతులు.
7. శ్రీమతి రాధిక - శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డి దంపతులు
8. శ్రీమతి భారతి - శ్రీ కలవచర్ల గోపాలకృష్ణమూర్తి దంపతులు.
9. శ్రీమతి రుక్మిణి - శ్రీ ఎ. రాజేంద్రనాయుడు దంపతులు.
10. శ్రీమతి జలజాక్షి - డా॥ ఎం. రుక్మాంగదనాయుడు దంపతులు.
11. శ్రీయుతులు ఎస్.విశ్వనాథగౌడు, ఎస్.శ్రీనాథగౌడు, ఎస్.జగన్నాథగౌడు సోదరులు
12. శ్రీమతి శ్యామల - డా॥ ఆకెళ్ళ సత్యసుబ్రహ్మణ్యకుమార్ దంపతులు.

13. శ్రీమతి సత్యామునిరెడ్డి - ప్రొ॥ వి. రామనరసింహారెడ్డి దంపతులు
14. శ్రీ ఎ.ఎస్. చిన్నస్వామి రాజుగారు
15. శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మి (కీ.శే. బుచ్చిబాబుగారి భార్య)
16. చిరంజీవులు కాళి - రాము - సీత - శీను - శశి
17. ప్రొ. చన్నాప్రగడ జయలక్ష్మి - శ్రీ ఎల్.ఎస్. బాబు దంపతులు.
18. శ్రీమతి ఎ. పాప - ప్రొ॥ డి.హెచ్.శాస్త్రి దంపతులు.
19. శ్రీమతి కె. వనజాక్షి - శ్రీ ఒ.ఎల్. సూర్యనారాయణ దంపతులు.
20. శ్రీమతి వనజ - శ్రీ ఎం. ఎస్. అనంతరామన్ దంపతులు.
21. శ్రీమతి శ్రీలలితాంబిక - శ్రీ పి.యస్.వి. అనంత నారాయణ దంపతులు
22. శ్రీమతి సత్యవతి - శ్రీ బి.ఎం. రెడ్డి దంపతులు
23. శ్రీమతి గీతా డి. రాజు - శ్రీ కె. దొరస్వామి రాజు దంపతులు
24. శ్రీమతి ప్రేమకుమారి - శ్రీ పి. ఉమాపతిరాజు దంపతులు

## 25

## 'శ్రీరస' శాశ్వత సభ్యులు

1. డా॥ దివాకర్ల రాజేశ్వరి
2. శ్రీమతి అంబికా అనంత్
3. ఆచార్య పి.ఎస్. సుబ్రహ్మణ్యం
4. శ్రీ ఎ. వేణుగోపాలమూర్తి
5. శ్రీ సి. జయరామరెడ్డి
6. శ్రీ చిలకల వెంకటసుబ్బారెడ్డి
7. శ్రీ లంక చంద్రశేఖరం
8. శ్రీ ఎస్.కె. మోహన్
9. శ్రీ కె. కరణ్‌మోహన్ రెడ్డి
10. శ్రీ టి. సత్యశ్రీనివాస్
11. శ్రీ పువ్వాడ తిక్కనసోమయాజి
12. శ్రీ నిడమర్తి రామమోహనరావు
13. శ్రీమతి ఆచంట హైమవతి
14. శ్రీమతి టి.ఆర్.మీనలోచని
15. శ్రీమతి హైమాభార్గవ్
16. శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మి
17. శ్రీమతి మారుతీ శ్రీలత
18. శ్రీమతి తంగిరాల రేవతీశశిప్రియ
19. శ్రీమతి అరిపిరాల సువర్ణ
20. శ్రీ తాడిమేటి రాధాకృష్ణ
21. ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణ
22. శ్రీమల్లాది యజ్ఞనారాయణమూర్తి

23. శ్రీ మోదుగుల వేణుగోపాలరెడ్డి
24. శ్రీ పెద్ది సత్యనారాయణ
25. శ్రీ శ్రీరామగిరి శివకుమార్
26. కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి
27. శ్రీ నారపరాజు సుబ్బారావు
28. శ్రీ ఎం. మునికృష్ణ
29. శ్రీమతి పి. ఈశ్వరి
30. డా॥ లంక సూర్యప్రకాశరావు
31. శ్రీ కె.పి. శాస్త్రి
32. శ్రీ యు.ఆర్.ప్రసాద్
33. ప్రొ॥ వి.వి.ఎస్. శర్మ
34. శ్రీ వి. రాధాకృష్ణ శ్రేష్ఠి
35. శ్రీ ఎస్.ఆర్.కె. మూర్తి
36. శ్రీ వేదుల సుబ్రహ్మణ్యం
37. శ్రీమతి రోహిణీ సత్య
38. డా॥ పి.హెచ్. ప్రసాద్
39. శ్రీమతి తంగిరాల సీతామహాలక్ష్మి
40. శ్రీ డి.ఎల్.వి.వి. ప్రసాదరావు
41. డా॥ మన్నవ భాస్కరనాయుడు
42. శ్రీ గుత్తి చంద్రశేఖరరెడ్డి
43. డా॥ బి. ఆర్. మృత్యుంజయ
44. లెఫ్టినెంట్ కర్నల్ టి.కె. రావ్
45. శ్రీ ఇ.వి. సుబ్బారావు
46. శ్రీ పి. కృష్ణంరాజు
47. శ్రీ ఆర్. చంద్రశేఖరయ్య
48. ప్రొ॥ ఆర్. శంకరనారాయణరాజు
49. 'మహాకవి' గింజల నరసింహారెడ్డి

# తంగిరాల సాహిత్య డైరీ

## (2007 జనవరి నుండి డిసెంబరు వరకు)

**1. జనవరి 5,6,7 తేదీలు (శుక్ర, శని, ఆదివారాలు):** ఒంగోలులో ప్రకాశంజిల్లా రచయితలసంఘంవారు నిర్వహించిన రాష్ట్రస్థాయి రచయితల మహాసభలలో పాల్గన్నారు. 7వ తేదీనాడు ''జానపద కవిత్వం'' గురించి ప్రసంగించారు.

**2. జనవరి 5,6,8 నుండి 15 వరకు (శుక్రవారం నుండి - మంగళవారం - సంక్రాంతి వరకు):** నెల్లూరులో శ్రీ మెట్టు రామచంద్రప్రసాదుగారు స్థాపించిన పద్యకళాపరిషత్తువారు నిర్వహించిన ప్రబంధ మహోత్సవాలలో పాల్గన్నారు. 9వ తేదీనాడు పారిజాతాపహరణ ప్రబంధాన్ని గురించి ప్రసంగించారు.

**3. ఆగస్టు 12వ తేది (ఆదివారం):** ఇందిరానగర్ ఈస్టరన్ క్లబ్‌లో జరిగిన బహుభాషా కవిసమ్మేళనంలో పాల్గన్నారు. 'నా ముద్ద బంతిపువ్వు' అనే తెలుగు కవితను చదివారు.

**4. సెప్టెంబరు 21, 22, 23 తేదీలు (శుక్ర, శని, ఆదివారాలు):** విజయవాడలో కృష్ణాజిల్లా రచయితల సంఘంవారు నిర్వహించిన ప్రపంచ తెలుగు రచయితల మహాసభలలో పాల్గన్నారు. 21వ తేదినాడు జరిగిన జాతీయ కవి సమ్మేళనానికి అధ్యక్షత వహించారు.

**5. నవంబరు 4వ తేది (ఆదివారం):** బెంగుళూరులో ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘంవారు ఇచ్చిన తెలుగు భాషా పురస్కారాన్ని స్వీకరించారు. తెలుగు భాష ప్రాచీనతను గురించి ప్రసంగించారు.

**6. నవంబరు 10వ తేది (శనివారం):** కడపలో యోగివేమన విశ్వవిద్యాలయం వారి సి.పి.బ్రౌన్ పురస్కారాన్ని గ్రహించారు. సి.పి. బ్రౌన్‌గురించి, ఉయ్యాలవాడ నారసింహారెడ్డిని గురించి ప్రసంగించారు.

**7. నవంబరు 20వ తేది (మంగళవారం):** హైదరాబాద్‌లో విశ్వనాథ సాహిత్య పీఠంవారి "జయంతి" (శేషేంద్ర స్మృతిసంచిక) ఆవిష్కరణ సభలో పాల్గన్నారు. "శేషేంద్ర కవితా మహేంద్రజాలం" అనే అంశంపై ప్రసంగించారు.

**8. డిసెంబరు 15, 16 తేదీలు (శని, ఆదివారాలు):** తమిళనాడులోని హోసూరులో జరిగిన శ్రీకృష్ణదేవరాయ 498వ పట్టాభిషేకమహోత్సవాలలో పాల్గన్నారు. కీ.శే. కె.ఎస్. కోదండరామయ్యగారి స్మారక సాహిత్యసభకు అధ్యక్షత వహించారు. (ఈ సభలో డా॥ అద్దేపల్లి రామమోహనరావుగారు దేవులపల్లి కృష్ణశాస్త్రిని గురించి ప్రసంగించారు).

**"కవిత్వమొక విచిత్ర భాష. సామాన్యభాష కంటే భిన్నమైనది. కనుక అందరికీ అర్థమయ్యేదే కవిత్వమనీగానీ, కవిత్వం అందరికీ అర్థం కావాలని గానీ ఉత్తర్వులు జారీచేయడం సాహిత్యంలో తుగ్లక్ పరిపాలనలాంటిదవుతుంది" – శేషేంద్ర**

# ఆంధ్రసారస్వత విజ్ఞానసంఘం - అష్టావధానాలు

బెంగుళూరు శివాజీనగర్‌లో ఉన్న ఆంధ్రసారస్వత విజ్ఞానసంఘంవారు 1968 నుండి ఈనాటి వరకు, అంటే 2007 వరకు ప్రతిసంవత్సరం సంక్రాంతి పండుగ సమయంలో, తప్పకుండా ఒక అష్టావధానకార్యక్రమాన్ని ఏర్పాటుచేస్తూ వస్తున్నారు. ఈ సంఘం వ్యవస్థాపక అధ్యక్షులు విద్వాన్ నిడుమామిడి శ్రీకంఠరావుగారు; వ్యవస్థాపక కార్యదర్శి శ్రీ ఎస్.కె. నారాయణగారు. వీరిద్దరూ గత 40 సంవత్సరాలుగా అష్టావధాన కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగిస్తూ వస్తున్నారు. క్రింది 40 మంది అవధానులలో ముగ్గురు మాత్రం రెండుమార్లు అవధానాలు చేశారు.

- సంపాదకుడు

| క్రమ సంఖ్య | సంవత్సరం | అవధానిపేరు | ఊరు |
|---|---|---|---|
| 1. | 1968 | శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు | తిరుపతి |
| 2. | 1969 | శ్రీ సి.వి. సుబ్బన్నగారు | ప్రొద్దుటూరు |
| 3. | 1970 | శ్రీ నరాల రామారెడ్డిగారు | ప్రొద్దుటూరు |
| 4. | 1971 | శ్రీ అవధానం చంద్రశేఖర శర్మగారు | కడప |
| 5. | 1972 | శ్రీ మాచిరాజు శివరామరాజు | |
| 6. | 1973 | శ్రీ పేరాల భరతశర్మగారు | విజయవాడ |
| 7. | 1974 | శ్రీ ఆర్. అనంత పద్మనాభరావుగారు | కడప |
| 8. | 1975 | శ్రీ గండ్లూరి దత్తాత్రేయశర్మగారు | ద్రోణాచలం |
| 9. | 1976 | శ్రీ పైడిమఱ్ఱి వేంకట సత్యనారాయణ మూర్తిగారు | మైసూరు |
| 10. | 1977 | శ్రీ పమిడిముక్కల చెంచుసుబ్బయ్యగారు | లేపాక్షి |
| 11. | 1978 | శ్రీ మేడసాని మోహన్‌గారు | తిరుపతి |
| 12. | 1979 | శ్రీ పరిమి రామనరసింహంగారు | మైసూరు |
| 13. | 1980 | శ్రీ నరాల రామారెడ్డిగారు | ప్రొద్దుటూరు |
| 14. | 1981 | శ్రీ పమిడిముక్కల చెంచుసుబ్బయ్యగారు | లేపాక్షి |
| 15. | 1982 | శ్రీ సదానంద శాస్త్రిగారు | అనంతపురం |
| 16. | 1983 | శ్రీ మల్లికార్జున శర్మగారు | లేపాక్షి |

| | | | |
|---|---|---|---|
| 17. | 1984 | శ్రీ మునికృష్ణయ్యగారు | చిత్తూరు |
| 18. | 1985 | శ్రీ మాడుగుల నాగఫణిశర్మగారు | కడప |
| 19. | 1986 | శ్రీ రమాకాంత్‌గారు | అనంతపురం |
| 20. | 1987 | శ్రీ కోవూరి శర్మగారు | |
| 21. | 1988 | శ్రీ గండ్లూరి దత్తాత్రేయశర్మగారు | ద్రోణాచలం |
| 22. | 1989 | శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | |
| 23. | 1990 | శ్రీ రాళ్ళబండి కవితాప్రసాద్‌గారు | హైదరాబాద్ |
| 24. | 1991 | శ్రీ మాధవరాజుగారు | గంగావతి |
| 25. | 1992 | శ్రీమతి ప్రభావతిగారు | గుంతకల్లు |
| 26. | 1993 | శ్రీ కడిమిళ్ళ వరప్రసాదరావుగారు | నరసాపురం |
| 27. | 1994 | శ్రీ ఆశావాది ప్రకాశరావుగారు | పెనుకొండ |
| 28. | 1995 | శ్రీ మల్లికార్జున బాలావధాని | అమలాపురం |
| 29. | 1996 | శ్రీ ఆర్. గణేష్‌గారు | బెంగుళూరు |
| 30. | 1997 | శ్రీ వడిగేపల్లి నరసింహంగారు | |
| 31. | 1998 | శ్రీ గరికిపాటి నరసింహారావుగారు | కాకినాడ |
| 32. | 1999 | శ్రీ సురభి శంకరశర్మగారు | |
| 33. | 2000 | శ్రీ ఎ.వి. రమణప్రసాద్‌గారు | కొవ్వూరు |
| 34. | 2001 | శ్రీ వీరభద్రాచార్యులు | గుంతకల్లు |
| 35. | 2002 | చి॥ స్మిత మరియు చి॥ పావని (గీతాప్రజ్ఞావధానం) | ఆలపాడు |
| 36. | 2003 | శ్రీ కేసాప్రగడ సత్యనారాయణగారు | రాజమండ్రి |
| 37. | 2004 | శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు | ఏలూరు |
| 38. | 2005 | శ్రీ మాడుగుల అనిల్‌కుమార్‌గారు | తిరుపతి |
| 39. | 2006 | శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్‌గారు | విజయవాడ |
| 40. | 2007 | శ్రీ ధూళిపాళ మహదేవమణిగారు – మరియు కుమారి బులుసు అపర్ణ (విద్యార్థిని) | రాజమండ్రి |

ఎస్. శ్రీకంఠరావు
అధ్యక్షులు

ఎస్.కె. నారాయణ
కార్యదర్శి



శ్రీమతి శ్రీలక్ష్మి - శ్రీ డి.ఎల్.వి.వి. ప్రసాదరావు దంపతులు

